శ్రీరస్తు　　శుభమస్తు　　అవిఘ్నమస్తు

# శ్రీ హేమలంబనామ సంవత్సర దృక్సిద్ధ పంచాంగము 2017-18



## సంవత్సర ఫలితము

| | | | |
|---|---|---|---|
| కలియుగ శతాబ్ధములు | 5118 | శ్రీ శంకరాచార్య శతాబ్ధములు | 2089 |
| విక్రమార్క శతాబ్ధములు | 2074 | శ్రీ రామానుజాచార్య శతాబ్ధములు | 1000 |
| హిజరీ శతాబ్ధములు | 1937-38 | శ్రీ మధ్వాచార్య శతాబ్ధములు | 903 |
| భారతదేశ స్వాతంత్ర్య శతాబ్ధము | 70 | శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామ్యబ్ధము | 267 |
| శాలివాహనాబ్ధములు | 1939 | క్రీ. శ. 2017 - 2018 | |

## శ్రీ పెదగాడి వారి పంచాంగ ప్రారంభాది వర్తమాన సం॥లు - 21

శ్రీ హేమలంబ నామ సంవత్సరమునకు రాజు **"కుజుడు"** మంత్రి **శుక్రుడు,** సేనాధిపతి **బుధుడు,** సస్యాధిపతి **రవి,** ధాన్యాధిపతి **శని,** అర్ఘాధిపతి **గురుడు,** మేఘాధిపతి **గురుడు,** రసాధిపతి **కుజుడు,** నీరసాధిపతి **రవి,** పశుపాలకుడు **యముడు,** గోబహిష్కర్త **శ్రీకృష్ణుడు.**

## వాస్తు కర్తరీ నిర్ణయం

ది. **4-5-2017** వైశాఖ శు॥నవమిగురువారంమగం. 2-12ని॥ల నుండి **డొల్లుకర్తరి** ప్రారంభం

ది. **11-5-2017**గురువారం ఉ.గం. 11-49 ని॥లనుండి కృత్తికరూప **నిజకర్తరి** ప్రారంభం

ది. **28-5-2017** జ్యేష్ఠ శు॥ తదియ ఆదివారం రా గం. 7-09 ని॥లనుండి **కర్తరీ త్యాగం.**

## మౌఢ్య నిర్ణయము

### గురుమౌఢ్యమి

ది. **11-10-2017** ఆశ్వయుజ బ॥ షష్ఠి బుధవారం **గురుమౌఢ్యమి** ప్రారంభం

ది. **11-11-2017** కార్తీక బ॥ అష్టమి శనివారం గురుమౌఢ్యత్యాగం

### శుక్రమౌఢ్యమి

గత సం॥రం ది. **20-3-2017** నుండి ప్రారంభం అయిన **శుక్రమౌఢ్యమి**

ది. **31-3-2017** చైత్ర శు॥ తదియ శుక్రవారం **త్యాగం** అగును.

ది. **29-11-2017** మార్గశిర శు॥ దశమి బుధవారం నుండి **శుక్రమౌఢ్య ప్రారంభం**

ది. **20-02-2018** ఫాల్గుణ శు॥ పంచమి మంగళవారం **శుక్రమౌఢ్య త్యాగం.**

## పుష్కర నిర్ణయము

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ హేమలంబ నామ సంవత్సర భాద్రపద బ॥ సప్తమి మంగళవారం అనగా ది.**12-9-2017** తేదీ ఉ॥ గం.**7-25** ని॥లకు కృత్తిక నక్షత్రయుక్త కన్యాలగ్నమందు గురుడు **తులరాశి** యందు ప్రవేశించుటచే ది.**12-9-2017** నుండి ది.**23-9-2017** తేదీ వరకు **12** రోజులు **శ్రీ కావేరీ నది** పుష్కరము.

## చాంద్రమానాబ్ద ఫలము

చాంద్రమానము ప్రకారము ఈ సంవత్సరము "హేమలంబ" లేక "హేవళంబి" నామ సంవత్సరమని పిలువబడును. ఈ హేమలంబ నామ సంవత్సరమున రాజులు పరస్పర విరోధము కలిగియుందురు. ప్రజలకు బాధలు కలుగును. ధరలు తగ్గును. జనులు సుఖవంతులగుదురు.

## బార్హస్పత్యమానాబ్ధఫలము

బార్హస్పత్యమానము ప్రకాంము ఈ సంవత్సరము "విరోధికృతు" నామ సంవత్సరమని పిలువడును. ఈ "విరోధికృతు" నామ సంవత్సరమును రాజులు, జనులు పరస్పర విరోధము కలిగియుందురు. పంటలు, ధరలు, వర్షములు మధ్యమముగా నుండును.

## గురు దయాబ్ధఫలము

గురుడు ది. 11-11-2017 తేదీ కార్తీక బ॥ అష్టమి శనివారం స్వాతి నక్షత్రమందు ఉదయించుటచే, ఈ సంవత్సరము "చైత్రాబ్ధము" అని పిలువబడును. ఈ చైత్రబ్ధమునందు రాజులు స్వస్థులగుదురు. భూమి స్వల్పముగా ఫలించును. శిరోబాధలు లేక జనులు సుఖించెదరు. సజ్జన ప్రేమ అధికముగానుండును.

## వర్షాడక వాయు నిర్ణయము

రాజుకాజుడగుటచే రెండు తూములు వర్షము కలుగుటచే వర్షాధార పంటలకు సామాన్యఫలము, 4 ఆఢకములు వాయువు కలుగును. నవమేఘ పక్షమున "కాల" నామక మేఘము దక్షణ దిక్కునందు మేఘోత్పత్తి కలుగును. నిరంతరం వర్షములు కురియును. మధ్యదేశములందు మహాజలం కలుగును. సర్వధాన్యాములు ఫలించును.

## జ్యేష్ట శు॥ప్రతి పద్యుక్త వారఫలము

జ్యేష్ట శుక్లపాఢ్యమి గురువారమగుటచే జనులు సుభిక్షము కలిగి క్షేమారోగ్య వంతులగుదురు. మంచి వర్షములు కలిగి సస్యములు వృద్ధి పొందును. సమస్త జనులు సుఖించెదరు.

## ఆషాడ శు॥ పంచమీయుక్త వారఫలము

ఆషాడ శు॥పంచమి బుధవారం నందు వ్యాపించి యుండుటచే సుభిక్షము, ఆరోగ్యము కలిగి జనులు వృద్ధి నొందుదురు.

## ఆషాడ శుక్ల నవమి చిత్తా సంయుతా ఫలము

ఆషాడ శుద్ధ నవమి చిత్తా నక్షత్ర సంయుక్తముగా నుండుటచే సర్వసస్యములు సమృద్ధిగా ఫలించును. రైతులు మోదముతో నుందురు.

## ఆషాడ కృష్ణ ఏకాదశి రోహిణి సంయుతాఫలము

ఆషాడ కృష్ణ ఏకాదశి నందు రోహిణీ నక్షత్రమందు ప్రారంభమగుటచే సర్వధాన్యములు అభివృద్ధి నొందును. మంచివర్షములు కురుయును.

## పుష్య బ॥ అమావాస్య ప్రయుక్త వారఫలము

పుష్య బహుళ అమావాస్య బుధవారమగుటచే జనవృద్ధి కలుగును.

# శ్రీ హేమలంబ గ్రహణ నిర్ణయములు



## ది. 7-8-2017 పాక్షిక చంద్రగ్రహణం

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ హేమలంబ నామ సంవత్సర శ్రావణ శు॥ పూర్ణిమ సోమవారం అనగా ది. 7-8-2017 శ్రవణా నక్షత్రయుక్త మేష లగ్నమందు కేతు గ్రస్త పాక్షిక చంద్ర గ్రహణము సంభవించుచున్నది.

| స్పర్శ | మధ్య | మోక్ష | పుణ్యకాలం |
|---|---|---|---|
| రా 10:53 | రా 11:50 | రా 12:48 | గం 1:55 ని॥ |

### గ్రహణశాంతి

ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ఠ నక్షత్రముల వారు మకర, కుంభ, సింహరాశి వారు గ్రహణ శాంతిని ఆచరించవలెను.

## ది. 31-1-2018 సంపూర్ణ చంద్రగ్రహణం

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ హేమలంబనామ సంవత్సర మాఘ శు॥ పూర్ణిమ బుధవారం అనగా ది. **31-1-2018** పుష్యమి/ఆశ్లేష నక్షత్రయుక్త, కర్కాటక లగ్నమందు రాహుగ్రస్త సంపూర్ణ చంద్ర గ్రహణము సంభవించుచున్నది.

| స్పర్శ | నిమీలన | మధ్య | ఉన్మీలన | మోక్ష | పుణ్యకాలం |
|---|---|---|---|---|---|
| సా 5:18 | రా 6:22 | రా 7:00 | రా 7:38 | రా 8:41 | గం॥3.23ని॥లు |

### గ్రహణశాంతి

పుష్యమి-ఆశ్లేష-మఘ నక్షత్రములవారు కర్కాటక, మకర రాశులవారుగ్రహణ శాంతిని ఆచరించవలెను. గ్రహణ ప్రారంభాంత్యముల యందు స్నానమాచరించవలెను. చంద్రబింబం దానము ఇవ్వవలెను.

### గ్రహణ స్నాన భోజన నిర్ణయము

గ్రహణ ప్రారంభాత్యములయందు 6గంటలు భుజింపరాదు. పిల్లలు, రోగపీడితులు, మనోవ్యాధి కలవారలు, పెద్దలు, 3గంటలు ప్రారంభాంత్యముల యందును భుజింపరాదు. యతులు ఒకరాత్రి, పగలు ఉపసింపవలెను.

**శ్లో ॥ గ్రస్యమానే భవేత్స్నానం గ్రస్తేహోమోర్క చంద్రయోః !**
**మండలే ముచ్యమానేతు దానం ముక్తౌతు మజ్జనమ్ !!**

గ్రహణము పట్టుచుండగా స్నానము, గ్రహణముపూర్ణముగా పట్టిన పిదప జపహోమము లను, విడచుచుండగా దానమును, విడిచిన తరువాత స్నానమునుఆచరింపవలయును.

ఆదివారం సూర్యగ్రహణము, సోమవారం చంద్రగ్రహణము “చూడామణి” యోగమనబడును. ఇవి యోగసాధకులకు మిక్కిలి ప్రశస్తమైనవి

# శ్రీ హేమలంబ నామ సంవత్సర ఫలితము - 2017 - 18

ప్రస్తుత సంవత్సరమును చాంద్రమాన వశముచే **"హేమలంబ"** నామ సంవత్సరమనియు బార్హస్పత్యమానముచే **విరోధికృతు** నామ సంవత్సరమనియు గురూదయవశమున **చైత్రాబ్ధ** మనియు పంచయుగాత్మకమందు **సంవత్సర** మనియు వ్యవహరించెదరు.

ఈ హేమలంబ నామ సంవత్సరమునకు రాజు కుజుడు నవనాయకులలో 4గురు శుభులు, 5గురు పాపువైరి, 21మంది ఉపనాయకలలో 9మంది శుభాలు, 12మంది పాపువైరి

## శ్రీహేమలంబ నామ సంవత్సర వర్షలగ్న విశ్లేషణ

ది. 28-3-2017 తేదీ ఉ. 8.26 ని॥లకు



| | | |
|---|---|---|
| 2 3 | ల కుబు | చం రశు కే |
| 4 | వర్ష లగ్నం | 5 |
| 5 రా 6 గు | 7 | 8 9 శ |




ఈ సంవత్సరము వర్షలగ్నము పరిశీలించగా మేషలగ్నము లగ్నమునందు బుధ, కుజులు, పంచమమునందు రాహువు షష్టస్థానమునందు గురుడు, నవమమునందు శని, లాభమందు కేతువు వ్యయమునందు రవి, చంద్ర శుక్రులు కలరు.

మేషలగ్నాధిపతియగు కుజుడు లగ్నమునందుండుటచే తెలుగు ప్రజావని సుఖసౌఖ్యములు కలిగియుందురు. ధనాధిపతియగు శుక్రుడు ఉచ్ఛయందుండుటచే ధనవృద్ధికి లోటు లేదు. ప్రజలు జీవన ప్రమాణము పెరుగును. ధనవృద్ధి కలుగును. శుక్రుడు చతుర్థ, పంచమాధి పతులైన చంద్ర, రవిలతో కలసియుండుటచే గృహనిర్మాణ పథకములు అమలు బాగుండును. వాహనవృద్ధి కలుగును. మాతృప్రేమ కలిగియుందురు. తృతీయాధిపతియగు బుధుడు లగ్నమునందుండుటచేతను లగ్నాధిపతితో కలసియుండుటచేతను, సోదరవృద్ధి, కలిగి ప్రజలు ధైర్యవంతులై పరస్పర సహకారముతో యుందురు.

చతుర్థాధిపతి యగు చంద్రుడు వ్యయస్థానముందుండుటచే గృహనిర్మాణ, ప్రాజెక్టు నిర్మాణములు మందంగించును. అధిక వ్యయమగును. వాహన ప్రమాదములు అధికమగును. పంచమాధిపతియగు రవి వ్యయమందుండుటచే జనులు సంతాన సౌఖ్యములేకుందురు. ఆపరేషను జననములు పెరుగును. సంతానార్థులైజనులు వైద్యశాలాదర్శనములు చేయుదురు. పంచమరాహువుచే ఆసుపత్రులు పెరుగును.

షష్టాధిపతియగు బుధుడు లగ్నమందుండుటచే జనులు శతృపీడితులు కాగలరు. ఋణబాధలు హెచ్చును. అనారోగ్యములపాలగుదురు. ప్రభుత్వమునకు ఋణబాధ పెరుగును. వివిధ కార్యక్రమాలు నిర్వహణకై అప్పులు చేయవలసివచ్చును. షష్ట గురునిచే సమయానికి ధనము సర్దుబాటుకాక ఇతరులపై ఆధారపడవలసివచ్చును. సప్తమాధిపతియగు శుక్రుడు ఉచ్ఛయందుండుటచే రికార్డుస్థాయిలో వివాహము జరుగును. భార్యభర్తలు అన్యోన్య జీవనము సాగింతురు. విడాకుల కేసులు కూడా పెరుగును. అష్టమాధిపతి యగు కుజుడులగ్నాధిపతియై స్వస్థానగతుడగుటచే ప్రజలు ఆరోగ్యవంతులై, ఆయుష్మంతులై ఉందురు. నవమాధిపతియగు గురుడు షష్టస్థానగతుడగుటచే రవాణాశాఖ కష్టము లెదుర్కొను. దేవాదాయ, ధర్మాదాయ శాఖలో కుంభకోణములు పెరుగును. నవమ శనిచే భక్తి పెరుగును.

దశమాధిపతియగు శని నవమందుండుటచే నిరుద్యోగులకు నిరాశ కలుగును. ప్రభుత్వము నూతనోద్యోగములు భర్తీ చేయజాలదు. లాభాధిపతియగు శని నవమందుండుటచే ప్రభుత్వమునకు పన్నుల రూపేణా ఆదాయము తగ్గును.

వర్తకుల వ్యాపారములయందు లాభములు సామాన్యముగానుండును. వ్యయాధిపతియగు గురుడు షష్టస్థానముందుండుటచే వ్యయ నియంత్రణ జరుగును. వ్యయమున ఉచ్ఛశుక్రుడు ఉండుటచే ప్రజలు వివాహాది శుభకార్యములకు ధనవ్యయము చేయుదురు. ప్రభుత్వము సైతము ఆర్భాటములకు ధనవ్యయము చేయును.

# శ్రీహేమలంబ నామ సంవత్సర జగల్లగ్న విశ్లేషణ



## ది. 13-4-2017 తేదీ తె గం. 2-02 ని॥లకు

| | | |
|---|---|---|
| కు 5 / 6 | 4 ర బు | శు 3 / 2 కే |
| 7 | జగత్ లగ్నం | 1 ల |
| 8 రా / 9 గు | 10 చం | 12 శ / 11 |



శ్రీ హేమలంబ నామ సంవత్సర జగల్లగ్నానుసారము మకరలగ్నాధిపతియగు శని వ్యయమందుండుటచే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు ఖర్చులు పెరుగును. పాలన మందకొడిగా సాగును. తరచు కుంభకోణములు వెలుగుచూచుచుండును. మంత్రి వర్గముపై విమర్శలు పెరుగును. వారు అప్రమత్తులై పాలన సాగించవలయును. ద్వితీయాధిపతియగు శని వ్యయమం దుండుటచే ప్రభుత్వ ఆదాయ వనరులు క్షీణించును. పన్నులు రాబడి తగ్గును. నూతన పన్నులు వేయవలసివచ్చును. ప్రభుత్వము ప్రజల విమర్శలకులోనగును. ద్వితీయ కేతువుచే బాబాలు, స్వామిజీల హవా కొనసాగును.

తృతీయాధిపతియగు గురుడు నవమ కోణమందుండి స్వస్థాన వీక్షణచేయుటచే విదేశీ సహకారము లభించును. సైన్యముపై ఖర్చు పెరుగును. తృతీయమునకు శుక్రుడుఉచ్ఛస్తు డైయుండుటచే విదేశీమారకద్రవ్యము పెరగగలదు. చతుర్థాధిపతియగు కుజుడు పంచమము నుండుటచే గృహనిర్మాణ పథకము వేగముగానుండును. నూతన వాహనములు ప్రవేశించును. **ISRO** క్రొత్త ఉపగ్రహములు విజయవంతముగా అంతరిక్షములో ప్రవేశపెట్టగలదు. విశేష ప్రపంచఖ్యాతి నార్జించగలదు. చతర్థ రవిచే వృద్ధులకు కష్టకాలము, చతర్థ బుధునిచే వాహన ప్రమాదములు పెరుగును.

పంచమాధిపతియగు శుక్రుడు ఉచ్ఛస్థుడై ఉండుటచే ప్రజలు సంతానవంతులగుదురు. రికార్డుస్థాయిలో శిశుజననములు జరుగును. పాలన ప్రజారంజకముగా నుండును. ప్రజలు స్వేచ్ఛాసక్తులై ఆనందముగానుందురు. మత్తుపదార్థవినియోగము పెరుగును. మద్యపానము పెరుగును. పంచమ కుజునిచే ప్రజలు ఆపరేషన్లకు ధనవ్యయము చేయుదురు. ప్రభుత్వములకు వైద్యపరమైన నిర్వహణ పెరుగును. షష్టాధిపతియగు బుధుడు చతుర్థమునుండుటచే సరిహద్దులలో ఉద్రిక్త వాతావరణము ఉండును.

సప్తమాధిపతియగు చంద్రుడు లాభస్థానమందుండుటచే భార్యాభర్తల మధ్య అన్యోన్యత, ప్రేమానురాగాలు విలసిల్లగలవు. దేశవ్యాప్తంగా యువతీయువకులకు వివాహములు జరుగగలవు. విదేశీయులతో వివాహములు జరుగుటకు ఆస్కారమున్నది. అష్టమాధిపతియగు రవి ఉచ్ఛస్థుడై ఉండుటచే వాహనప్రమాదములు పెరుగును. ఆయుఃప్రమాణము తగ్గును. అష్టమ రాహువుచే విమాన, నౌకా, రైలు ప్రమాదములు జరుగగలవు. గుండె సంబంధిత వ్యాధులతో ప్రజలు ఆస్పత్రుల పాలగుదురు.

నవమాధిపయగు బుధుడు చతుర్థమందుండుటచే పాలకులు విదేశీబాట పట్టగలరు. వివిధ కార్యక్రమాల రీత్యా విదేశీ పర్యాటకులు పెరుగును. నిరుద్యోగులు విదేశీ ఉద్యోగములు పొందగలరు. విదేశీమారక ద్రవ్యము పెరుగును. మన దేశ తయారీ వస్తువులు విదేశములకు ఎగుమతికాగలవు. ఆదరణ పెరుగును. దశమాధిపతియగు శుక్రుడు ఉచ్ఛస్థుడై ఉండుటచే నిరుద్యోగులకు ఉద్యోగములు వచ్చును. నూతన వ్యాపారములు ప్రారంభం కాగలవు. పెట్టుబడి దారులకు అనుకూలకాలము.

లాభాధిపతియగు కుజుడు పంచమకోణమందుండుటచే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములకు ఆదాయము పెరుగును. రక్షణ రంగమునకు కేటాయింపులు పెరుగును. లాభచంద్రునిచే జల సంబంద వ్యాపారులకు అనుకూలము, వ్యయాధిపతియగు గురుడు నవమ స్థానముందుండుటచే లోటు బడ్జెట్‌తో ప్రభుత్వములు సతమతమగును. వ్యయ శనిచే పాలన మందగించును.

# భారతదేశమున జరుగు ముఖ్య విశేషాంశములు

## ఏప్రియల్ 1 నుండి జూన్ 30 వరకు

ఈ కాలమందలి గ్రహస్థితులననుసరించి దేశమంతటా మంచి వర్షములు కురియును. పంటలు బాగుగా పండును. సుఖసంతోషములు వెల్లివిరియగలవు. ధనప్రవాహము పెరుగును. ప్రజాపాలన మందకొడిగా సాగును. సాంకేతికత తగ్గును. సరిహద్దులలో ఉద్రేక వాతావరణముండును. **ISRO** ఖ్యాతి పెరుగును. మన ఉపగ్రహ వ్యవస్థలను అంతరిక్షమున ప్రవేశపెట్టును. **గోశాలలు పెరుగును.**

## జూలై 1 నుండి సెప్టెంబర్ 30 వరకు

భారతదేశవ్యాప్తముగా ఆర్థిక మోసములు బయటపడగలవు. కాంట్రాక్టర్లకు అత్యంత అనుకూలము, నూతన పథకములు ప్రవేశపెట్టబడును. మంత్రులపై అవినీతి ఆరోపణలు రాగలవు. తుఫాన్ల భయము పొంచి ఉన్నది. సముద్రము అల్లకల్లోలముగా నుండగలదు. విదేశీ కంపెనీలు భారతదేశ వ్యాపారమును ఆకర్షింతురు. విదేశీమోజు పెరుగును. ప్రజలు భక్తిపరులై దేవాలయ సందర్శనములతో నుందురు.

## అక్టోబర్ 1 నుండి డిసెంబరు 31 వరకు

రాజకీయ నాయకులు జైలు పాలగుదురు. నూతన ఆర్థిక మోసములు బయటపడగలవు. విదేశీ బ్యాంకులు దివాలా తీయగలవు. భారత ఆర్థిక పరిస్థితి మందగించును. రూపాయి విలువ దిగజారును. బ్యాంకుల వడ్డీ రేట్లు తగ్గును. బంగారు, వెండి లోహము రేట్లు పెరుగును. గృహనిర్మాణములు రికార్డు స్థాయిలో జరుగగలవు. నూతన ప్రాజెక్టులు నత్తనడకన నడచును. నౌక, విమాన, రైలు ప్రమాద సూచనలున్నవి.

## జనవరి 1 నుండి మార్చి 17 వరకు

స్వదేశీ వస్తు సేకరణ పెరుగును. నూతన విద్యా, వైద్యాశాలలు పెరుగను. దేశమంతయు భక్తి ఉద్యమం పెరుగగలవు. నూతన దేవాలయ నిర్మాణములు పెరుగగలవు. షేర్‌మార్కెట్ నిలకడగా నుండును. సినిమా పరిశ్రమ అభివృద్ధి చెందగలదు. విదేశీ దురాక్రమణకు అవకాశమున్నది. సరిహద్దుల ఉద్రిక్తతముగా నుండును. విదేశీ వ్యవహారములపై వత్తిడి పెరుగగలదు.

## శ్రీ హేమలంబ సంవత్సర ఫలం

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | అశ్వని | పుష్యమి | స్వాతి | అభిజిత్తు | యుద్ధభయం |
| 2. | భరణి | ఆశ్లేష | విశాఖ | శ్రవణం | భూషణలాభము |
| 3. | కృత్తిక | మఘ | అనూరాధ | ధనిష్ట | రోగభయము |
| 4. | రోహిణి | పుబ్బ | జ్యేష్ట | శతభిషం | ఆయుష్యము |
| 5. | మృగశిర | ఉత్తర | మూల | పూర్వాభాద్ర | అర్థలాభం |
| 6. | ఆరుద్ర | హస్త | పూ॥షాఢ | ఉత్తరాభాద్ర | మనస్తాపము |
| 7. | పునర్వసు | చిత్త | ఉత్తరాషాఢ | రేవతి | రాజపూజ్యము |

# శ్రీ హేమలంబ నవనాయక ఫలములు



**రాజు-కుజుడు :** ఈ సంవత్సరమునకు రాజు కుజుడు అగుటచే రాజవిరోధమధికము, అగ్నిభయము, చోరభయము, రోగభయమధిక మగును. భూమి సస్యరహితమగును. సర్పభయమధికమగును.



**మంత్రి-శుక్రుడు :** ఈ సంవత్సరమునకు మంత్రి శుక్రుడగుటచే స్త్రీ, పురుషులు పరస్పర ఆకర్షణలకు లోనగుదురు. ధాన్యము విశేషముగా నుండును. గోవులు సమృద్ధిగా పాలిచ్చును. సువృష్టియు కలుగును.



**సేనాధిపతి-బుధుడు :** ఈ సంవత్సరమునకు సేనాధిపతి బుధుడగుటచే వాయువుతో కూడిన మేఘములొకానొకప్పుడు వర్షించుచుండును. పంటలు సంపూర్ణముగాపండును. స్త్రీ పురుషులు కామ పీడితులగుదురు.



**సస్యాధిపతి-రవి :** ఈ సంవత్సరము సస్యాధిపతి రవి యగుటచే గోధుమ, యవ, ఉలవ, సెనగ మొదలగు సర్వధాన్యములు సంపూర్ణముగ పండగలవు.



**ధాన్యాధిపతి-శని :** ఈ సంవత్సరము ధాన్యధిపతి శనియగుటచే భూమియంతయూ నల్లని సూక్ష్మ ధాన్యములు సమస్తము ఫలించును నల్లని నేలలు ఫలించును.



**అర్ఘాధిపతి-గురుడు :** అర్ఘాధిపతి గురుడగుటచే భూమియంతయు సువృష్టియు, ధనధాన్యసమృద్ధి యగును. బ్రాహ్మణు యజ్ఞములా చరింతురు. మంగళవాద్యములతో నుత్సవంబులు దేశమంతటా జరుగును.



**మేఘాధిపతి-గురుడు :** ఈ సంవత్సరము మేఘాధిపతి గురుడుగుటచే భూమి సస్యములతో, వెలలతో, వర్షములతో కూడియుండును. జనులందరూ రోగభయము లేక యుందురు.



**రసాధిపతి-కుజుడు :** ఈ సంవత్సరము రసాధిపతి కుజుడుగుటచే నూనెలు, నెయ్యి, నువ్వులు, బెల్లము, వెండి, ఉప్పు మొదలగు రసవస్తువులు వెలలు తగ్గియుండును.



**నీరసాధిపతి-రవి :** ఈ సంవత్సరము నీరసాధిపతి రవియగుటచే రాగి, మంచిగంధము, రత్నములు, మాణిక్యములు, ముత్యములు వృద్ధి యగును.

## ఉపనాయక నిర్ణయం

| | | |
|---|---|---|
| 1. పురోహితుడు - రవి | 8. గజాధిపతి - రవి | 15. వృక్షాధిపతి - శని |
| 2. పరీక్షకుడు - శని | 9. పశ్వాధిపతి - గురుడు | 16. జంగమాధిపతి - రవి |
| 3. గణకుడు - కుజుడు | 10. దేవాధిపతి - రవి | 17. సర్పాధిపతి - కుజుడు |
| 4. గ్రామపాలకుడు - గురుడు | 11. పురుషాధిపతి - బుధుడు | 18. మృగాధిపతి - బుధుడు |
| 5. దైవజ్ఞుడు - బుధుడు | 12. గ్రామాధిపతి - శని | 19. శుభాధిపతి - కుజుడు |
| 6. రాష్ట్రాధిపతి - కుజుడు | 13. వస్త్రాధిపతి - కుజుడు | 20. స్త్రీలకధిపతి - గురుడు |
| 7. ఉద్యోగాధిపతి - శుక్రుడు | 14. రత్నాధిపతి - గురుడు | 21. అశ్వాధిపతి - శుక్రుడు |

## మకర సంక్రమణ పురుష లక్షణము

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ హేమలంబ నామ సంవత్సర పుష్య బII త్రయోదశి ఆదివారం అనగా ది. 14-01-2018 తేదీ మ. గం. 1-35 ని॥లకు మూల నక్షత్ర ధృవయోగ వణజికరణయుక్త వృషభలగ్నమందు సూర్యుడు మకరరాశియందు ప్రవేశించును.

## సంక్రాంతి పురుషుడు "ఘోరా" నామం - 'మహిషము' వాహనం

### నామస్నానాది ఫలములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. నామం | ఘోరా | శూద్రులకునాశం | అవస్థ | లోలముఖము | వర్షములు తక్కువ |
| 2. స్నానం | అగరు | సువృష్టి | చేష్ట | కూర్చొనియుండుట | మధ్యమ ధరలు |
| 3. వస్త్రం | కంబళి | మునినాశకరము | దిక్కు | వాయువ్యం | వాయువ్య దేశాలకరిష్టము |
| 4. గంధం | వసాగంధము | విషనాశనము | తిథి | బII త్రయోదశి | జలప్రళయము |
| 5. పుష్పం | నల్లకలువ | ఫలనాశనము | వారము | ఆదివారం | వ్యాధిభయము |
| 6. ఆభరణం | పగడము | దుష్టనాశనము | నక్షత్రం | మూల | గొప్పవర్షము |
| 7. పాత్ర | తగరపాత్ర | రోగప్రదము | యోగము | ధృవ | శుభము |
| 8. ఆహారం | పెరుగు | తేజోనాశం | కరణము | వణజి | సౌఖ్యము |
| 9. ఫలము | తాటిపండు | వెలలు అధికం | కాలము | మధ్యాహ్నం | విప్రనాశనము |
| 10. ఆయుధం | తోమారము | యుద్ధప్రదము | లగ్నము | వృషభం | సుఖదు:ఖము |
| 11. ఛత్రము | మయూర | అమృతత్వము | ముహూర్తం | 10 | శుభప్రదము |
| 12. వాహనము | మహిషము | ఆకలి | మాసము | పుష్య | దంబప్రదం |
| | | | పక్షము | బహుళ | సుభిక్షము |





# కందాయ ఫలములు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | 1 | 1 | 4 | మఘ | 4 | 1 | 2 | మూల | 7 | 1 | 5 |
| భరణి | 4 | 2 | 1 | పుబ్బ | 7 | 2 | 4 | పూర్వాషాఢ | 2 | 2 | 2 |
| కృత్తిక | 7 | 0 | 3 | ఉత్తర | 2 | 0 | 1 | ఉత్తరాషాఢ | 5 | 0 | 4 |
| రోహిణీ | 2 | 1 | 5 | హస్త | 5 | 1 | 3 | శ్రవణం | 0 | 1 | 1 |
| మృగశిర | 5 | 2 | 2 | చిత్త | 0 | 2 | 5 | ధనిష్ట | 3 | 2 | 3 |
| ఆరుద్ర | 0 | 0 | 4 | స్వాతి | 3 | 0 | 2 | శతభిషం | 6 | 0 | 5 |
| పునర్వసు | 3 | 1 | 1 | విశాఖ | 6 | 1 | 4 | పూర్వాభాద్ర | 1 | 1 | 2 |
| పుష్యమి | 6 | 2 | 3 | అనురాధ | 1 | 2 | 1 | ఉత్తరాభాద్ర | 4 | 2 | 4 |
| ఆశ్లేష | 1 | 0 | 5 | జ్యేష్ట | 4 | 0 | 3 | రేవతి | 7 | 0 | 1 |

ఇందలి బేసి సంఖ్యలు ధనలాభమును, సమ సంఖ్యలు సమఫలితమును, శూన్య సంఖ్య, శూన్య ఫలితమును ఇచ్చును. మొదటి సున్న రోగభయము, మధ్యనున్న మనోభయము, చివరి సున్న హానిని ఇచ్చును. ఒక్కొక్క సంఖ్య 4 మాసములు ఫలమునిచ్చును.

# ఆదాయ వ్యయములు-రాజపూజ్యావ మానములు

| రాశి | ఆ | వ్య | రాజ | అవ | రాశి | ఆ | వ్య | రాజ | అవ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేష | 8 | 14 | 4 | 3 | తుల | 2 | 8 | 1 | 5 |
| వృషభం | 2 | 8 | 7 | 3 | వృశ్చికం | 8 | 14 | 4 | 5 |
| మిధునం | 5 | 5 | 3 | 6 | ధనస్సు | 11 | 5 | 7 | 5 |
| కర్కాటకం | 14 | 2 | 6 | 6 | మకరం | 14 | 14 | 3 | 1 |
| సింహం | 2 | 14 | 2 | 2 | కుంభం | 14 | 14 | 6 | 1 |
| కన్య | 5 | 5 | 5 | 2 | మీనం | 11 | 5 | 2 | 4 |

# శ్రీ హేమలంబ నామ సంవత్సర మాస చక్రం

| మాసములు | అశ్వని మఘ మూల | భరణి పుబ్బ పూ.షా | కృత్తిక ఉత్తర ఉ.షా | రోహిణీ హస్త శ్రవణం | మృగశిర చిత్ర ధనిష్ట | ఆర్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ.భా | పుష్యమి అనూరాధ ఉ.భా | ఆశ్లేష జ్యేష్ట రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చైత్రం | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ |
| వైశాఖం | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు |
| జ్యేష్ట | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర |
| ఆషాడం | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ |
| శ్రవణం | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ |
| భాద్రపదం | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు |
| ఆశ్వీయుజం | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర |
| కార్తీకం | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర |
| మార్గశిరం | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ |
| పుష్యం | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు |
| మాఘం | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర |
| పాల్గుణం | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర |

# మాసాధిపతుల ఫలములు

**1. రవి :** పనుల తొందర, ఒత్తిడి, ఆలస్యం, తూర్పు ప్రయాణం, దు:ఖం, శిరోవేదనం, భయం, రాజభీతి, నిరుత్సాహం, ఆశాభంగం, శ్రమ, కోపం. **శాంతి :-రుద్రాభిషేకం, సూర్యస్తుతి**

**2. చంద్రుడు :** మాతృసౌఖ్యం, దధ్యన్నసౌఖ్యం, స్త్రీ సంభోగసుఖం, మనోనైర్మల్యం, ఆనందం గౌరవం, కృషి వ్యాపారాదులు, పెద్దల దర్శనం, సర్వకళాత్మభావం, లలిత కళల పట్ల కౌశల్యం, సంతాన పోషణం. **శాంతి పార్వతి దర్శనం - లలితా సహస్ర పారాయణం.**

**3. గురు :** ధనలాభం, గురు ఆదరణం, జ్ఞానం, సుఖం, భార్యకు ఆభరణములు, సంతాన సౌఖ్యం, ప్రయాణం, మంచి వస్త్రధారణం, స్థిరవృద్ధి, శాస్త్ర విజ్ఞానం, ధైర్యం, సర్వశుభం, శివదర్శనం. **శాంతి - నమక చమక రుద్రాభిషేకం.**

**4. రాహు :** అశ్రుత, స్మశాన దర్శనం, దైన్యం, వ్యసనం, కడుపునందు, బొడ్డునందు వ్యాధి, కోపం, ధననష్టం, ప్రయాణంలో దొంగలభయం, గుండెజబ్బు, క్షయ, ఉబ్బసమువంటి దీర్ఘరోగ బాధ. **శాంతి దుర్గారాధన - శ్రీ దుర్గా సహస్ర పారాయణం.**

**5. బుధ :** బంధుగోష్టి, విద్వజ్జన సంగమం, వర్తకజన స్నేహం, వ్యాపారవృద్ధి, భవిష్యత్ ఆలోచనలు, హాస్య సంభాషణ, ధనలాభం, ప్రయత్నసిద్ధి. **శాంతి :- విష్ణు సహస్రపారాయణం**

**6. శుక్రుడు :** తెల్లనిబట్టలు ధరించుట, పరిమళద్రవ్యోపయోగము, స్త్రీ సంభోగ సౌఖ్యం, నూతన పరిచయములు, స్థిరలాభం, మధుర పదార్థలాభం, ధనలాభం, స్త్రీ లాభం, గోలాభం, సర్వసుఖం. **శాంతి లక్ష్మీస్తోత్రం - శ్రీలక్ష్మీ సహస్ర పారాయణం.**

**7. కేతువు :** బంధువైరం, దుష్టస్త్రీ పీడ, మనశ్చాంచల్యం, దైవభక్తి, అతికోపం, దీర్ఘతర్కం, పుణ్యకర్మలు, స్వల్పాధికారం కలుగుతుంది. పాముపల్ల ప్రమాదం, తరచు నష్ట ద్రవ్యలాభం, ప్రాయశ్చిత్తాదివ్రత కర్మాచరణం, క్రతుదీక్షా తత్పరత. **శాంతి : సూర్య నమస్కారములు**

**8. శని :** జంతువుల వలన భయం, నల్లని వస్త్ర లాభం, కోపం, పరపీడ, నీచభయం, దుర్వార్తా శ్రవణం, నీచకార్యాచరణము బుద్ధి మాంద్యం, అనవసర ప్రసంగం, విరక్తి, గర్భశూల, గుండెపోటు. **శాంతి : రుద్రాభిషేకం, తైలాభిషేకం, శనిస్తుతి.**

**9. కుజుడు :** అధికారుల బెడద, ఆయుధముల వలన భయం, కార్యనాశనం, మనస్తాపం, మన:కాఠిన్యం, దక్షిణ నైఋతి దిశాప్రయాణం, ఔషధసేవ, ధనమునకు ఇబ్బంది, ఆకారణ విరోధం, రక్తదర్శనం, ఒత్తిడులు, పనులలో ఆటంకం. **శాంతి : కుజస్తుతి, సుబ్రహ్మణ్య ఆరాధన**

# శ్రీహేమలంబ నామ సంవత్సర పండుగలు

### చైత్రమాసము
### మార్చి 2017

28. శ్రీహేమలంబ ఉగాది తెలుగు సంవత్సరాది పంచాంగ శ్రవణం
29. చంద్రదర్శనం
30. సౌభాగ్య గౌరీవ్రతం
31. గణేశపూజ

### శుక్రమౌఢ్యమిత్యాగం
### ఏప్రియల్ 2017

1. శ్రీపంచమి, లక్ష్మీపూజ మత్స్య జయంతి
3. సూర్యదమనారోపణం
5. శ్రీరామనవమి
8. శనిత్రయోదశి
10. మదనపూర్ణిమ
14. మేషసంక్రాంతి
22. వరూధిని ఏకాదశి
24. మాసశివరాత్రి

### వైశాఖమాసము

27. చంద్రదర్శనం
28. అక్షయతృతీయ సింహాచల చందనోత్సవం
29. గంగాస్నానం
30. ఆదిశంకరాచార్యజయంతి

### మే 2017

1. మేడే
4. **చిన్నకర్తరిప్రారంభం**
5. శ్రీవీరబ్రహ్మేంద్రస్వామి జయంతి, శ్రీవాసవి కన్యకా జయంతి మల్లవరం శ్రీచల్లాలమ్మ వారి నవరాత్రారంభం
6. అన్నవరంశ్రీసత్యదేవకళ్యాణం
10. వైశాఖ పూర్ణిమ
11. నిజకర్తరీ ప్రారంభం
14. సంకష్టహరచతుర్థి
21. శ్రీహనుమజయంతి
24. మాసశివరాత్రి
25. అమావాస్య

### జ్యేష్టమాసము

27. చంద్రదర్శనం
28. కర్తరీ త్యాగం, రంభాతృతీయ
31. వనగౌరీవ్రతం

### జూన్ 2017

4. నిర్జల ఏకాదశి
5. చంపక ద్వాదశి
8. వటసావిత్రివ్రతం
9. ఏరువాకపూర్ణిమ-వృషభపూజ
20. యోగినీఏకాదశి
22. మాసశివరాత్రి
23. అమావాస్య

### ఆషాడమాసము

25. చంద్రదర్శనం పూరీజగన్నాధరధయాత్ర
27. భౌమచతుర్థి
28. స్కందపంచమి
29. కుమారషష్టి
30. వివస్వతసప్తమి

### జూలై 2017

3. దిగ్దేవతాదశమి
4. తొలిఏకాదశి, చాతుర్మాసారంభం
8. గురుపూర్ణిమ
11. చాతుర్మాస్యవిదియ
12. సంకష్టహరచతుర్థి
16. కటక సంక్రాంతి -దక్షిణాయనంప్రారంభం
19. కాముక ఏకాదశి
21. మాసశివరాత్రి
22. చొల్లంగి అమ్మావాస్య

### శ్రావణ మాసము

24. చంద్రదర్శనం
25. స్వర్ణగౌరీవ్రతం
26. నాగులచవితి
27. నాగపంచమి
28. గరుడపంచమి శిరియాళషష్టి
30. భానుసప్తమి

### ఆగష్టు 2017

1. శ్రావణమంగళగౌరీవ్రతం
2. దధివ్రతారంభం
3. పవిత్ర ఏకాదశి,గురువారేకాదశి
4. వరలక్ష్మి వ్రతం
5. శనిత్రయోదశి
7. జంధ్యాలపూర్ణిమ, రక్షాబంధనం,చంద్రగ్రహణం
8. గాయిత్రి జయంతి శ్రావణ మంగళగౌరీ వ్రతం
11. సంకష్టహరచతుర్థి
14. శీతలావ్రతం
15. శ్రీకృష్ణాష్టమి
16. వైష్ణవకృష్ణాష్టమి
18. అజ ఏకాదశి
19. శనిత్రయోదశి
20. మాసశివరాత్రి

### భాద్రపదమాసము

23. చంద్రదర్శనం, గజగౌరీ వ్రతం
24. వరాహ జయంతి
25. వినాయక చవితి
26. ఋషిపంచమి
27. పాపహరషష్ఠి
28. అముక్తా భరణసప్తమి
29. దూర్వాష్టమి
30. నందనవమి
31. గజలక్ష్మీ వ్రతం

### సెప్టెంబర్ 2017

1. పరివర్తన ఏకాదశి
2. వామన జయంతి
5. అనంతపద్మనాభవ్రతం
6. మహాలయపూర్ణిమ పితృపక్షారంభం
8. ఉండ్రాళ్ళ తదియ
9. సంకష్ట హరచతుర్థి
10. భరణి మహాలయం
11. చంద్రషష్ఠి
12. కావేరీ పుష్కరారంభము
13. మధ్యాష్టమి, బుధాష్టమి
16. జయ ఏకాదశి
17. విశ్వకర్మజయంతి, గజచ్ఛాయ
18. మాసశివరాత్రి
19. విషశస్త్రాదిహత జననాంమహాలయం

### ఆశ్వయుజ మాసము

21. శరన్నవరాత్రారంభం, చంద్రదర్శనం
23. కావేరి పుష్కరసమాప్తి
25. ఉపాంగ లలితావ్రతం
27. మూల సరస్వతీ పూజ
28. దుర్గాష్టమి
29. మహర్నవమి, ఆయుధ పూజ
**30. విజయదశమి, శమీపూజ**

### అక్టోబర్ 2017

1. పాశాంకుశ ఏకాదశి
2. పద్మనాభద్వాదశి
5. వాల్మీకి జయంతి
8. అట్లతదియ, సంకష్టహరచతుర్థి
**11. గురుమౌఢ్యారంభం**
12. కాళీజయంతి
15 రమాఏకాదశి
17. ధన్వంతరీ జయంతి
18. నరకచతుర్ధశి, మాసశివరాత్రి
19. దీపావళి-లక్ష్మీపూజ

### కార్తీక మాసము

20. కార్తీక స్నానారంభము బలిపాడ్యమి
21. చంద్రదర్శనం యమద్వితీయ భగినీ హస్తభోజనం
22. త్రిలోచనగౌరీ వ్రతం
23. నాగులచవితి-వల్మీకపూజ
24. జ్ఞానపంచమి
26. మహాషష్టి
28. గోపాష్టమి
29. అక్షయనవమి
30. యాజ్ఞవల్క్యజయంతి
31. ఉద్థాణ ఏకాదశి

### నంబరు 2017

1. చిలుకద్వాదశి
2. వైకుంఠచతుర్ధశి
3. కార్తీకపూర్ణిమ-కేదారేశ్వర వ్రతం, జ్వాలాతోరణం
4. గురునానక్‌జయంతి
7. సంకష్టహరచతుర్థి
**11. గురుమౌఢ్యమి త్యాగం**
14. ఉత్పన్న ఏకాదశి
15. గోవత్స ద్వాదశి-దీపదానం
16. మాసశివరాత్రి
18. అమావాస్య

### మార్గశిర మాసము

20. చంద్రదర్శనం
24. సుబ్రహ్మణ్యషష్టి
25. మిత్ర సప్తమి
26. కాలభైరవాష్టమి
28. మధ్యనవమి
**29. శుక్రమౌఢ్యమిప్రారంభం**
30. గురువారేకాదశి

### డిశెంబర్ 2017

1. హనుమద్వ్రతం
3. దత్తాత్రేయ జయంతి
6. సంకష్ట హరచతుర్థి
9. త్రిస్రోష్టకాలు
11. శ్రీఈశ్వరమ్మఆరాధన
13. సఫల ఏకాదశి
15. ధనుర్మాసారంభం
16. మాసశివరాత్రి శనిత్రయోదశి
17. వకుళ అమావాస్య
18. అమాసోమవారవ్రతం

### పుష్యమాసము

19. చంద్రదర్శనం
24. తుళువషష్టి
26. మహారుద్రాష్టమి
28. సాంబదశమి
29. ముక్కోటి ఏకాదశి

### జనవరి 2018

1. పూర్ణిమ-అమృతసిద్ధి యోగము
5. సంకష్ట చతుర్థి
12. సత్తల ఏకాదశి
**13. భోగి,**
13. భీమవరం శ్రీ మావుళ్ళమ్మ అమ్మవారివార్షికోత్సవాలు ప్రారంభం
**14. సంక్రాంతి**
**15. కనుమ-మాసశివరాత్రి**
16. అమావాస్య

### మాఘ మాసము

18. మాఘ స్నానారంభం, చంద్రదర్శనం
19. శ్రీ వాసవి ఆత్మార్పణదినం
21. తిలచతుర్థి
22. శ్రీపంచమి
24. రథసప్తమి
25 భీష్మాష్టమిఅంతర్వేదితీర్థం
27. భీష్మ ఏకాదశి
30. మహామాఘి-సింధుస్నానం
31. సంపూర్ణ చంద్రగ్రహణం

### ఫిబ్రవరి 2018

3. సంకష్ట చతుర్థి
9. విజయ ఏకాదశి
14. మహాశివరాత్రి

### ఫాల్గుణ మాసము

17. చంద్రదర్శనం
19. పుత్రగణపతివ్రతం
20. **శుక్రమౌఢ్యమిత్యాగం**
26. అమలక ఏకాదశి
27. నృసింహ ద్వాదశి
28. కామదహనం టైలర్స్ డే

### మార్చి 2018

1. హోళికా పూర్ణిమ
2. వసంతోత్సవం
5. సంకష్టహరచతుర్థి
13. స్మార్తఏకాదశి
15. మాసశివరాత్రి
17. క్రొత్తఅమవాస్య

# శ్రీహేమలంబ నామ సంవత్సర వస్తువుల ధరలు నిర్ణయం

**చైత్రమాసము :** పసుపు, కుంకుమ, పువ్వులు, బట్టలు, బంగారం, వెండి, రాగి, రసవస్తువులు, సుగంధ ద్రవ్యములు,బార్లి, నువ్వులు, జనపనార, ఇత్తడి లోహపాత్రలు, ఉల్లిపాయలు, కూరగాయల ధరలు పెరుగును. ఇనుము, కంకర, సిమెంటు ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగానుండును.

**వైశాఖ మాసము :** ఎండుఉసిరి, ఖర్జూర, ఎండుద్రాక్ష, జీడిపప్పు, బాదం, డ్రైఫ్రూట్స్, సకల ధాన్యములు, జాజికాయ, జాపత్రి, దూది వస్తువులు ఎలక్ట్రానిక్ వస్తువులు ధరలు పెరుగును. ఉప్పు, నూనెలు, రంగులు, తోళ్ళు, కొబ్బరి, బెల్లం, పంచదార ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగా ఉండును.

**జ్యేష్టమాసము :** పట్టుబట్టలు, రసవస్తువులు, సుగంధద్రవ్యములు, నువ్వులు, నూలు, గోధుమలు, మినుములు, ధాన్యం, మిరపకాయలు, పాదరసము, నవరత్నములు కంబళ్ళు ధరలు పెరుగును. పశు సంపద ఉప్పు గుఱ్ఱములు, ఏనుగులు, విద్యుత్‌పరికరములు ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగా ఉ ండును.

**ఆషాఢమాసము :** బంగారము, సమస్త ధాన్యములు, దూది, కుంకుళ్ళు, తెల్లని వస్తువులు, ప్లాస్టిక్ వస్తువులు, విద్యుత్ పరికరములు, నవరత్నములు, వెండి వస్తువులు, పెట్రోల్, డిజీల్ గ్యాస్ ధరలు పెరుగును. గోధుమలు, ఉప్పు, నూనెలు, రంగులు, తోళ్ళు, గృహ నిర్మాణ సామాగ్రి, వస్త్రములు, లవంగాలు, మిరియాలు, శొంఠి ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగా ఉండును.

**శ్రావణమాసము :** సమస్త ధాన్యములు, దారము, దూది, బఠానీలు, రంగులు, కంచు, పచ్చకర్పూరం ధరలు సామాన్యము గృహనిర్మాణ సామాగ్రి, విద్యుత్, వైద్యపరికరములు, ఔషధములు, పశువుల మందుల ధరలు పెరుగును. వాహనములు, చింతపండు, పింగాణి, బెల్లం, జనపనార, ఇత్తడి లోహ పాత్రలు ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగా ఉండును

**భాద్రపదమాసము :** తవుడు, పాత ధాన్యము, తేయాకు, రబ్బరు, ఇత్తడి, రాగి, బొంబాయిరవ్వ, గంజి పిండి, పాదరసము, చెరకు, బెల్లం, సగ్గుబియ్యం, మెంతులు, అవిసెలు, రాగులు ధరలు పెరుగును. కంద మూలాలు, కొబ్బరి కాయలు, కోడిగుడ్లు, మాంసము, కర్పూరం, మొక్కజొన్నలు, ప్రింటింగు వస్తువులు, రంగులు ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగా ఉండును.

**ఆశ్వయుజమాసము :** కందులు, కందిపప్పు, శనగపప్పు, ఆముదము, బంగారం, వెండి, రాగి, లోహము, తొళ్ళు, రబ్బరు, కాగితము, గోధుమపిండి, నవరత్నములు, గృహనిర్మాణ సామాగ్రి ధరలు పెరుగును. గోనెసంచులు, పువ్వులు, సుగంధద్రవ్యములు, వంటనూనెలు, టీ, కాఫీ గింజలు, గాజుపాత్రలు ధరలు తగ్గను. మిగిలినవి ధరలు నిలకడగా నుండును.

**కార్తీక మాసము :** అన్నిరకముల లోహములు,ద్రావకం, కొబ్బరి, కొబ్బరినూనె, ఉల్లి, అల్లం, దుంపకూరలు, రసాయన ఎరువులు, మందులు, జీడిపప్పు, చందనం ధరలు పెరుగును. గాజుసామాన్లు, ఫినాయిల్, కాగితము, ఇనుము, ఇనుప సామాన్లు, సున్నం, నూనెలు కలప ధరలు తగ్గను.

**మార్గశిరమాసము :** పసుపు, కుంకుమ, ఇంగువ, అల్లము, జాజికాయలు, పోకచెక్కలు, పగడములు, ముత్యములు, ఏనుగులు, గుఱ్ఱములు, పశువులు, మేకలు, గొఱ్ఱెలు, వరి, గోధుమలు, పెసలు, మినుములు, బెల్లం, పంచదార, కొబ్బరి, వక్కలు ధరలు పెరుగును. నూలు, ముతకనూలు, తాళ్ళు, నారసంచులు, పెట్రోలు, గ్యాస్, డీజిల్ ధరలు తగ్గను.మిగిలినవి నిలకడగా ఉండును.

**పుష్యమాసము :** వస్త్రాలు, ఇస్తళ్ళు, రబ్బరు, సిమెంటు, కలప, ఇనుప సామాన్లు, పింగాణి వస్తువులు, తోళ్ళు, విద్యుత్ పరికరములు, ఎలక్ట్రానిక్ పరికరములు, పగడము, ముత్యము ధరలు పెరుగును. సాంబ్రాణి, అవిసెలు, చందనము, కర్పూరము, నెయ్యి, ఉప్పు, పంచదార, కంచు, రాగి, జాతిరత్నములు, పాదరసము, ఎండుమిర్చి ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగా ఉండును.

**మాఘమాసము :** బార్లి, ఆవాలు, తోలు, పాతధాన్యాము, ప్లాస్టిక్ వస్తువులు, ఫైనాయిల్, సిమెంటు, రంగులు, ఇనుము, ఉక్కు, సున్నం, సుగంధ ద్రవ్యములు, విదేశివస్తువులు, వాహనములు ధరలు పెరుగును. కూరగాయలు, పువ్వులు, ప్రత్తి, నూనెలు, ఉప్పు, పంచదార, కలప, వైద్యపరికరములు, ఔషధములు ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగా ఉండును.

**ఫాల్గుణ మాసము :** పాలు, పెరుగు, నెయ్యి, కొబ్బరికాయలు, అరటి, దానిమ్మ పళ్ళు, చింతపండు, నూనెలు, పిప్పళ్ళు, శొంఠి, తవుడు, ఖర్జూరం, మొక్కజొన్న, ఎలక్ట్రానిక్ వస్తువులు, కిరోసిన్, పెట్రోల్, డీజిల్ ధరలు పెరుగును. పొకచెక్కలు, బ్లీచింగ్, జీడిపప్పు, దారములు, దూది, చర్మములు ధరలు తగ్గను. మిగిలినవి నిలకడగా ఉండును.

# వర్షయోగములు

**చైత్రమాసము :** చైత్రమాస గ్రహస్థితిననుసరించి ఈ నెల అంతయూ అచ్చుటచ్చుట వర్షములు, జల్లులు గాలులు, ఎండ, అధిక ఉష్ణోగ్రత ఉండును. ఏప్రియల్ 1,3,4,7,9,16,20 తేదీలలో సామాన్య వర్షములు కురియును. ఎండలు అధికము.

**వైశాఖ మాసము :** వైశాఖ మాసగ్రహస్థితిననుసరించి ఈ నెల అంతయూ మేఘాడంబరము అకాల వర్షములు కురియును. గాలిదుమారములు చిరుజల్లులు ఉండును. మే 2,7,16,18,21 తేదీలలో అచ్చుటచ్చుట వర్షములు కురియును.

**జ్యేష్టమాసము :** జ్యేష్టమాస గ్రహస్థితిననుసరించి ఈ నెలలో తొలకరి ప్రారంభమగును. మంచి వర్షములు కురియును. జూన్ 7,10,12,16,18,20,23,24 తేదీలలో వర్షములు కురియును. జూన్ 20,21 తేదీలలో తుఫాను సూచనలున్నవి.

**ఆషాడమాసము :** ఆషాడ మాస గ్రహస్థితిననుసరించి ఈ నెల అంతయూ సస్యానుకూల వర్షములు కురియును. తుఫాను సూచనలున్నవి. జూన్ 25,27 జూలై 2,3,7,8,10, 12,14,15,19,23 తేదీలలో వర్షములు కురియును.

**శ్రావణమాసము :** శ్రావణ మాస గ్రహస్థితిననుసరించి సస్యానుకూలవర్షములు ఈ నెల అంతయూ కురియును. జూలై 25,28,30 ఆగష్టు 1,3,5,9,13,15,18,21 తేదీలలో వర్షములు కురియును. ఆగష్టు 5,9,13 తేదీలలో తుఫాను సూచనలున్నవి.

**భాద్రపదమాసము :** భాద్రపద మాస గ్రహస్థితిననుసరించి సస్యానుకూల అధిక వర్షములు ఈ నెల అంతయూ కురియును. ఆగష్టు 23,25,29,30 సెప్టెంబరు1,3,5,8, 9,10,15, 16,17,20 తేదీలలో వర్షములు కురియును. 15,16,17 తేదీలలో తుఫాను సూచనలున్నవి.

**ఆశ్వయుజమాసము :** ఆశ్వయుజ మాస గ్రహస్థితిననుసరించి ఈ నెల అంతయూ పొడి వాతావరణమున్నది. సెప్టెంబర్ 23,25,అక్టోబర్ 2,3,8,10,15,18,19 తేదీలలో చిరుజల్లులు, వర్షములు కురియును.

**కార్తీక మాసము :** కార్తీక మాస గ్రహస్థితిననుసరించి ఈ నెల అంతయూ పొడి వాతావరణం కొనసాగును. అక్టోబరు 21,24,27,29 నవంబరు 3,5,8,12,14,16 తేదీలలో చిరుజల్లులు, వర్షములు కురియును.

**మార్గశిరమాసము :** మార్గశిర మాసగ్రహస్థితి ననుసరించి ఈ నెల చలివాతావరణం కొనసాగును. నవంబరు 19,21,23,25,27,డిశంబరు 3,8,13,15,18 తేదీలలో చిరుజల్లులు, వర్షములు కురియును.

**పుష్యమాసము :** పుష్యమాస గ్రహస్థితిననుసరించి ఈ నెల అంతయూ చలి పొడి వాతావరణము ఉండును. డిశంబరు 20,23,28,31 జనవరి 2,4,7,10,12 తేదీలలో స్వల్ప వర్షములు కురియును.

**మాఘమాసము :** మాఘ మాస గ్రహస్థితిననుసరించి ఈ నెల అంతయూ పొడివాతావరణము, చిరుజల్లులు జనవరి 20,22,24,29 ఫిబ్రవరి 2,3,5,11,14 తేదీలలో కురియును.

**ఫాల్గుణ మాసము :** పాల్గుణ మాస గ్రహస్థితిననుసరించి ఈ నెల అంతయూ పొడి వాతారణముండును. ఫిబ్రవరి 18,20,25 మార్చి 2,3,5,8,12,15 తేదీలలో చిరుజల్లులు కురియును. ఎండ పెరుగును.

# 2017-2018 శ్రీ హేమలంబ నామ సంవత్సర అశ్వనాధి కార్తెల వర్ష సూచనలు

| కార్తె | తేది | వారం | సమయం | చంద్రనక్షత్రం | వాహనం | వృష్టి | విశేష ఫలం |
|---|---|---|---|---|---|---|---|
| రేవతి | 31-3-2017 | శుక్ర | మ 12.31 | కృత్తిక | మేక | అల్పవృష్టి | గాలిదుమారములు - జల్లులు |
| అశ్వని | 13-4-2017 | గురు | తె 2.02 | విశాఖ | గాడిద | అల్పవృష్టి | అధికవేడి - గాలిదుమారములు-మేఘాడంబరం |
| భరణి | 27-4-2017 | గురు | సా 5.26 | కృత్తిక | నక్క | అల్పవృష్టి | అచ్చటచ్చట చిరుజల్లులు - మేఘాడంబరం |
| కృత్తిక | 11-5-2017 | గురు | ఉ 11.49 | విశాఖ | గుఱ్ఱము | పర్వతవృష్టి | పర్వత ప్రాంతములు వర్షములు |
| రోహిణి | 25-5-2017 | గురు | ఉ 7.55 | కృత్తిక | గుఱ్ఱము | పర్వతవృష్టి | అచ్చటచ్చట సామాన్య వర్షములు |
| మృగశిర | 8-6-2017 | గురు | ఉ 6.06 | అనూరాధ | మేక | అల్పవృష్టి | సస్యానుకూల వర్షము |
| ఆరుద్ర | 21-6-2017 | బుధ | తె 4.43 | కృత్తిక | గాడిద | అల్పవృష్టి | అచ్చటచ్చట వర్షము - గాలులు |
| పునర్వసు | 5-7-2017 | బుధ | తె 4.33 | అనూరాధ | నక్క | అల్పవృష్టి | సామాన్య వర్షము - గాలి |
| పుష్యమి | 19-7-2017 | బుధ | తె 4.00 | రోహిణీ | నెమలి | ఖండవృష్టి | సస్యానుకూలవర్షములు - జల్లులు |
| ఆశ్లేష | 2-8-2017 | బుధ | రా 2.38 | జ్యేష్ఠ | ఎలుక | అల్పవృష్టి | వ్యవసాయనుకూలవర్షము |
| మఘ | 16-8-2017 | బుధ | రా 12.44 | రోహిణీ | మేక | అల్పవృష్టి | తుపాన్లు - గాలులు - వర్షము |
| పుబ్బ | 30-8-2017 | బుధ | రా 8.29 | జ్యేష్ఠ | ఏనుగు | పర్వతవృష్టి | పర్వతప్రాంతముయందు వర్షము |
| ఉత్తర | 13-9-2017 | బుధ | మ 2.27 | మృగశిర | కప్ప | సువృష్టి | మంచి వర్షము - జలమయం |
| హస్త | 27-9-2017 | బుధ | ఉ 5.57 | జ్యేష్ఠ | నెమలి | ఖండవృష్టి | తుఫాన్లు - అల్పపీడనము-వర్షము |
| చిత్త | 10-10-2017 | మంగ | రా 6.36 | మృగశిర | ఎలుక | అల్పవృష్టి | సస్యానుకూలవర్షములు - గాలులు |
| స్వాతి | 24-10-2017 | మంగ | తె 5.15 | మూల | దున్న | సువృష్టి | తుఫాన్లు-అల్పపీడనము-వర్షములు |
| విశాఖ | 6-11-2017 | సోమ | మ 1.15 | రోహిణీ | గాడిద | అల్పవృష్టి | సామాన్య వర్షము-గాలులుజల్లులు |
| అనురాధ | 19-11-2017 | ఆది | రా 7.24 | అనూరాధ | ఎలుక | అల్పవృష్టి | సామాన్య వర్షము-తుఫాను భయము |
| జ్యేష్ఠ | 2-12-2017 | శని | రా 11.59 | కృత్తిక | మేక | అల్పవృష్టి | చిరుజల్లులు - గాలి |
| మాఘ | 15-12-2017 | శుక్ర | రా 2.48 | అనూరాధ | ఏనుగు | పర్వతవృష్టి | పర్వతప్రాంత వర్షము |
| పుష్యమి | 28-12-2017 | గురు | తె 5.02 | భరణి | ఎలుక | అల్పవృష్టి | సామాన్య వర్షం - గాలి-జల్లులు |
| ఉషా | 11-1-2017 | గురు | ఉ 6.55 | విశాఖ | దున్న | సువృష్టి | సస్యానుకూలం వర్షం కలుగును-మంచు |
| శ్రవణం | 24-1-2017 | బుధ | ఉ 9.12 | అశ్వని | గాడిద | అల్పవృష్టి | చల్లనిగాలులు-సామాన్య వర్షం-చలి మంచు |
| ధనిష్ఠ | 6-2-2017 | మంగ | మ 12.40 | స్వాతి | నక్క | అల్పవృష్టి | అచ్చటచ్చట వర్షం-చల్లని గాలులు-మంచు |
| శతభిషం | 19-2-2017 | సోమ | సా 5.08 | రేవతి | మేక | అల్పవృష్టి | సామాన్యవర్షం-గాలి-మంచు |

## నవగ్రహాలు గోచరంలో ఇవ్వబడు శుభాశుభ ఫలములు

| స్థానం | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని | రాహు | కేతు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| జన్మ | రోగం | భోగం | ప్రవాసం | అర్ధనాశం | దుఖం | భోగం | రోగం | పీడ | పీడ |
| ద్వితీయం | విత్తనాశం | అర్ధనాశం | క్లేశం | ఐశ్వర్యం | ధనవృద్ధి | విత్తలాభం | సుఖనాశం | కలహం | దేహపీడ |
| తృతీయం | భయం | జయం | లాభం | శత్రుభయం | స్థితినాశం | ఐశ్వర్యం | లాభం | సౌభాగ్యం | లాభం |
| చతుర్ధం | క్లేశం | భయం | భీతి | సుఖం | బంధుక్లేశం | సుఖం | సుఖనాశం | దేహపీడ | వ్యసనం |
| పంచమం | భీతి | అనిష్టం | క్లేశం | కలహం | ధనలాభం | పుత్రలాభం | పుత్రనాశం | వ్యసనం | పుత్రనాశం |
| షష్టం | స్థానలాభం | శత్రునాశం | లాభం | జయం | శత్రుబాధ | విపత్తు | శత్రునాశం | సుఖం | శత్రునాశం |
| సప్తమం | రోగం | సంతోషం | రోగం | విరోధం | భోగం | స్త్రీ పీడ | సంచారం | రాజభయం | భయం |
| అష్టమం | పీడ | దేహబాధ | పీడ | లాభం | రోగం | సంపత్తు | దుఖం | ధననాశం | దుఖం |
| నవమం | వ్యసనం | ఇష్టసిద్ధి | వ్యసనం | విఘ్నం | పుత్రలాభం | స్త్రీసుఖం | ధర్మనాశం | ధననాశం | ప్రయాణం |
| దశమం | కార్యసిద్ధి | ఇష్టసిద్ధి | భయం | సౌఖ్యం | ధనహాని | కలహం | దారిద్ర్యం | భయం | భయం |
| ఏకాదశం | స్థానలాభం | సంతోషం | ధనలాభం | పుష్టి | స్థానలాభం | జయం | ధనలాభం | లాభం | ధనలాభం |
| ద్వాదశం | ప్రయాణం | ధనవ్యయం | ప్రయాణం | అపజయం | భయం | లాభం | ధననాశం | సర్వనాశం | ధననాశం |

| గ్రహాలు | శుభఫలాల స్థానం | వేధ స్థానం |
|---|---|---|
| రవి | 3,6,10,11 | 9,12,4,5 |
| చంద్ర | 1,3,6,7,10,11 | 5,9,12,2,4,8 |
| కుజ,శని,రాహు | 3,6,11 | 12,9,5 |
| బుధ | 2,4,6,8,10,11 | 5,3,9,1,8,11 |
| గురు | 2,5,7,9,11 | 3,4,8,10,12 |
| శుక్ర | 1,2,3,4,5,6,8,9,11,12 | 1,3,5,6,7,8,9,10,11 |

సూర్యాది గ్రహాలు గోచార రాశిలో ఉన్నప్పుడు వేధ రాశులలో గ్రహాలుంటే శుభ ఫలాలనివ్వరు. అలాగే వేధరాశిలో ఉన్నప్పుడు గోచరాశిలో గ్రహాలుంటే ఆ స్థానంలో ఫలాలనివ్వరు. ఈ నియమం రవి, శనికీ, చంద్ర, బుధలకూ ఉండవు ఎందుకంటే తండ్రీ పుత్రుల సంబంధ గ్రహాలు

| | | |
|---|---|---|
| 2 / 3 | బు ల కు | ర చం శు 12 కే 11 |
| 4 | రాశి | 10 |
| రా 5 గు 6 | 7 | 8 9 శ |

# మేషరాశి ఫలము



**అశ్వని 1,2,3,4, భరణి 1,2,3,4,కృత్తిక 1**

**ఆదాయం : 8** **వ్యయం :14**

**రాజపూజ్యం : 4** **అవమానం 3**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | షష్టమం<br>సప్తమం | ధనవ్యయం<br>భోగం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | నవమం<br>అష్టమం<br>నవమం | మిశ్రమం<br>ఆరోగ్యభంగం<br>మిశ్రమం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-03-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | పంచ/లాభం<br>చతుర్థ/దశమం | ధనవృద్ధి<br>స్థానభ్రంశం |

మేషరాశివారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరప్రధమార్థం సామాన్యంగా గడచి పూర్వార్థం అనుకూలంగా ఉండును. ప్రధమార్థంలో ప్రతి పనియందు వ్యతిరేకత, ఆరోగ్యరీత్యా చికాకులు కలుగును. వైద్యసేవలకు డబ్బు ఖర్చు అగును. తరచు ఔషదసేవనం తప్పనిసరి. ఇంటాబయట వ్యతిరేకత, అనూహ్య ధనవ్యయం కలుగును.

గృహనిర్మాణాధికార్యములు ప్రారంభమయి హఠాత్తుగా ఆగిపోవును. అనవసర సమస్యలు మీదకు వచ్చును. మానసిక, శారీరక శ్రమ కలుగును. ప్రయాణములు వాయిదాపడును. నూతన ఉద్యోగ, పదవీయోగములు వచ్చినట్లే వచ్చి హఠాత్తుగా ఆగిపోవును. మోసమునకు గురిఅగుట జరుగును. నూతన వృత్తి, వ్యాపార ప్రారంభములు ఆగిపోవును. నూతన వాహనములు ఇబ్బందులకు గురిచేయును. విద్యార్థులకు ప్రధమార్థం కృష్టకాలంగా సాగును. ఏకాగ్రత తగ్గును. అన్నికార్యములు వాయిదా పడును. ప్రమోషన్స్ నిలచి ఉండును. అవివాహితులకు వివాహము వాయిదా పడును.

ప్రధమార్థంలో స్పెక్యులేషన్ లాభించదు. సర్వులు నిరాశ, నిరాసక్తతతోనుందురు. ఉద్యోగులకు అయిష్టముగా ట్రాన్స్ఫర్ కలుగును. వ్యాపారులు సామాన్య లాభములు నార్జింతురు. నూతన వ్యాపార ప్రారంభములకు అనుకూలము లేదు. రైతులకు కష్టకాలము రెండవ పంట లాభించును. కార్మికులకు శ్రమ, కాఠిన్యము పెరుగును. అనారోగ్యము భాధించును. రాజకీయ, నాయకులకు అనుకూలముకాదు. NRI లకు అనుకూలంకాదు,

ఉత్తరార్థంలో పరిస్థితులు అనుకూలించును. సర్వులకు సర్వకార్యజయము, లాభము కలుగును. ధనవ్యయం మాత్రం అపరిమితముగా నుండును. సమయానికి ధనము సర్దుబాటు అగును. శుభకార్యముల నిమిత్తం ధనవ్యయమగును. ఇంటియందు వివాహాది శుభ కార్యములు నెరవేరును. నూతన దేవాలయ, తటాక నిర్మాణాధిఫలం కలుగును.

సంవత్సరమంతయు శని బలము సామాన్యము, శని అష్టమమందున్నపుడు రోగబాధ, సర్వకార్యవిలంబము, ధనవ్యయము వైద్యశాలాదర్శనం కలుగును. శని నవమమందున్నపుడు శుభాశుభమిశ్రమ ఫలం కలుగును. భార్యా, కుమారుల విషయములు బాధించును.

గురుడు షష్ట స్థానమందున్నకాలము పరీక్షకాలముగా ఉండును. భార్యా, పుత్ర కలహము, చోరాగ్ని భయము, రాజభయము కలుగును. గురుడు సప్తమ స్థానమందున్నకాలమందు ఆరోగ్యము, రాజదర్శనము, శరీర పోషణ, తేజస్సు, ఇష్టసిద్ధి సర్వులకు కలుగును. రాహుకేతువులు సంవత్సరమంతయు శుభా శుభఫలమునిత్తురు.

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** ఆర్థిక ఇబ్బందులు పెరుగును. దుర్వ్యయము, అకారణకలహాము, మనశ్శాంతి లేకపోవుట. వైద్యశాలాదర్శనము, తగాదాలు, మాటపట్టింపులు, విరోధాలు కలుగును. నూతన వ్యాపార నిర్ణయములు వాయిదాపడును. జాగరూకతతో ఉండవలెను.

**మే :** శుభాశుభ మిశ్రమకాలం, పాతబాకీలు వసూలగును కానీ ధనవ్యయము విపరీతముగా నుండును. అనవసర వివాదములో చిక్కుకొనుట, శతృభయము, మిత్రద్రోహము

**జూన్ :** శుభాశుభ మిశ్రమకాలం, నూతన ఉద్యోగప్రయత్నములు సానుకూలముగానుండును. వివాహితులకు ఎడబాటు, అవివాహితులకు నిరాశకలుగును. రాజకీయ నాయకులకు పదవీ గండం తప్పదు. ఆర్థిక పరిస్థితి కొంత మెరుగుపడును.

**జూలై :** అధికారుల దర్శనము, సంతోషము, ప్రభుత్వపరమైన సమస్యలు పరిష్కారమగుట, ఇంటియందు పుత్రోత్సవాది సంతోషము, గృహలాభము, నానామూలకముగా ధనప్రాప్తి

**ఆగష్టు :** ద్రవ్యనాశమును, ఉద్యోగచలనమును, మాతృకష్టము వాహననాశనమును, పశు నాశనమును, దాయాదికలహములు, ప్రయత్న కార్యనాశభయమును. రోగ భయము

**సెప్టెంబర్ :** నూతన వాహన, వస్తు లాభమును, శయ్యాధి లాభమును, సౌఖ్యభోజనప్రాప్తియు, సంఘ గౌరవము, యత్నకార్యసిద్ధియు, అశ్వలాభమును, ధనవృద్ధియు,వస్తుసంచయము

**అక్టోబర్ :** బంధు ఉపకారమును,భార్యాపుత్రసౌఖ్యమును, విద్యాభ్యాసాది లాభమును, దేహారోగ్యము, సర్వకార్యసిద్ధియు, అవివాహితులకు సంబంధములు కుదురును.

**నవంబరు :** బంధుపూజ్యతయు, సంఘ గౌరవము, నూతన ఉద్యోగ లాభమును, రాజకీయ పదవీయోగము, స్వస్థాన చలనము మాతృ పూజయు, నూతన దేవాలయ నిర్మాణాధికారమును, యజ్ఞయాగాది క్రతువులందు పాల్గొనుటయు, సంతోషము కలుగును.

**డిశంబర్ :** సంఘగౌరవము, సన్మానము, ఆరోగ్యము, నూతన వస్త్రాభరణ ప్రాప్తియు, క్షేత్రార్థవృద్ధియు, ధాన్యలాభము, దేవతా దర్శనము, వ్యవహారజయము, నూతన వస్తు సంచయము తూర్పు దిక్కునకు ప్రయాణము కలిగి అచ్చట సౌఖ్యము, కార్యజయము

**జనవరి 2018 :** మహారాజ పూజ్యతయు, ఇంటియందు కళ్యాణమును, సుఖమును, ఆరోగ్యము, పుత్రకర్మోత్సవమును, ధన, ధాన్యాభివృద్ధియు, క్షేత్రవృద్ధియు, శతృనాశనమును, మహత్సౌఖ్యము శుభమును, తీర్థస్నానాధిఫలప్రాప్తియు, దేవతాదర్శనము కలుగును.

**ఫిబ్రవరి :** స్వల్ప అనారోగ్యమును, వైద్యశాలదర్శనము, ఔషదసేవనము, కార్యనాశనమును, దేహబాధ, మనస్తాపమును కలుగును. ఉత్తరార్థమును, వస్త్ర భూషణ లాభము

**మార్చి :** నీచసేవయు, నీచ సాంగత్యము, దేహబాధ విరోధము, మనస్తాపము, ధనధాన్యనాశనము, భార్య పుత్ర కలహమును, స్వదేహ పీడయు, సర్వత్ర కలహము

**గ్రహశాంతి :** గురు, శని, రాహు, కుజ గ్రహశాంతులు ఆచరించవలెను.
నవగ్రహశాంతి క్రమం పరిశీలించండి.

**అదృష్టసంఖ్య :** '**9**', 1,2,3,4,7 మిత్ర సంఖ్యలు, 9,18,27 తేదీలు
మంగళ, ఆది, సోమ, గురువారములు మంచివి.

**అదృష్ట రత్నం :** అశ్వని వైఢూర్యము, భరణి వజ్రము, కృత్తిక కెంపు, ధరించవలయును.

**రుద్రాక్షధారణం :** షణ్ముఖి, పంచదశముఖి, గౌరీశంకర, రుద్రాక్షలు ధరించవలయును.

| | | |
|---|---|---|
| ల 1 / 2 | కు / బు 12 | ర చం శు కే / 11 10 |
| 3 | రాశి | 9 |
| రా 4 / గు 5 | 6 | 7 / 8 శ |

# వృషభరాశి ఫలము



**కృత్తిక 2,3,4, రోహిణి 1,2,3,4, మృగశిర 1,2**

**ఆదాయం : 2** **వ్యయం : 8**

**రాజపూజ్యం : 7** **అవమానం : 3**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | పంచమం<br>షష్టం | లాభం<br>ధనవ్యయం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | అష్టమం<br>సప్తమం<br>అష్టమం | ఆరోగ్యభంగం<br>కలహం<br>ఆరోగ్యభంగం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | చతుర్థం/రాజ్యం<br>తృతీయ/నవమం | వ్యతిరేకత<br>లాభం |

వృషభరాశి వారిపై ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయూ శుభాశుభమిశ్రమకాలముగా నుండును. మానసిక, శారీరక శ్రమ ఎక్కువగా నుండును. కుటుంబకలహములు, భార్యాభర్తల మధ్యవైరములు, కోర్టుకేసుల నెదుర్కొనుట తప్పదు. ప్రధమార్థంలో కొంత పురోగతి కలుగును. గురుబలముచే సమస్యలు సానుకూలముగా పరిష్కారమగును. తలచిన శుభకార్యములు ఆలస్యము మీద నెరవేరును. భూ, గృహనిర్మాణాధికార్యములు వాయిదాపడు అవకాశమున్నది. ఇంటా, బయట సమస్యలు నెదుర్కొనక తప్పదు.

ముఖ్యముగా దేహారోగ్యము మందగించును. అష్టమశని ప్రభావముచే నూతన వ్యాధి బాధలు కలుగును. తరచు వైద్యశాలా దర్శనము, ఔషదసేవనము తప్పక కలుగును. ఆపరేషన్లు చేయవలసిరావచ్చును. ఆరోగ్యం విషయంలో అత్యంత జాగరూకతతో మెలగవలయును. యాక్సిండెంట్లు రక్తదర్శనము కలుగు అవకాశమున్నది. వాహన ప్రమాదములు, జంతు భయము, సర్పభయము, కరెంటు షాక్‌లకు గురికావలసిరావచ్చును. అన్నింటా జాగ్రత్త అవసరం. శతృపీడ, శతృ భయము కలుగును. అనవసర నిందారోపణలు మోయవలసిరావచ్చును.

ఈ సంవత్సరమంతయూ ధనవ్యయం, తప్పదు. శుభాశుభకార్యములకు ధనవ్యయం చేయుదురు. సంపాదించిన సొమ్ము నిష్పలము కాగలదు. తాతలనాటి ఆస్తులు అమ్మవలసిరావచ్చును. ఆర్థిక వ్యవహారములు మందగించును. సమయానికి ధనము సర్దుబాటుగాక ఇబ్బందిపడుదురు. దైవభక్తి కలుగును. శుభాకార్యచరణ నిమిత్తం ధనవ్యయం చేయుదురు. తరచు దేవాలయ దర్శనం చేయుదురు. శివభక్తి పెరుగును. ప్రయాణములందు చోరభయము కలుగును. విలువైన వస్తు సామాగ్రి నష్టపోవుదురు.

విద్యార్థులకు ఈ సంవత్సరం అనుకూలంకాదు. రెండు ఛాన్సులందు వ్యతిరేకత వ్యక్తమగును. మానసిక ఒత్తిడికి గురి అగుదురు. అవివాహితులకు నిరాశ ఎదరగును. కుదిరిన సంబంధములు చెడిపోవు అవకాశమున్నది. నిరుద్యోగులకు అనుకూల కాలంకాదు. ఉద్యోగనియామకములు వాయిదా పడును. ఉద్యోగులు దూర ప్రాంతములకు బదిలీ చేయబడుదురు. ఆరోపణలతో సస్పెండుకాబడుఅవకాశమున్నది.

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** ధర్మకార్యచింతన, తటాకములు, బావులు, చెరువులు, నిర్మాణ ఫలప్రాప్తియు, దేవతా దర్శనము, పుత్రసంతోషము, బంధుపూజ్యితయు, రత్నాభరణ ప్రాప్తియు, మనస్సంతోషము, అభివృద్ధి, ధనాదాయము కలుగును.

**మే :** స్వదేహసౌఖ్యము, అత్యంత కీర్తి లాభము, సుఖము, నిత్య సంతోషము, సుఖ భోజన ప్రాప్తియు, నూతన విదేశీవస్తులాభము, రత్నాభరణ లాభమును, ఇంటియందు మంగళవాయిద్యములతో కూడిన శుభకార్యాచరణ కలుగును.

**జూన్ :** మాతృమూలక ధనవ్యయము, అకారణవిరోధము, మాటపట్టింపులు, ఇంటాబయట సమస్యలు, ఆరోగ్య భంగము, వైద్యదర్శనము, ఔషధసేవనము, శతృభీతి కలుగును.

**జూలై :** శుభాశుభ మిశ్రమ ఫలం కలుగును. ఆదియందు కొంత కష్టము తదుపరి ధనప్రాప్తియు, సౌఖ్యము, భృత్యువర్గాభివృద్ధియు కలుగును. వ్యవసాయ లాభము, క్షేత్ర వృద్ధియు, సుఖము, అప్రయత్న కార్యసిద్ధి, ఆరోగ్యము కల్గును.

**ఆగష్టు :** స్వల్ప అనారోగ్యం, ఋణవృద్ధి, వ్యతిరేకత, ప్రయాణకార్యభంగము, వృధాసంచారము, అకాల భోజనము, దైవకార్యచింతన, శివదర్శనము, మన:క్లేశము, భయము కలుగును.

**సెప్టెంబర్ :** పుత్రపీడ, గురువిరోధము, ధననాశనము, స్థాన నాశనము, అపకీర్తి భయము, వాహన భయము, బంధు విరోధము, కృషి, వాణిజ్య నాశనము, ఋణవృద్ధి, వ్యతిరేకత ప్రయాణ కార్య భంగము, ఎల్లచోట్ల కలహము, ధనధాన్య నాశనము కలుగును.

**అక్టోబర్ :** బంధుకోపము, స్థాననాశనము, యత్నకార్యభంగమును, విశేష కష్టము, ధన, ధన్యానష్టము, అర్థహానియు, పశుహానియు, అధిక కష్టములు, పల్లుచోట్ల కలహము కలుగును.

**నవంబరు :** జ్వరభయము, స్థాననాశనము, రాజభీతియు, శతృభయము, శస్త్ర పీడయు, ఋణబాధయు, పిత్తవికారము, మనోవైకల్యము, వాహన ప్రమాదములు, ఆపరేషన్లు, ఔషద సేవనం క్షేత్రనాశనము, పశునాశనము, అపకీర్తి కలుగును.

**డిశంబర్ :** భార్యపుత్రసౌఖ్యము, ఇష్టసిద్ధియు, విశేష సుఖము, క్షేత్రవృద్ధియు, గోలాభము, ధనసంపత్తియు, బంధు పూజ్యతయు, మనోల్లాసము, ధనధాన్యాభివృద్ధియు, వస్త్రభూషణ సంగ్రహము నూతన విదేశి వస్తులాభము దైవదర్శనము కలుగును.

**జనవరి 2018 :** ద్రవ్య లాభము, భార్యాపుత్రవృద్ధియు, జ్ఞానవృద్ధియు, శతృనాశనము, యత్నకార్యసిద్ధియు, పశులాభము, తీర్థయాత్రాచరణ, దైవదర్శనము, మనస్సంతోషము సుఖము ప్రియ వస్తులాభము, మిత్ర సుఖము కీర్తి కలుగను.

**ఫిబ్రవరి :** పాపకార్యాచింతన, మనోవ్యధ, ఉద్యోగభంగము, దేహాలస్యములు, స్థాననాశనము, విశేష భయము, హింసయు, దారిద్ర్యబాధయు, చోరబాధయు, జంతుభయమును, విశేష కష్టమును అకారణకలహము, పదవీ వియోగము కలుగును.

**మార్చి :** సర్వకార్యవిలంబము, స్థాననాశనము, భార్యావియోగము, పుత్రనాశనము, క్షేత్రహాని, ధాన్యానష్టము, అర్థనాశనము, జ్వరభయము, వైద్యశాలాదర్శనము, ఔషధ సేవనం కలుగును.

**గ్రహశాంతి :** గురు,శని,రాహు,రవి,కేతు గ్రహశాంతులు ఆచరించవలెను. నవగ్రహశాంతి క్రమం పరిశీలించండి

**అదృష్ట సంఖ్య :** '6' 6,15,24 తేదీలు శుక్రవారం శుభం. 5,8 తేదీలు బుధవారం, శనివారం కలిపిన మరింత యోగప్రదం.

**అదృష్ట రత్నం :** కృత్తిక-కెంపు, రోహిణి-ముత్యం, మృగశిర-పగడం ధరించవలయును.

**రుద్రాక్షధారణం :** పంచముఖి, చతుర్ధశముఖి, ఏకవింశతి ముఖి (5,14,21 ముఖాలు)

| | | |
|---|---|---|
| ల 12 1 | బు కు 11 | ర చం శు కే 10 9 |
| 2 | రాశి | క |
| రా 3 గు 4 | 5 | 6 7 శ |

# మిధునరాశి ఫలము



**మృగశిర 3,4, ఆరుద్ర 1,2,3,4, పునర్వసు 1,2,3**

**ఆదాయం : 5** **వ్యయం : 5**

**రాజపూజ్యం : 3** **అవమానం : 6**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | చతుర్థం<br>పంచమం | ధనవ్యయం<br>లాభం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | సప్తమం<br>షష్టం<br>సప్తమం | కలహం<br>లాభం<br>కలహం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | తృతీయ/నవమం<br>ద్వితీయ/అష్టమం | లాభం<br>ఆరోగ్యభంగం |

మిధునరాశి వారిపై ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయు శుభాశుభ మిశ్రమ ఫలములు కలుగును. సంవత్సర మధ్యభాగం మినహా అన్నింటా వ్యతిరేక ఫలితములు చవిచూడవలసివచ్చును. ఏ పని యందు అనుకూలత లేక, తరచు శతృభయము, కార్యవిఘ్నములతో మనసంతయు చికాకులతో ఇంటా బయట సమస్యలతో కుటుంబ కలహములతోనుండును. జ్ఞాతివైరము, దాయాదుల వైరములు, కోర్టు కేసులు, అనవసర చిక్కులు, అధిక ధనవ్యయము, ఆరోగ్య భంగములు, తక్కువ వారితో మాటలు పడుట, తలచిన కార్య విఘ్నములు, రాజభయము ప్రమాదములు కలుగును.

సంవత్సర మధ్యభాగము నందు సర్వత్ర విజయము శతృజయము, ధైర్యము, సాహసము, ఆర్థికవృద్ధి కలుగును. అప్రయత్న కార్యసిద్ధి, అన్నింటా జయం కలుగును. ఇంటి యందు శుభకార్యాచరణ తప్పక కలుగును. గత సం॥ర కాలముగా ఆగిపోయిన పనులు హఠాత్తుగా, నెరవేరును. శతృవులు మిత్రులగుదురు. దూరదేశమునుండి సహాయములభించగలదు. భూ, గృహనిర్మాణ, నూతన వ్యాపార ప్రారంభాధి కార్యములు నెరవేరును.

తదుపరి సంవత్సరాంతమున భార్యభర్తల మధ్య అన్యోన్యత తగ్గును. అనుమానములకు తావుకల్గును.పోలీసు, కోర్టుకేసులకు ఆస్కారమున్నది. మనశ్శాంతికరవగును. భార్యాభర్తలకు ఎడబాటు కలుగును. ఆరోగ్యము హఠాత్తుగా మందగించును. వైద్యశాలా దర్శనం, ఔషద సేవనం కలుగును. మిత్రులు శతృవులవలె మెలగుదురు. హృదయ తాపము కలుగును. మతిస్థిమితము తప్పును. ఇతరుల చేతిలో మోసమునకు గురి అగుదురు.

విద్యార్థులకు మొదటి ఛాన్స్ లాభము, రెండవ ఛాన్స్‌లో నిరాశకు గురి అగుదురు. అవివాహితులకు ప్రధమార్థంలో వివాహమగును. ద్వితీయార్థంలో వివాహములు తప్పిపోవుట జరుగును. నిరుద్యోగులకు ప్రధమార్థంలో హఠాత్తుగా ఉద్యోగమువచ్చును. ఉత్తరార్థంలో నిరాశకు గురికాగలరు. ఉద్యోగులకు ఉత్తరార్థంలో బహుకష్టకాలం, నష్టములకు గురికాగలరు. రైతులకు మొదటి పంట లభించును. రెండవ పంట నిరాశాజనకంగా ఉండును. కార్మికులకు ఉత్తరార్థ బహుకష్టకాలం రాజకీయ నాయకులు, ఉద్యోగులు అవినీతి ఆరోపణలనెదుర్కొనక తప్పదు. విదేశాలలోని భారతీయు (NRI) లకు ప్రధమార్థం శుభం, ఉత్తరార్థంలో సమస్యలు కలుగును. స్పెక్యులేషన్ ఉత్తరార్థంలో లాభించదు. బుద్ధి చాంచల్యము, తేజోహీనము, ద్రవ్యనాశనము, దేశత్యాగము కలుగును.

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** ఆరోగ్య భంగము, ఇంటియందు వ్యక్తుల ఆరోగ్యము ఆందోళనకరము, వృధాసంచారము, అకాల భోజనము, అస్థిమితము,శతృభయము, నిద్రలేమి, ముఖమునందు తేజోహాని, ఔషదసేవనం, శ్రమాధిక్యము, ప్రతికూలత కలుగును.

**మే :** చిన్నచిన్న ఆరోగ్యలోపములు, వైద్యశాలాదర్శనం, ఔషద సేవనం అప్రయత్నకార్యసిద్ధి, వాహన లాభము, స్థానచలనం, దైవభక్తి, ఇంటియందు శుభాకార్యాచరణ, వ్యాపార ప్రయత్నములు సుఖభోజనప్రాప్తి, నూతన వస్త్ర, వస్తు లాభములు కలుగును

**జూన్ :** శుభకార్యప్రాప్తి, వివాహ నిశ్చయం, కీర్తి, గౌరవం, నూతన ఉద్యోగలాభము, భూ, గృహ నిర్మాణాధికారము, మిత్ర సుఖము, గౌరవ ప్రతిష్ట పెరుగుట, నూతన పదవీయోగము, దైవదర్శనము, దేవతా ప్రతిష్టలయందు పాల్గొందురు

**జూలై :** అప్రయత్నకార్యసిద్ధి, ధనలాభము, నూతన వాహన లాభం, విద్యావినోద విషయ కీర్తిలాభము, విదేశీ వస్తు సంచయము, దూరదేశగమనము, వస్త్రలాభము, సన్మానము

**ఆగష్టు :** బంగారు ఆభరణప్రాప్తియు, వస్త్రలాభము, బంధుఉపకారము, పోయిన ధనము వెనుకకు వచ్చుట, శతృ జయము, మిత్ర సహకారము, అప్రయత్నకార్యసిద్ధి

**సెప్టెంబర్ :** మహారాజనుగ్రహము, వాహన లాభము, పితృవర్గ జనులకు అభివృద్ధియు, ధన ధాన్యవృద్ధి, నూతన వస్తు సంచయము, యశోవృద్ధిబలము,ఇంటియందు శుభ కార్యాచరణ, రాజకీయోద్యోగులకు నూతన పదవీయోగము, దైవదర్శనము

**అక్టోబర్ :** క్షేత్రసంగ్రహము, కృషిలాభము, హేమలాభము, వస్త్రప్రాప్తియు, ముత్యములు, రత్నములు లభించుట, అపూర్వ వస్తు సంగ్రహము, ప్రియవస్తు ప్రాప్తియు, గృహలాభము, మిత్రసుఖము, జయము, కీర్తిలాభము, భార్యాపుత్రసౌఖ్యము కలుగును.

**నవంబరు :** అపవాద భయము, హఠాత్తుగా అనారోగ్యము, వైద్యశాలాదర్శనము, ఔషదసేవనము, కీర్తి నాశనము, జ్ఞానవృద్ధియు, శతృభయము, చోరభయము, అపకీర్తి భయము, ఆప్తబంధువియోగము, ఎల్లచోట్లను కలహము, సర్వుల తోడ బేధము కార్యనాశనము

**డిశంబర్ :** బలహీనము, కాంతిలేమియు, శరీరము శుష్కించుట, నల్లబడుట, అపజయము, జంతుభయము, చోరభయము ప్రయత్నకార్యవిఘ్నము, విలంబము, ద్రవ్యనాశనము

**జనవరి 2018 :** జ్ఞాతి విరోధమును, వివాదమును, క్షేత్రనాశనము, ధాన్యనష్టమును, కష్టమును, ధనహాని, పుత్రపీడలు, అపయశస్సు, వస్తువాహననాశనము కలుగును.

**ఫిబ్రవరి :** స్వస్థాన నాశనమును, రాజకోపము, అధిక కష్టములు, భార్యాపుత్రపీడయు, ధన, ధాన్యానాశనమును, పనులు ఆగిపోవుట, ధనము సర్దుబాటుగాక కష్టనష్టములు నెదుర్కొందురు

**మార్చి :** అనారోగ్యము, ఔషదసేవనం, మతిస్థిమితము తగ్గుట, భార్యాపుత్రకలహము, కుటుంబ కలహము, శతృభయము హఠాత్తుగా భూ,గృహనిర్మాణాధికార్యములు ఆగిపోవుట

| | |
|---|---|
| **గ్రహశాంతి** | :చంద్ర, గురు, శని, రాహు, కుజ, కేతు గ్రహశాంతులు ఆచరించవలెను. నవగ్రహశాంతి క్రమం పరిశీలించండి. |
| **అదృష్ట సంఖ్య** | :'5' 5,14,23 తేదీలు బుధవారములతో కలసివచ్చిన యోగం 1,3,4,6,8,9, ఆది, మంగళ, గురు, శుక్రవారములు శుభం. |
| **అదృష్ట రత్నం** | :మృగశిర వారు పగడం, ఆరుద్రవారు గోమేధికం, పునర్వసు వారు కనకపుష్యరాగం ధరించవలెను. |
| **రుద్రాక్ష ధారణం** | :చతుర్ముఖి, త్రయోదశముఖి, నవదశముఖి (4,13,19) |

| | | |
|---|---|---|
| 11 12 | కు బు 10 | ర చం 9 శు కే 8 |
| ల 1 | రాశి | 7 |
| రా 2 గు 3 | 4 | 5 శ 6 |

# కర్కాటకరాశి ఫలము



**పునర్వసు 4, పుష్యమి 1,2,3,4, ఆశ్లేష 1,2,3,4**

**ఆదాయం : 14** **వ్యయం : 2**

**రాజపూజ్యం : 6** **అవమానం : 6**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | తృతీయం<br>చతుర్థం | శుభం<br>ధనవ్యయం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | షష్ఠం<br>పంచమం<br>షష్ఠం | లాభం<br>మిశ్రమం<br>లాభం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | ద్వితీయం/అష్టమం<br>జన్మం/సప్తమం | ధననష్టం<br>శారీరపీడ |

కర్కాటకరాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయూ శుభ ఫలితములను పొందగలరు. ప్రతి పని సత్వరము నెరవేరగలదు, తలచిన కార్యములు ప్రయత్నములేకనే సఫలీకృతము కాగలవు. శత్రువులు మిత్రులగుదురు. ఆరోగ్యము కొంతబాధించినా కార్యక్రమాలనిర్వహణ సక్రమంగానుండగలదు. ఎప్పటినుండో ఆగిపోయిన పనులు హఠాత్తుగా నెరవేరగలవు. ధనవ్యయము, కొంత అదుపులేక ఉండును. ప్రతి పనియందు ఉత్సాహం, కార్యజయం, సంఘమునందు గౌరవ మరాద్యలు పెరుగును. స్థిరాస్తులు కొనుగోలు చేయుదురు. పాతబాకీలు వసూలగును. విదేశీప్రయాణములకు అనుకూలకాలము, కోర్టు వ్యవహారములు నెమ్మదిగా అనుకూలించును.

ఆర్థిక వ్యవహారములు అదుపు తప్పగలవు. మితిమీరిన ధనవ్యయము కాగలదు. ధర్మకార్యాచరణ, శుభకార్యాచరణకు ధనము వెచ్చించుదురు. భూ, గృహనిర్మాణాధికార్యములు నెరవేరగలవు. నూతన ఉద్యోగ, వ్యాపారములు సిద్ధించగలవు.

మధ్యమధ్య కొంత అనారోగ్యము బాధించును. ఔషధసేవనం కలుగును. జన్మరాహువుచే ముఖం కళ తప్పుట. స్ఫోటక, వ్రణలాభలు ముఖం కాంతి తగ్గుట, జర్వభయము నిద్రలేమి, కలలు సర్పభయము, జంతుభయము, చోరభయము కలుగును. శరీర సౌందర్యమునకు ధనము వెచ్చించెదరు. భార్యతో మాట పట్టింపులు, వివాదములు అనవసర సమస్యలు నెదుర్కొనక తప్పదు. మానసిక ఒత్తిడి, శ్రమ కాఠిన్యము కలుగును.

విద్యార్థులకు మంచికాలం రెండు ఛాన్సులు ఫలితం పొందుతారు. కాని అధిక శ్రమ చేయవలసివస్తుంది. అవివాహితులకు ప్రధమార్థంలో వివాహం జరుగును. నిరుద్యోగులు ప్రధమార్థంలో ఉద్యోగం పొందగలరు. ఉద్యోగస్తులు ప్రధమార్థంలో ప్రమోషన్ పొందు అవకాశమున్నది. అవార్డులు, రివార్డులు పొందగలరు. ఉత్తరార్థంలో కొంత ఒత్తిడి, శ్రమకు గురికావలసిరావచ్చు. రైతులకు రెండు పంటలు లభించును. ఉత్తరార్థం శ్రమాధిక్యం కార్మికులకు మంచి కాలం రాజకీయనాయకులు మంచి పదవీ యోగాలను పొందుతారు. ఉన్నత పదవులు స్వీకరిస్తారు. ఉత్తరార్థంలో ఆరోపణలను ఎదుర్కొనక తప్పదు. NRI లకు అనుకూలకాలం స్థిరాస్తులు సమకూర్చుకుంటారు. స్పెక్యులేషన్ లభించును సంవత్సరమంతయు గురుబలము సామాన్య ఫలితములు నిచ్చును. రాహు సంచారముచే ఐశ్వర్యము కీర్తి, సంతోషముతో పాటు దేశ సంచారము, రోగభయము కష్టములు కలుగును.

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** సర్వత్ర విజయము, మనస్సంతోషము, అప్రయత్న కార్యసిద్ధి, గౌరవము, కీర్తిప్రతిష్టలు, నూతన పదవీయోగము, దైవభక్తి పుణ్యక్షేత్ర సందర్శనము, బంధు ఉపకారము

**మే :** బంధుపూజ్యతయు, సంఘ గౌరవము, నూతన ఉద్యోగలాభము, స్వస్థానచలనము, మాతృపూజయు, శతృజయము, మిత్రులమూలకముగా శుభము, నూతన వస్తు, వాహన లాభము, వ్యవహారజయము, విదేశీవస్తు సంచయము కలుగును.

**జూన్ :** మహారాజపూజ్యతయు, ఇంటియందు కళ్యాణము, సుఖమును ఆరోగ్యమును, పుత్రకర్మోత్సవము, ధనధాన్యాభివృద్ధియు, వస్త్రభూషణ లాభము, క్షీరాన్నభోజనప్రాప్తియు

**జూలై :** గృహనిర్మాణము, నూతన, విద్యా, ఉద్యోగ లాభము, ఆరోగ్యము, నూతన దేవాలయ ప్రతిష్ట నిర్మాణదీక్షయు, వాహన లాభము, సత్కర్మ దీక్ష, ధనధాన్యలాభము

**ఆగష్టు :** ఆరోగ్యలోపములు, వైద్యశాలాదర్శనము, ఔషదసేవనము, ఆర్థిక ఇబ్బందులు, దుర్వ్యయము, అకారణ కలహములు, మనశ్శాంతి లేకపోవుట, తగాదాలు మాట పట్టింపులు

**సెప్టెంబర్ :** అనారోగ్యము, తేజోహీనము, స్ఫోటక, వ్రణబాధలు ముఖముపై గాయములు మచ్చలు ఏర్పడుట, ముక్కు, ఎడమ కన్నులకు వ్యాధిబాధలు, మనోనిశ్చయము లేకపోవుట

**అక్టోబర్ :** శుభాశుభ మిశ్రమకాలం, నూతన విద్యా, ఉద్యోగ వ్యాపారప్రయత్నములు, హఠాత్తుగా ఆగిపోవును, రాజకీయ నాయకులకు పదవీగండం, ఆర్థిక పరిస్థితి కొంత మెరుగుపడును. తల్లి ఆరోగ్యం మందగించును.

**నవంబరు :** ఇంటి యందు ప్రసవము, మనశ్శాంతి లేకపోవుట, ఆర్థిక పరిస్థితి కష్టముగానుండును, ఋణబాధ పెరుగును, అనవసర సమస్యలు మీదకువచ్చును, సంఘ గౌరవం తగ్గును, కుటుంబ కలహాలు పెరుగును, భార్యాపుత్రుల పరిస్థితి ఆందోళనకరం

**డిశంబర్ :** ద్రవ్యనాశనము, ఉద్యోగచలనము, వాహన, పశునాశనము, దాయాదికలహము, ప్రయత్నకార్యనాశ భయము, రోగభయము, వైద్యశాలాదర్శనము, ఔషదసేవనము కలుగును, నీచసాంగత్యము, నీచసేవయు, స్వదేహపీడయు కలుగును.

**జనవరి 2018 :** నూతన వస్తు, వాహన లాభము, శయ్యాదిసౌఖ్యము, సంఘ గౌరవము, యత్న కార్యసిద్ధియు, పశులాభము, ధనవృద్ధియు, నూతన విదేశీవస్తు సంచయమును కలుగును, బంధు ఉపకారము, క్షేత్రవృద్ధియు, భార్యాపుత్ర సౌఖ్యము కలుగును.

**ఫిబ్రవరి :** విద్యాభ్యాసాది సంగ్రహణ లాభము, దేహారోగ్యము, మనస్సంతోషము, సర్వకార్యసిద్ధియు, మధ్య మధ్య ఆరోగ్య లోపములు, ఔషదసేవనం, భార్యా కలహం, దాయాదులతో కలహములు, కార్యనాశనము కలుగును.

**మార్చి :** బంధుపూజ్యతయు, సంఘ గౌరవము, నూతన ఉద్యోగలాభము, రాజకీయ పదవీయోగము,మాతృపూజయు, నూతన దేవాలయ నిర్మాణా ధికారములు, సంతోషము వివాహాది శుభకార్యములు నెరవేరును.

| | | |
|---|---|---|
| **గ్రహశాంతి** | : | ఈ సంవత్సరం శని, రాహు,కేతు,బుధ గ్రహశాంతులు ఆచరించవలయును. నవగ్రహశాంతి క్రమం పరిశీలించండి. |
| **అదృష్ట సంఖ్య** | : | **'2'** 1,4,7 మిత్ర సంఖ్యలు ఆది, సోమవారములు కలిసిన శుభం |
| **అదృష్ట రత్నం** | : | పునర్వసు-పుష్యరాగం, పుష్యమి-నీలం, ఆశ్లేష-పచ్చ ధరించవలెను |
| **రుద్రాక్ష ధారణం** | : | ద్విముఖి, ఏకాదశముఖి, గర్భగౌరీ ధరించవలెను. |

| | | |
|---|---|---|
| 10 11 | కు బు | ర శు చం కే 8 7 |
| 12 | రాశి | 6 |
| రా ల 1 గు 2 | 3 | 4 5 శ |

# సింహరాశి ఫలము



**మఘ 1,2,3,4, పుబ్బ 1,2,3,4, ఉత్తర 1**

**ఆదాయం : 2** **వ్యయం : 14**

**రాజపూజ్యం : 2** **అవమానం : 2**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | ద్వితీయం<br>తృతీయం | శుభం<br>మిశ్రమం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | పంచమం<br>అర్ధాష్టమం<br>పంచమం | మిశ్రమం<br>ఆరోగ్యభంగం<br>మిశ్రమం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | జన్మం/సప్తమం<br>వ్యయం/షష్టం | శారీరకశ్రమ<br>లాభం |

సింహరాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయూ శుభాశుభ మిశ్రమ ఫలితములు కలుగును. సంవత్సర మధ్యకాలం మినహా సంవత్సరమంతయూ శుభ ఫలితములు పొందగలరు. సంఘ గౌరవం పెరుగును. నూతన పదవీ యోగములు పొందగలరు. ధనాదాయము బాగుండును. దైవభక్తి పెరుగును. తరచు దైవదర్శనములు, పుణ్యక్షేత్ర సందర్శనములతో సంతోషముగా నుందురు. ప్రభుత్వపరమైన గుర్తింపు లభించును. నూతన ప్రాజెక్టులు అమలులోనికి వచ్చును. సర్వకార్యములయందు సఫలీకృతులు కాగలరు.

భార్యాభర్తల మధ్య అనురాగము పెరుగును. కుటుంబ జీవితం ఆనందముగానుండును. భూ లాభము, గృహనిర్మాణము కలుగును. బంధుపూజ్యత, మిత్రులకలయిక మనస్సంతోషము కలుగును. దూరదేశప్రయాణము కలిగి అచ్చట సత్ఫలితములు పొందగలరు. ధనవ్యయము మాత్రము అపరిమితముగా నుండును.

సంవత్సరమధ్యకాలమందు పరిస్థితులు కొంచెం ఇబ్బందికరంగా మారును. అనారోగ్యం బాధించును. ప్రారంభమయిన పనులు ఆగిపోవును. ప్రభుత్వపరమైన చిక్కులు కలుగును. తరచు ఔషధ సేవనం కలుగును. అనవసర సమస్యలు మీదకు వచ్చును. మానసిక, శారీరక సమస్యలు కలుగును. ప్రయాణములు వాయిదాపడును. నూతన ఉద్యోగ, పదవీయోగములు వచ్చినట్లే వచ్చి హఠాత్తుగా వాయిదా పడును. మోసమునకు గురిఅగుదురు. వాహనములు మొరాయించుట, వాహన ప్రమాదములు కలుగును. ప్రమోషన్స్ వాయిదాపడును.

విద్యార్థులకు రెండవఛాన్స్ అనుకూలము రాష్ట్రస్థాయి ర్యాంకులు సంపాదించగలరు. అవివాహితులకు ప్రథమార్థంలో నిరాశ ఎదురగును. పూర్వార్థంలో ఆశాజనకంగానుండును. నిరుద్యోగులు ద్వితీయార్థంలో ఉద్యోగం సంపాదించగలరు. ఉద్యోగులు సం॥ర మధ్యలో దూరప్రాంతములకు బదిలీకాబడుదురు. అవినీతి ఆరోపణలు ఎదుర్కొనక తప్పదు. వ్యాపారులకు సం॥ర ఉత్తరార్థం అనుకూలం రైతులకు రెండు పంటలు లభించును. కార్మికులకు మంచికాలం సం॥రమంతా యోగించును. కవులు, కళాకారులకు అనుకూలం సన్మాన, సత్కారములు పొందగలరు. రాజకీయ నాయకులకు నూతన పదవీయోగం కలుగును. ప్రవాస భారతీయులకు అనుకూలం స్పెక్యులేషన్ లాభించును. సం॥మంతయూ గురుబలము మిశ్రమముగా ఉన్నది. హృదయ సుఖము, యశోవృద్ధి, సౌభాగ్యము, ధనాధయము,

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** స్వల్ప అనారోగ్యము, మనోవ్యధ, పాపకార్యచింతన, ధననాశనము, భార్యాపుత్రులతో కలహము, స్థాననాశనము, ఉద్యోగభంగము, మిత్రులతో కలహము

**మే :** అపకీర్తి, సంఘమునందు వ్యతిరేకత, దేహనాశనము, ముఖమునందు కళ తప్పుట, ఔషదసేవనం, మనోవికారము, స్త్రీ దేవతా రాధనాసక్తి, మహాత్ముల సందర్శనము.

**జూన్ :** అనాలోచిత నిర్ణయాలు, ప్రయాణ విఘ్నము, ఆయాసము, అపకీర్తి, వాహన నాశనము, వాహనప్రమాదము, మాతృకష్టము, స్త్రీ విరోధము, గృహనిర్మాణాధి కార్యములు నిలిచిపోవుట, తీర్థయాత్రాచరణ, దైవదర్శనము, నదీస్నానఫలము, అన్నదానఫలము కలుగును.

**జూలై :** శుభాశుభ మిశ్రమ ఫలము కలుగును, ఉద్యోగులాభము, దైవదర్శనము, కీర్తి, ఆరోగ్యము, సంఘగౌరవము, అభివృద్ధి, క్షేత్రలాభము, శుభాకార్యాచరణ, ఇంటియందు మంగళవాయిద్యములతో కూడిన వివాహకార్యచరణ, అభివృద్ధి సుఖము కలుగును.

**ఆగష్టు :** తేజోవృద్ధి, ఆరోగ్యము, కీర్తి, గౌరవము, మిత్రలాభము, శతృజయము, అన్నదానఫలము, దూరదేశప్రయాణము లాభము, భార్యాపుత్ర లాభము, ఉద్యోగవృద్ధి, నిత్యసంతోషము, గోలాభము, యత్నకార్యసిద్ధి కలుగును.

**సెప్టెంబర్ :** భార్యాపుత్రసౌఖ్యము, ద్రవ్యలాభము, శతృనాశనము, విశేష ద్రవ్యవృద్ధి, ఆయాచిత ధనలాభము, వ్యాపారాభివృద్ధి, మనస్సంతోషము, కీర్తి, గౌరవము, పశులాభము, మిత్రవృద్ధి, శత్రువులు, మిత్రులగుట, యశస్సులభించును.

**అక్టోబర్ :** ధనధాన్యావృద్ధి, ఆరోగ్యము, నూతన వస్తు సంచయము, గృహనిర్మాణాధికారము, మిత్రలాభము, గురుపూజ, దైవారాధన, స్నేహశీలత, గోలాభము, బంధుసమాగమము, స్త్రీ సౌఖ్యము, యత్నకార్యసిద్ధియు కలుగును.

**నవంబరు :** నూతన ఉద్యోగలాభము, వివాహాది శుభాకార్యాచరణ, నూతన రాజకీయ పదవీలాభము, కీర్తి, గౌరవము, ఆరోగ్యము, విశేషయశస్సు, విద్యాలాభము, దైవదర్శనము, ధనవ్యయము, స్త్రీదేవతారాధన, బంధుపూజ్యతయు కలుగును.

**డిశంబర్ :** కళ్యాణాది మహోత్సవములు, భూరిసంపత్తియు, మిత్రసుఖమును, భార్యాపుత్రసుఖము, బంగారు ఆభరణప్రాప్తియు, ధాన్యసంగ్రహము, రాజసన్మానమును, బంధుప్రియమును, శుభశోభనప్రాప్తియు, నటగాయకుల గోష్ఠియు కలుగును.

**జనవరి 2018 :** మంత్రసిద్ధి, జాతకాది విచారము, నూతన వ్యాపారభివృద్ధి, వాహనలాభము, భార్యాపుత్రసౌఖ్యము, బంధు ఉపకారము, నూతన ఆభరణ, వస్త్రసంప్రాప్తియు కలుగును

**ఫిబ్రవరి :** పుత్రవృద్ధియు, ధనాగమము, దేహారోగ్యము, విశేషకీర్తియు, సర్వకార్యజయము, అన్నదానఫలప్రాప్తి, దూరదేశప్రయాణము అచ్చట వ్యాపారలాభము, శివదీక్షఫలప్రాప్తి

**మార్చి :** ఋణభయము, స్వల్పఅనారోగ్యము, ధనధాన్యానాశనము, విచిత్ర వస్త్రధారణ, తీర్థయాత్రాచరణ, మణిలాభము, ధనాగమము, ఉద్యోగప్రాప్తియు సుఖము కలుగును.

| | |
|---|---|
| **గ్రహశాంతి** | : రాహు,గురు,కుజ,రాహు, కేతు,శని,బుధ గ్రహశాంతులు ఆచరించ వలెను. నవగ్రహ శాంతి క్రమం పరిశీలించండి. |
| **అదృష్ట సంఖ్య** | : '1' 2,3,4,7,9 మిత్ర సంఖ్యలు ఆది, సోమ,గురు,మంగళ వారములు కలిసిన శుభము. |
| **అదృష్ట రత్నం** | : మఘ–వైఢూర్యము, పుబ్బ–వజ్రము, ఉత్తర–కెంపు ధరించవలెను. |
| **రుద్రాక్ష ధారణం** | : ఏకముఖి, దశముఖి, త్రిజుటి ధరించవలెను. |

| | | |
|---|---|---|
| 9 10 | కు బు 8 | ర చం శు కే 7 6 |
| 11 | రాశి | 5 |
| రా 12 1 గు ల | 2 | 3 4 శ |

# కన్యరాశి ఫలము



**ఉత్తర 2,3,4, హస్త 1,2,3,4, చిత్త 1,2**

**ఆదాయం : 5** **వ్యయం : 5**

**రాజపూజ్యం : 5** **అవమానం : 2**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| **గురుడు** | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | జన్మం<br>ద్వితీయం | శ్రమాధిక్యం<br>శుభం |
| **శని** | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | అర్ధాష్టమం<br>తృతీయం<br>అర్ధాష్టమం | ఆరోగ్యభంగం<br>సర్వకార్యజయం<br>ఆరోగ్యభంగం |
| **రాహువు<br>కేతువు** | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | వ్యయం/షష్టం<br>లాభం/పంచమం | మిశ్రమం<br>లాభం |

కన్యారాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయూ శుభాశుభ మిశ్రమ ఫలితములు గోచరమగుచున్నవి. సం॥ర పూర్వార్థం కాఠిన్యముగాను మధ్యమం శుభకరంగాను ఉత్తరార్థం మధ్యమ ఫలితములు పొందగలరు. పూర్వార్థం మనోకాఠిన్యము, వస్తు, వాహన నాశము, అనారోగ్యము, శతృపీడ, కలహము, ధనక్షయము, పశునాశము, పితృ బంధువియోగము, ప్రభుత్వపరమైన చిక్కులు, ఋణభయము, యత్నకార్యభంగము, బంధనప్రాప్తియు, పిత్తక్షయాది రోగభయములును సకల కార్యములు నిలచి యుండుట, జరుగుచున్న పనులు సైతము వాయిదాపడుట, విద్యుత్ ఉపకరణములు చెడిపోవుట, భార్యా పుత్ర విరోధము, మాతృకష్టము కలుగును.

సం॥ర ఉత్తరార్ధంబున శుభశుభమిశ్రమ ఫలములు కలుగును. మధ్యమధ్య అనారోగ్యలోపములు, ధనవ్యయం ధనక్షయము, వస్తువాహననాశనము, క్షేత్రాభివృద్ధియు, పశులాభము, గోలాభము, తీర్థయాత్రచింతన వైద్యశాలాదర్శనము, ఔషధ సేవనము, శతృపీడ, శతృమూలకముగా అపకీర్తి, అగౌరవము, మిత్రులతో కలహము, అధికార దర్శనము, అనుకూల నిర్ణయములు ఆరోగ్యము, నూతన వస్తు సంచయము, దూరదేశప్రయాణము, దైవదీక్ష, మాణిభూషణ సంగ్రహము, నూతన వస్తు, వస్త్ర, వాహన లాభము, మంత్రర్ధ సిద్ధియు, సూర్యపూజ, కీర్తి, లాభము ఇంటియందు ప్రసవము, వ్యవసాయవృద్ధియు, సహోదరాభివృద్ధియు, బంధుకళ్యాణము, అశ్వలాభము, అపకీర్తిభయము, దేహాలస్యము బంధుకలహము, లబ్ధత్వము, కార్యనాశనము, రాజక్రోధము కలుగును.

విద్యార్థులకు రెండవఛాన్స్ లాభించగలదు. అవివాహితులకు సం॥ర మధ్యమున వివాహములు కాగలవు. నిరుద్యోగులు తప్పక ఉద్యోగులుకాగలరు. ఉద్యోగులపై నిందారోపణలు, దూరప్రాంతములకు బదిలీలు ఉండును. వ్యాపారస్తులకు అధికారులపీడ, నష్టములు గోచరమగుచున్నవి. రైతులకు రెండవపంట అనుకూలము, కార్మికులకు సం॥రమంతయు కాఠిన్యముగానుండును. కవులు, కళాకారులు సామాన్య ఫలితములను పొందగలరు. రాజకీయ నాయకులకు సామాన్యము ప్రవాసభారతీయుల వెనుకకు వచ్చెదరు. గురుడు సంవత్సర మంతయు సామాన్య ఫలితములు నిచ్చును. రాజ కోపము కీర్తి హాని, ఉద్యోగవిరోధము, బుద్ధిభ్రంశము భాగ్యహాని, భయము, హృదయసుఖము, యశోవృద్ధి, సౌభాగ్యము, ధనాదాయము ధర్మకార్యములు చేయుట కలుగును.

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** శుభాశుభ మిశ్రమ ఫలము కలుగును. కలహమును, భ్రాతృనాశనమును, ఆప్తబంధునాశనమును, సొంతప్రభుమూలకముగా కష్టమును, మహారాజవిరోధమును, నీచజనసేవయు, అధిక కష్టమును, నీచకృత్యము చేయుటయు, క్షేత్రహాని కలుగును

**మే :** జ్వరభయము, స్థాననాశనము, శస్త్రపీడయు, పితృవికారము, మనోవైకల్యము, వాహన ప్రమాదము, శస్త్రచికిత్సలు, ఔషదసేవనం, భార్యాపుత్రపీడయు అన్నింటా సమస్యలు

**జూన్ :** సర్వకార్యజయం, ఆరోగ్యం, గోలాభము, దైవదర్శనం, పుణ్యక్షేత్రసందర్శనము క్షేత్రవృద్ధి, నూతన వస్తు లాభము, విదేశీమిత్ర సందర్శనము, అపూర్వ వస్తు లాభము, కీర్తిప్రతిష్టలు, అపూర్వమిత్రుల కలయిక సంతోషము కలుగును.

**జూలై :** శత్రుజయం, ధైర్యము, సాహసము, భూలాభము, నూతన వస్తు సంచయము, బంధు దర్శనము, ఆరోగ్యము, నూతన రాజకీయపదవీయోగము, యజ్ఞదీక్షాదిచింతన

**ఆగష్టు :** భార్యాపుత్ర సౌఖ్యము, ధనలాభము, రాజస్నేహము, అధికారప్రాప్తియు, సత్కీర్తి, దేవతాపూజయు, వాహన లాభము, మనోవిలాసము, శ్రేష్టమైన ఆభరణ ప్రాప్తి

**సెప్టెంబర్ :** వాహనప్రాప్తియు, పురాధిపత్యము, రాజదర్శనం, భూషణప్రాప్తియు, అర్థలాభము, విశేష సుఖము, ఇంటియందు కళ్యాణాధి శుభకార్యప్రాప్తియు, గృహ, తటాక నిర్మాణ ఫలప్రాప్తియు, అన్నదానఫలము, యత్నకార్యలాభమును కలుగును.

**అక్టోబర్ :** ధనప్రాప్తియు, ఆరోగ్యము, దేవపూజయు, నూతన వస్తు, వాహన లాభమును, భార్యా పుత్ర సౌఖ్యమును, ప్రియబంధుసుఖమును, నూతన వస్త్ర లాభమును, విశేష సౌఖ్యమును, ఆనందమును, నానామూలకముగా సుఖము కలుగును.

**నవంబరు :** పాపకార్యచింతన, మనోవ్యధ ఉద్యోగభంగము, హఠాత్తుగా అనారోగ్యలోపము, వాహన నాశనమును, వస్తు నాశనము, చోరభయమును, జ్వర భయమును, అకారణ కలహము, స్త్రీ, పుత్ర పీడయు మనోవ్యధ, శతృభయము కలుగును.

**డిశంబర్ :** సర్వకార్య విలంబము, స్థాననాశనము, భార్యావియోగము, భయమును, దారిద్ర్యబాధయు, సమయానికి ధనము సర్దుబాటుగాకపోవుట, సర్వకార్యనాశనము, భూగృహనిర్మాణాది కార్యములు వాయిదా పడుట, నిరాశ కలుగును.

**జనవరి 2018 :** స్వల్ప అనారోగ్యము, మనోచింత, దేహబాధ, స్వస్థాననాశనము, దూరదేశప్రయాణము, ప్రయాణవిఘ్నము, మనోవికారము, జంతుభయము, విశేష కష్ట నష్టములు నెదుర్కొనుట, ఎల్లచోట్లను కలహము, ధాన్యానాశనము కలుగును.

**ఫిబ్రవరి :** స్వల్ప అనారోగ్యము బాధించుచున్ననూ స్థిమితము మీద కార్యములు చక్కబడును. మిత్రులవలన కార్యములు పూర్తి అగును. కోర్టు, పోలీసు కేసులు పట్ల వ్యతిరేకత

**మార్చి :** భార్యాపుత్ర సౌఖ్యము, ఇష్టసిద్ధియు, విశేష సుఖము, క్షేత్రవృద్ధియు, వస్త్రభూషణ సంగ్రహమును, తీర్థయాత్రాచరణ, దైవదర్శనము, స్థాననాశనము, చోరభయము, దూర దేశప్రయాణ విఘ్నము, కార్యవిలంబము కలుగును.

**గ్రహశాంతి** : ఈ సంవత్సరం గురు, శని, రాహు,కేతు, చంద్రగ్రహములకు శాంతులు ఆచరించవలెను. నవగ్రహశాంతి పరిశీలించండి.

**అదృష్ట సంఖ్య** : '5' 1,4,6 మిత్ర సంఖ్యలు. 14,23 తేదీలు ఆది,బుధ, శుక్రవారములు

**అదృష్ట రత్నం** : ఉత్తర–కెంపు, హస్త–ముత్యం, చిత్త–పగడం ధరించవలెను

**రుద్రాక్ష ధారణం**: చతుర్ముఖి, త్రయోదశముఖి, నవదశముఖి ధరించిన శుభం

| | | |
|---|---|---|
| 8 9 | కు బు 7 | ర శు కే 6 5 |
| 10 | రాశి | 4 |
| రా 11 గు 12 | 1 ల | 2 కు 3 శ |

# తులరాశి ఫలము



**చిత్త 3,4, స్వాతి 1,2,3,4, విశాఖ 1,2,3**

**ఆదాయం : 2** **వ్యయం : 8**

**రాజపూజ్యం : 1** **అవమానం : 5**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | వ్యయం<br>జన్మం | ధనవ్యయం<br>శ్రమాధిక్యం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | తృతీయం<br>ద్వితీయం<br>తృతీయం | సర్వకార్యజయం<br>ధననష్టం<br>సర్వకార్యజయం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | లాభం/పంచమం<br>ధశమం/చతుర్థం | జయం<br>స్థానచలనం |

తులరాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయూ శుభ ఫలితములు పొందగలరు. ఏలినాటి శని ప్రభావము గత జనవరిలో తొలగుటచే అత్యంత శుభ ఫలితములు ఈ సం॥రమంతయు పొందగలరు. ఎప్పటినుండో ఆగిపోయిన కార్యములన్నియు తిరిగి ప్రారంభమయి ఉత్సాహముతో నుండగలరు. ధనము సమయానికి సర్దుబాటుకాగలదు. కొత్త ప్రాజెక్టులు పట్టాలపైకి ఎక్కును. నూతన వ్యక్తుల పరిచయముతో నూతన కార్యములు ప్రారంభం చేయుదురు. భూ, గృహ నిర్మాణాది కార్యములు చేపట్టుదురు. ఇంటియందు శుభకార్యములు చేయుదురు. మనోల్లాసము, ఉత్సాహముతో నుందురు. అన్నింటా లాభములనార్జింతురు. ఆరోగ్యం బాగుండును. ఇతరుల మీ సలహా సంప్రదింపులకైవత్తురు. బంధుపూజ్యత, గౌరవం పెరుగును. సంఘగౌరవం పెరుగును. నూతన పదవీయోగము లభించును. సం॥ర మధ్య కాలమునందు కొంత వ్యతిరేకత, అనారోగ్య సూచనలున్నవి. కలహమును, ధననాశనమును, రాజక్రోధమును, పశుహానియు, క్షేత్రహానియు, ఆకస్మాత్తుగా కలహము, బంధుకలహము, అధికారనాశనము, దేహపీడయు, ఉద్యోగభంగమును, వాహనక్షయమును, వస్త్రాభరణ హానియు, వ్యాధిపీడయు కలుగును.

సం॥ర ఉత్తరార్థమునందు తిరిగి అన్నివిధాలాపుంజుకుందురు. శత్రుజయము, మిత్రలాభము కలుగును. ఆరోగ్యము చేకూరును. అన్నివిధాలా అనుకూల వాతావరణం చేకూరును. యత్నకార్యసిద్ధి, భార్యాసౌఖ్యము కలుగును. ఋణద్రవ్య సంగ్రహము, అపూర్వవస్తు, వస్త్రప్రాప్తియు, భూషణలాభము, ఉద్యోగ లాభము, శుభకళ్యాణ సంపత్తియు కలుగును. అపూర్వ ప్రియదర్శనము, రాజదర్శనము, ప్రభుత్వ అనుమతులు అప్రయత్నముగా సిద్ధించును.

విద్యార్థులకు రెండవఛాన్స్‌లో మంచి ఫలితములు పొందగలరు. అవివాహితులకు ముందు కొంత నిరాశ ఎదురైనా చివరిలో మంచి సంబంధములు కుదిరి వివాహములు జరుగును. నిరుద్యోగులు ఉత్తరార్థంలో ఉద్యోగంలో జాయిన్ అగుదురు. ఉద్యోగులు కోరిన చోటికి బదిలీ కాబడుదురు. రైతులకు అత్యంత శుభకాలం వ్యవసాయం అన్నివిధాలా లభించును. కార్మికులు సులువుగా తమ పనులు నెరవేర్చుకొనగలరు. కవులు, కళాకారులు, సన్మానములు, సత్కారములు పొందగలరు. రాజకీయులు నూతన పదవీ యోగం పొందగలరు. ప్రవాస భారతీయులు అత్యంత అనుకూలం మంచి ఉద్యోగం పొందగలరు. స్పెక్యులేషన్

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** అప్రయత్నకార్యసిద్ధి, ధనలాభము, నూతన ఉద్యోగ లాభము, బంధుపూజ్యతయు, కీర్తి, గౌరవము, దైవదర్శనము, తీర్థయాత్రాదిలాభమును, క్షేత్రాభివృద్ధియు, గో, పశులాభము, కీర్తి, సన్మానము, గృహనిర్మాణాధిలాభం కలుగును.

**మే :** ద్రవ్యలాభము, భార్యాపుత్రవృద్ధియు, జ్ఞానవృద్ధియు, శతృనాశనము, యత్నకార్యసిద్ధియు, మనస్సంతోషము, ఇష్టసిద్ధియు, ధనధాన్యాభివృద్ధియు, వస్త్రభూషణ సంగ్రహము కలుగును.

**జూన్ :** బంధుకోపము, స్థానాశనము, యత్నకార్యభంగము, విశేషకష్టమును, ధన, ధాన్యానాశనమును, అర్థహానియు, పశుహానియు, అధిక కష్టము, ఎల్లచోట్లను కలహమును, భూ, గృహనిర్మాణాధికార్యములు వాయిదా పడుట జరుగును.

**జూలై :** అపవాదభయము, హఠాత్తుగా అనారోగ్యమును, ఆప్తబంధువియోగము, కీర్తినాశనము, ఇంటాబయట సమస్యలు, వస్తు వాహననాశనము, చోరభయము, ఇంటియందు కలహం, శతృభయము, అకారణ కలహము, పదవీవియోగము కలుగును.

**ఆగష్టు :** బలహీనము, కాంతిలేమి, క్షేత్రనాశనము, ధన, ధాన్యానాశనము, ప్రియబంధు విరోధము, అపయశస్సు, ధననష్టము, అనారోగ్యము, వ్యాపారమునందు నష్టములు

**సెప్టెంబర్ :** స్వస్థాననాశనము, రాజకోపము, అధిక కష్టము, ప్రియవస్తునష్టమును, క్షేత్రనాశనము, పశునాశనము, వ్యాపారనష్టమును, కోర్టుకేసులు ఎదుర్కొనుట, అపకీర్తి దుర్వ్యయము, శతృభయము, భూ, గృహనిర్మాణాధి కార్యములు ఆగిపోవుట జరుగును.

**అక్టోబర్ :** అనారోగ్యము, తేజోహీనము, అకాల భోజనము, అకారణ కలహము, మనశ్శాంతి లేకపోవుట, ధనవృద్ధి, ధాన్యలాభము, నూతన వస్తులాభము, విద్యా ఉద్యోగ లాభం కలుగును.

**నవంబరు :** శుభకార్యప్రాప్తి, వివాహ నిశ్చయం, కీర్తి, గౌరవం, నూతన ఉద్యోగలాభము, భూ, గృహ నిర్మాణాధికారము, మిత్రసుఖము, గౌరవ ప్రతిష్టలు పెరుగుట, నూతన పదవీయోగం, దైవదర్శనం, నూతన దేవాలయ ప్రతిష్ట, కార్యక్రమ నిర్వహణ.

**డిశంబర్ :** క్షేత్ర సంగ్రహము, కృషి లాభము, హేమలాభము, వస్త్రప్రాప్తియు, ముత్యములు, రత్నములు లభించుట. అపూర్వ వస్తు సంగ్రహము, ప్రియవస్తు ప్రాప్తియు, గృహలాభము, మిత్ర సుఖము, జయము, కీర్తి లాభము, భార్యాపుత్ర సౌఖ్యము కలుగును.

**జనవరి 2018 :** తేజోవృద్ధి, ఆరోగ్యము, కీర్తి, గౌరవం, శతృనాశనము, మిత్రలాభము, ఆయాచిత ధనలాభము కలుగును. మధ్య మధ్య చిన్న చిన్న ఆరోగ్య లోపములుండును.

**ఫిబ్రవరి :** ధనధాన్యావృద్ధి, ఆరోగ్యము నూతన వస్తు లాభము, గో లాభము, పశు లాభము, గృహ నిర్మాణాధికారము, మిత్ర లాభము, యత్నకార్యసిద్ధియు కలుగును. ఇంటియందు వివాహాది శుభకార్యాచరణ, నూతన ఉద్యోగలాభము, ప్రమోషన్స్ కలుగును.

**మార్చి :** భార్యాపుత్ర సౌఖ్యము, ద్రవ్యలాభము, నూతన వస్త్ర,వాహన లాభము, వ్యాపారాభివృద్ధియు, శతృభయము, ఇంటి యందు శుభకార్యాచరణ మంగళవాయిద్య గోష్టి

**గ్రహశాంతి :** రవి, కుజ, శని, బుధ గ్రహశాంతులు ఆచరించవలెను. నవగ్రహ శాంతిక్రమం పరిశీలించండి

**అదృష్ట సంఖ్య :** '6' 5,8 మిత్ర సంఖ్యలు. 15,24 తేదీలు శుక్ర, బుధ, శనివారములు కలిసిన మరింత యోగము.

**అదృష్టరత్నం :** చిత్త–పగడము, స్వాతి–గోమేధికం, విశాఖ–పుష్యరాగం ధరించవలెను.

**అదృష్ట రుద్రాక్ష:** పంచముఖి, చతుర్ధశముఖి, ఏకవింశతిముఖి రుద్రాక్షధారణ శుభము.

| | | |
|---|---|---|
| 7 8 | కు బు 6 | ర 5 శు కే 4 |
| 9 | రాశి | 3 |
| 10 రా 11 గు | 12 | 1 ల శ 2 |

# వృశ్చికరాశి ఫలము



**విశాఖ 4, అనూరాధ 1,2,3,4, జ్యేష్ఠ 1,2,3,4**

**ఆదాయం : 8** **వ్యయం : 14**

**రాజపూజ్యం : 4** **అవమానం : 5**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | లాభం<br>వ్యయం | ధనలాభము<br>ధనవ్యయం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | ద్వితీయం<br>జన్మం<br>ద్వితీయం | ధననష్టం<br>అనారోగ్యం<br>ధననష్టం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | దశమం/చతుర్థం<br>నవమం/తృతీయం | స్థానచలనం<br>లాభం |

వృశ్చికరాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా శుభాశుభ మిశ్రమ ఫలం కలుగును. ఏలినాటిశని ప్రభావముచే కష్టనష్టముల నెదుర్కొనక తప్పదు. ప్రతి పనియందు వ్యతిరేకత అన్నింటా సమస్యలు తరచు అనారోగ్య సమస్యలు చుట్టుముట్టును బంధుమిత్ర కలహములు, నమ్మినవారి వలన మోసములు, ఆత్మ విశ్వాసంలోపించుట, ప్రతి పని వాయిదా పడుట, ఒకే పనికి అనేకసార్లు వృధా ప్రయాణము చేయుట, వృధా సంచారము, కోర్టు వ్యవహారములు యందు వ్యతిరేకత ముఖమునందు కళ తప్పుట, తేజోహీనము, ముఖము నల్లగా మారుట, ధనమునకు ప్రయాసపడుట, అధిక ధనవ్యయము, కార్యవిఘ్నములు, భూగృహ నిర్మాణా ధికార్యములు హఠాత్తుగా వాయిదా పడుట జరుగును.

సెప్టెంబరు వరకు గురుబలము ఉండుటచే కొంత ఉపశమనముగా నుండును. సమస్యలున్ననూ ధనము సర్దుబాటు అగును. వ్యవహారజయము, వివాహాది శుభకార్యములు అతికష్టం మీద నెరవేరును. పోలీసు, కోర్టు కేసులయందు స్వల్ప ఊరట కలుగును. శారీరకశ్రమ, మానసిక ఒత్తిడికి గురికాగలరు. తదుపరి శుభకార్యాచరణ నిమిత్తం ధనవ్యయం కాగలదు. దేవాలయ నిర్మాణాది కార్యములయందు పాల్గొందురు. అనుకున్నదానికి 4రెట్లు ధనవ్యయము చేసినగాని కార్యములు నేరవేరవు. ఋణవృద్ధి అగును. శత్రు భయము కలుగును.

ఉత్తరార్ధమున కొంత అనుకూలత కలుగును. దూరదేశ ప్రయాణములు లాభించును. ధైర్యము సాహసము కలుగును. సోదరమూలక ధనలాభము కలుగును.. అతికష్టంమీద కార్యజయము పొందగలరు. ఆరోగ్యము సిద్ధించును. భార్యాభర్తల మధ్య అన్యోన్నత పెరుగును. కుటుంబ సమస్యలు కొన్ని పరిష్కారమగును. బంధు కలహములు, మిత్ర విరోధములు తప్పవు. దూరదేశ ప్రయాణములు కలుగును. కార్య సాఫల్యత ఆలస్యము మీద నెరవేరును.

విద్యార్థులకు కష్టకాలము అతికష్టము మీద సామాన్య ఫలితములు పొందగలరు. అవివాహితులకు నిరాశాజనకము సంబంధములు కుదిరినట్లే కుదిరి తప్పిపోవును. నిరుద్యోగులకు ఉద్యోగం కొరకు మరి కొంత కాలం ఎదురుచూడక తప్పదు. అతికష్టంమీద చిరుద్యోగం పొందగలరు. ఉద్యోగులు ఆరోపణలు ఎదుర్కొనక తప్పదు. దూరప్రాంతములకు అయిష్టముగా బదిలీకాబడుదురు. సస్పెన్షన్లకు గురి అగు అవకాశమున్నది.వ్యాపారులు అతి కష్టం మీద సామాన్య లాభములు పొందగలరు. నూతన వ్యాపార నిర్ణయము అమలు చేయలేరు. వాయిదా వేసుకొనుట మంచిది. రైతులకు కష్టకాలము.

## నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** శుభాశుభమిశ్రమ ఫలం కలుగును. ధనలాభము క్షేత్రవృద్ధి వ్యాపార లాభము, యశస్సు, మనస్సంతోషము, పాండిత్యము, మనోవికారము, అల్పులతో మాటలు పడుట, దాయాదులతో కలహము, యత్నకార్యవిలంబము, అనారోగ్యము కలుగును.

**మే :** చిన్నచిన్న ఆరోగ్య సమస్యలు వైద్యశాలాదర్శనము, ఔషద సేవనము, నమ్మిన వారి వలన మోసపోవుట, శతృవృద్ధి, ధనక్షయము, నూతన వస్తువులు సేకరించుట, మణి వస్త్ర లాభము, వివాహాది శుభకార్యప్రాప్తి, దేవతా దర్శనము కలుగును.

**జూన్ :** నూతన వస్తు వాహన లాభము, కీర్తి యశస్సు, అపజయము, అకాల భోజనము, అపకీర్తి, మనోవిచారము, అతినిద్ర, ఆకలి, దూరదేశ ప్రయాణము, శతృబాధ, పశునష్టము

**జూలై :** రాజవిరోధము, అధికారులతో కలహము, ఆయాసము, పనులయందు జాప్యము, శతృవృద్ధి, ధనక్షయము, జ్ఞాతులతో కలహము మిత్రులు శతృవులగుదురు

**ఆగష్టు :** శుభాశుభ మిశ్రమ ఫలం కలుగును. కొంత ఊరట కలుగును. ధనము సర్దుబాటు అగును. మిత్రమూలకముగా శుభం కలుగును. అతి కష్టం మీద తలచిన కార్యములు సఫలమగును. నూతన వాహనవృద్ధి కలుగును. పశులాభం కలుగును.

**సెప్టెంబర్ :** ధనము అతికష్టం మీద సర్దుబాటు అగును. అకారణ కలహము, శుభకార్యా చరణ, నిమిత్తం అధిక ధనవ్యయము, మాట పట్టింపులు, కలహము, దేవాలయ, తటాక నిర్మాణాది ఫలము, శివభక్తి, దైవదర్శనము, నదీ తటాక స్నానఫలము కలుగును.

**అక్టోబర్ :** అన్నదాన ఫలము, దూరదేశ ప్రయాణము కలుగును. కార్య విఘ్నములు, తరచు అనారోగ్య లోపములు, శరీరము పై గాయములు, రక్త దర్శనము, వాహన నష్టము

**నవంబరు :** అధికారులతో ఇబ్బందులు, ప్రభుత్వ అనుమలు నిలచి ఉండుట, బంధువులతో విరోధము, ఋణవృద్ధి, సేవకులతో కలహము, పుత్ర విరోధము, కుటుంబ కలహము

**డిశంబర్ :** విద్యాభ్యాసాది శుభకార్యప్రాప్తి, ధనక్షయము, దూరదేశ ప్రయాణము, మనోచింత మంత్రసిద్ధి, మహాత్ముల సందర్శనము, అపూర్వవస్తు సంప్రాప్తియు, గురుదేవతా దర్శనములు, అకాల భోజనము, మణివస్త్ర లాభము, రాజదర్శనము కలుగును.

**జనవరి 2018 :** శిరోరోగము, అధికార నష్టము, రాజమూలకముగా ధనవ్యయము, వాతారోగపీడయు, తల్లివర్గపు వారి వంశ నాశనము, పుత్ర విరోధము, యాత్రా కలహము, స్వంత జనుల తోటి విరోధము, కార్యభంగము, ధనవ్యయము కలుగును.

**ఫిబ్రవరి :** పశ్చిమ దిక్కున ప్రయాణము, మతిస్థిమితము కోల్పోవుట, బంధుమిత్ర కలహము, అతి నిద్ర, ఆకలి, కార్యవిలంబము, పశుక్షయము, అర్ధనాశనము, ధాన్యానష్టము

**మార్చి :** గురుద్వేషము, పుత్రహానియు, శిరోరోగము, శస్త్ర బాధయు, భయము, అపకీర్తి, ఉద్యోగచలనము, వ్యవహార భయము, యత్నకార్యభంగము, పశుహానియు, దేహాలస్యము, గొప్ప భయము, స్త్రీ కలహము తప్పక కలుగును.

| | |
|---|---|
| **గ్రహశాంతి** | : ఈ సంవత్సరమంతయూ శని, గురు, కుజ, బుధ, రాహు/కేతువులకు శాంతి జరిపించవలయును. నవగ్రహ శాంతి క్రమం పరిశీలించండి. |
| **అదృష్ట సంఖ్య** | : **'9'** 1,2,3,4,7 మిత్ర సంఖ్యలు. ప్రతినెల 9,18,27 తేదీలు ఆది,సోమ, మంగళ, గురువారములు అదృష్టప్రదము. |
| **అదృష్టరత్నం** | : విశాఖ-పుష్యరాగము, అనూరాధ-నీలము, జ్యేష్ట-పచ్చ ధరించవలెను |
| **రుద్రాక్ష ధారణం** | : షణ్ముఖి, సప్తముఖి, పంచదశముఖి, షష్టదశముఖి, గౌరిశంకర |

| | | |
|---|---|---|
| 6 7 | కు బు 5 | ర చం శు కే 4 3 |
| 8 | రాశి | 2 |
| రా 9 గు 10 | 11 | 12 ల 1 శ |

# ధనూరాశి ఫలము



**మూల 1,2,3,4, పూర్వాషాఢ 1,2,3,4, ఉత్తరాషాఢ 1**

**ఆదాయం : 11** **వ్యయం : 5**

**రాజపూజ్యం : 7** **అవమానం : 5**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | దశమం<br>లాభం | కార్యసిద్ధి<br>ధనలాభం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-3-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | జన్మం<br>వ్యయం<br>జన్మం | అనారోగ్యం<br>ధనక్షయం<br>అనారోగ్యం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | నవమం/తృతీయం<br>అష్టమం/ద్వితీయం | లాభం<br>అనారోగ్యం |

ధనూరాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయు శుభాశుభమిశ్రమ ఫలితములు గోచరమగుచున్నవి. ఏలినాటి శని ప్రభావముచే సం॥రమంతయూ అగమ్యగోచరముగానుండును. అనారోగ్యము బాధించును. తరచు వైద్యశాలాదర్శనము, ఔషద సేవనం తప్పదు. సర్వకార్యములయందు వ్యతిరేక ఫలితములు కలుగును. మిత్రులు సైతం శత్రువులుగా మారి బాధించెదరు. కుటుంబ కలహములు కలుగును. ఇంటా బయట సమస్యలు నెదుర్కొనక తప్పదు. భూ, గృహనిర్మాణాది కార్యములు నెరవేరవు. ప్రభుత్వపరమైన చిక్కులు కలుగును. వృధాసంచారము, దూరదేశప్రయాణములు కలుగుట, కార్యవిఘ్నములు కలుగుట, అపశకునములు చెడువార్తలు వినుట, మానసిక, శారీరక శ్రమ పెరుగును. మోసమునకు గురి అగుట, చోరబాధ, శస్త్ర చికిత్సలు భార్యాపుత్రుల వియోగము కలుగును.

గురుబలముచే ధనమునకు లోటురాదు. ఆరోగ్యము చేకూరును. నూతన వ్యాపారములు కలసివచ్చును. దూరప్రయాణములు ఆలస్యము మీద నెరవేరును. కష్టము మీద సకల కార్యములయందు జయము కలుగును. బంధుమిత్రులు సహకరించెదరు. మంత్రసిద్ధి, దైవ మహాత్ముల సందర్శనములు కలుగును.నూతన దేవాలయ, తటాక నిర్మాణ ఫలము, గో, పశువృద్ధి, అన్నదానఫలము కలుగును. బంధుపూజ్యత ఇష్టాన్నభోజనము కలుగును.

సం॥ర పూర్వార్ధము రాహుకేతు బలముచే సర్వకార్యజయము, మంత్ర సిద్ధి, ప్రయాణ లాభము, పితృవర్గ జనాభివృద్ధి, అపూర్వవస్తు లాభము, రత్నాభరణ సంప్రాప్తి, నూతన వస్తు వాహన లాభము కలుగును. ఉత్తారార్ధమున సమస్యలు జటిలమగును. ఆరోగ్యము క్షీణించును. వాహన ప్రమాదములు హఠాత్పరిణామములు జరుగు సూచనలున్నవి

విద్యార్ధులకు మొదటి ఛాన్స్ లాభకరము, రెండవ ఛాన్స్‌లో కష్టనష్టములు కలుగును. అవివాహితులకు సం॥రమంతయూ అనుకూలము కాదు. నిరుద్యోగులు సం॥ర పూర్వార్ధంలో చిరుద్యోగము సంపాదించగలరు. ఉద్యోగస్తులకు కష్టకాలము ఆరోపణల నేపథ్యంలో దూరప్రాంతములకు బదిలీ కాబడుదురు. వ్యాపారులకు కష్టకాలము, నూతన నిర్ణయములు వాయిదా వేసుకొనుట మంచిది. రైతులకు ప్రథమార్థం అనుకూలం ఆక్వాకల్చర్‌కు అనుకూలకాలం కాదు. కార్మికులకు అత్యంత కష్టకాలం, కవులు, కళాకారులకు నిరాశాజనకం రాజకీయ నాయకులకు వ్యతిరేకత కలుగును. పదవీ భంగములుండును. ప్రవాస భారతీయులకు పరీక్షాకాలం స్పెక్యులేషన్ లాభించదు.

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** శుభాశుభ మిశ్రమ కాలం. అనారోగ్యం బాధించును. తరచు వైద్యశాలాదర్శనం, ఔషదసేవనం తప్పదు, తక్కువ వారి వలన మాటలు పడుట, సర్వత్రకలహము, మనోవేదన, అధిక ధనవ్యయం, పాతబాకీలు వసూలగుట, ఋణవృద్ధి
**మే :** అనవసర వివాదాలలో చిక్కుకొనుట, దుర్వ్యయము, చోరబాధ, ఋణవృద్ధి, ధనవృద్ధి, పాత బాకీలు వసూలగుట, మిత్ర లాభము, శతృజయము, వ్యాపార నష్టములు, అధికారులతో ఇబ్బందులు, ఆర్థిక మోసమునకు గురి అగుట, పాత మిత్రులు కలయిక కలుగును.
**జూన్ :** నూతన వస్తు వాహన లాభము, సౌఖ్యభోజన ప్రాప్తియు, సంఘ గౌరవము, దేహారోగ్యము, మనస్సంతోషము, కుటుంబ కలహములు, బ్యాంకులతో ఇబ్బందులు, సమయానికి ధనము సర్దుబాటుగాకుండుట, అత్యవసర పనులు వాయిదా పడుట జరుగును.
**జూలై :** ద్రవ్యనాశనము, ఉద్యోగచలనము, మాతృకష్టము, వాహన నాశనము, పశునాశనము, ప్రయత్నకార్యనాశనము, రోగ భయము, తేజోహీనము, మతిభ్రంశము, ప్రయాణ కార్యవిఘ్నము, వస్తు నాశనము, ద్రవ్యహాని, పాత వస్తువులు అమ్ముట జరుగును.
**ఆగష్టు :** స్థిరచరాస్తులు అమ్ముట, రాజకీయ పదవీ భంగము, అనుకూలత, సర్వత్ర అపజయము, వ్యాపారనష్టము, వ్యవసాయ నష్టము, గో పశు నష్టము, అపకీర్తి
**సెప్టెంబర్ :** నీచసేవయు, నీచసాంగత్వము, దేహబాధ, విరోధము, మనస్తాపము, ధన ధాన్యనాశనము, భార్యాపుత్ర కలహము, స్వదేహపీడయు, సర్వత్రకలహము, అజ్ఞాతవాసము, శ్రమాధిక్యము, కీర్తి ప్రతిష్టలకు భంగము, అకాల భోజనము కలుగును.
**అక్టోబర్ :** బంధు ఉపకారము, క్షేత్రవృద్ధియు, భార్యాపుత్ర సౌఖ్యము, విద్యాభ్యాసాది సంగ్రహము, దేహారోగ్యము, మనస్సంతోషము, కార్యలాభము, ఆలస్యము మీద కార్యజయము
**నవంబరు :** కొంత ఊరట కలుగును, దూరదేశ సమాచారం కలవర పరచును, భార్యా పుత్రులతో కలహము, రోగభయము, మాతృ కష్టము, అధికారుల దర్శనము, పోలీసు కోర్టు కేసుల యందు వ్యతిరేకత, ఇంటియందు సమస్యలు, మిత్రదోహము
**డిశంబర్ :** ధర్మకార్యచింతన, దేవాలయ దర్శనము, దేవతా దర్శనము, నదీ తటాక స్నానఫలము, ఇంటాబయట సమస్యలు, వాహన ప్రమాదము, ఆపరేషన్లు, దాయాది కలహము, శతృభీతి, అకారణ విరోధములు, సస్పెన్షన్లు, పదవీభంగం కలుగును.
**జనవరి 2018 :** జ్వర భయము, నిద్రలేమి, కలవరము, చెడు కలలు, సర్ప భయము, జ్వర భయము, చోర భయము, శతృ భయము, శస్త్రపీడయు, వ్రణబాధయు, పిత్త వికారము
**ఫిబ్రవరి :** బంధు కోపము, స్థానవాశనము, యత్నకార్యభంగము, విశేషకష్టము, ధన, ధాన్యానష్టము, అర్థ హానియు, స్థిర, చరాస్తులు అమ్ముట, క్షేత్ర నాశనము
**మార్చి :** సర్వకార్యవిలంబము, స్థాన నాశనము, భార్యా వియోగము, పుత్ర నాశనము, క్షేత్రహాని, మంత్ర సిద్ధి, గురు, దేవతా దర్శనము, వస్త్ర భూషణములు దొంగిలించబడును

| | |
|---|---|
| **గ్రహశాంతి** | : సం॥రమంతయూ శని, రాహు, కేతు, రవి, కుజ గ్రహములకు శాంతులు చేసుకొనవలెను. నవగ్రహశాంతి క్రమం పరిశీలించండి. |
| **అదృష్ట సంఖ్య** | : '3' మిత్ర సంఖ్యలు 1,2,4,7,9 మిత్ర సంఖ్యలు. ప్రతినెల 3,12,21,30 తేదీలు ఆది,సోమ, గురువారములు |
| **అదృష్టరత్నం** | : మూలా–వైడూర్యము, పుర్వాషాడ–వజ్రము, ఉత్తరాషాడ–కెంపు |
| **రుద్రాక్షధారణం** | : త్రిముఖి, ద్వాదశముఖి, ఏకోన్నవింశతిముఖి ధరించిన శుభం. |

| | | |
|---|---|---|
| 5 6 | కు బు 4 | ర 3 శు కే 2 |
| 7 | రాశి | 1 ల |
| రా 8 గు 9 | 10 | 11 12 శ |

# మకరరాశి ఫలము



**ఉత్తరాషాడ 2,3,4,శ్రవణం 1,2,3,4, ధనిష్ట 1,2**

**ఆదాయం : 14** **వ్యయం : 14**

**రాజపూజ్యం : 6** **అవమానం : 1**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| **గురుడు** | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | నవమం<br>దశమం | మిశ్రమం<br>కార్యసిద్ధి |
| **శని** | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-03-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | వ్యయం<br>లాభం<br>వ్యయం | ధనవ్యయం<br>సర్వకార్యజయం<br>ధనవ్యయం |
| **రాహువు<br>కేతువు** | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | అష్టమం/ద్వితీయం<br>సప్తమం/జన్మం | అనారోగ్యం<br>శారీరక శ్రమ |

మకరరాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సం॥రమంతయూ శుభాశుభ మిశ్రమ ఫలితములు కలుగును. గత సం॥లో ప్రారంభమయిన ఏలినాటి శని ప్రభావముచే సర్వకార్య విలంబము, అనారోగ్యము, ఋణ బాధలు, అగౌరము, పదవీభంగము, అకారణ కలహములు, చోరబాధలు, అగ్ని భయము, క్షేత్రనాశనము, దుర్వార్తా శ్రవణము, అజీర్తి, శరీరమునందు నిస్సత్తువ తేజోహీనము, మతిభ్రమణము, మనోవ్యాకులత, వాక్కాఠిన్యత, శతృభయము, మిత్ర దోహము, పాపకార్యచింతన, దూరదేశ ప్రయాణము, కార్య విఘ్నములు, అలసిపోవుట, శని వక్రంచుటచే సర్వకార్యజయము, ఆరోగ్యము, భార్యాపుత్ర సుఖము, దేవాలయ దర్శనము, ద్రవ్యలాభము, క్షేత్రవృద్ధి, మనోసుఖము అన్ని విధముల అనుకూల ఫలితములు కలుగును.

శని ఋజుగతిచే ఏలినాటిశనిపున:ప్రారంభమయ్యి అన్ని విధాలా వ్యతిరేక ఫలితములు కలుగును. నూతన కార్యము వాయిదా వేసుకొనుట మంచిది. భూగృహ నిర్మాణాది కార్యములు నిలచి యుండును. సంవత్సరమంతయూ గురుబలముచే ఏలినాటి శని ప్రభావము కొంత ఉపశమించును. ధన లభ్యత పెరుగును. నూతన ఋణములు చేయుదురు. సమయానికి తగిన ధనము సర్దుబాటు అగును. పితృ వర్గజనాభివృద్ధి నూతన పదవీయోగము, అప్రయత్నకార్యసిద్ధి కలుగును. ధనము నిలబాటు తగ్గును. దైవకార్యములకు ధనము ఖర్చు

అష్టమ రాహు ప్రభావముచే అనారోగ్యము బాధించగలదు, వాహన ప్రమాదములు, రక్త దర్శనము కలుగును. హఠాత్పరిణామములతో ఆందోళనకు గురి కాగలరు. పోలీసు, కోర్టు కేసులు బాధించును. అనవసర సమస్యలు నెత్తి మీద కొచ్చును. ఎడమ అవయవములకు కీడు తప్పదు. విద్యార్ధులకు సం॥ర మధ్యమం మినహా అనుకూలం కాదు. బాగా కష్టపడవలసివచ్చును. అవివాహితులకు స్వల్ప ఊరట కలుగును. సంబంధములు కుదురును. కాని వివాహములు వాయిదా పడును. నిరుద్యోగులకు ఆశాజన ఫలితములు లేవు. సం॥ర మధ్యమున చిరుద్యోగము లభించగలదు. ఉద్యోగస్తులకు సం॥రమంతయు అనుకూలము కాదు. సస్పెషన్లకు గురి కావలసివచ్చును. దూరప్రాంతములకు అయిష్ట బదిలీలకు గురికాబడుదురు. వ్యాపారులు నష్టములతో కొనసాగుదురు. రైతులకు రెండు పంటలు అనుకూలం కాదు. కవులు, కళాకారులకు ఆశాజనకంగా లేదు. రాజకీయనాయకులకు పదవీగండములున్నవి. ప్రవాసభారతీయులకు వ్యతిరేకత ఫలితములు కల్గును. అనారోగ్యం, ప్రతికూల ప్రభావములచే వెనుకకు వత్తురు. స్పెక్యులేషన్ లాభించదు

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** అనారోగ్యము, వైద్యశాలాదర్శనము, ఔషదసేవ, దూరదేశప్రయాణము, ప్రయాణ విఘ్నము, అజీర్తి, కుటుంబ కలహములు, శస్త్రపీడ, వాహన ప్రమాదములు

**మే :** ఆర్థిక ఇబ్బందులు పెరుగును. దుర్వ్యయము, అకారణకలహము, మనశ్శాంతి లేకపోవుట, వైద్యశాలాదర్శనము, తగాదాలు, మాటపట్టింపులు, విరోధాలు కలుగును. నూతన ఉద్యోగ, వ్యాపారాది నిర్ణయములు వాయిదా పడును. రాజకీయ నాయకులకు పదవీ గండం తప్పదు.

**జూన్ :** శుభాశుభ మిశ్రమ కాలం పాత బాకీలు వసూలగుట, కానీ ధనవ్యయముండును. అనవసర వివాదాలలో చిక్కుకొనుట, శతృ భయము, మిత్రద్రోహము, ఆర్థిక పరిస్థితి గడ్డుగానుండును. ఆరోగ్యం కొంత ఉత్సాహం కలుగును. పాత మిత్రులు కలయిక

**జూలై :** నూతన వస్తు వాహన లాభము, విదేశీ వస్తు సంచయము, రత్నాభరణ లాభము, మిత్ర మూలకముగా ధనవృద్ధి, వ్యాపారాభివృద్ధి, గో, అశ్వలాభము, సేతు స్నానఫలము, దేవతాదర్శనము, గురుదైవపూజ, సర్వకార్య సిద్ధియు, రాజకీయ పదవీయోగం కలుగును

**ఆగష్టు :** బంధు పూజ్యతయు, సంఘ గౌరవము, నూతన ఉద్యోగ లాభము, భూగృహ నిర్మాణాధికారము, గంగాస్నానఫలము, స్వస్థానచలనము, క్షేత్రార్థవృద్ధియు, దేహారోగ్యము, విద్యాభ్యాసాదా సంగ్రహము, ప్రయత్న కార్య లాభము, మిత్ర లాభము.

**సెప్టెంబర్ :** అధికారుల దర్శనము, సంతోషము, ప్రభుత్వపరమైన అనుమతులు లభించుట. పాత బాకీలు వసూలగుట, కోర్టు కేసులయందు అనుకూల తీర్పులు, శతృజయము, విద్యాభ్యాసాది సంగ్రహణము, దూరదేశమునుండి ఆహ్వానము, సన్మానము కీర్తి

**అక్టోబర్ :** భూగృహనిర్మాణాధికారము, రాజకీయ పదవీయోగము, స్వల్ప అనారోగ్యము, అకారణ కలహము,భార్యాపుత్ర కలహమును, దూరదేశ ప్రయాణము, కార్యవిఘ్నము

**నవంబరు :** స్వల్ప అనారోగ్యము, వైద్యశాలాదర్శనము, ఔషద సేవనము, కార్యనాశనము, దేహబాధ, మనస్తాపము కలుగును. అకారణ కలహముల సంభవించును. శతృపీడ, స్త్రీ విరోధము కలుగును. అకాల భోజనము, మనస్తాపము, స్వదేహపీడయు కలుగును.

**డిశంబర్ :** మాతృ మూలక ధనవ్యయము, ఋణవృద్ధి, వ్యతిరేకత ప్రయాణ కార్యభంగము, వృధా సంచారము, అకాల భోజనము, అకారణ విరోధము, మాట పట్టింపులు

**జనవరి 2018 :** స్వల్ప అనారోగ్యము పుత్రపీడ, గురు విరోధము, ధననాశనము, స్థాననాశనము, ఋణవృద్ధి కలుగును. అర్థహానియు, పశుహానియు, అధిక కష్టము ఎల్లచోట్ల విరోధము, జ్వరభయము, స్థాననాశనము, రాజభీతియు, చేతులకు, కాళ్ళకు గాయాలు

**ఫిబ్రవరి :** పాపకార్యచింతన, మనోవ్యధ, ఉద్యోగభంగము, దేహాలస్యము స్థాననాశనము, విశేష భయము, యత్న కార్యభంగము, ప్రయాణ కార్యభంగము, క్షేత్రహాని, ధాన్య నష్టము, అర్థ హాని, వైద్యశాలాదర్శనము, అధికారులతో వాగ్వివాదము, సమస్యలు కలుగును.

**మార్చి :** ద్రవ్యనష్టము, వాహన పీడ, వాహన ప్రమాదము, పైనుండి పడుట, ఎడమ వైపు అవయవములకు పీడ, శతృభీతి శస్త్ర, భీతి అనుకూల వాతావారణము, అనారోగ్యము

**గ్రహశాంతి :** ఈ సంవత్సరం రవి, కుజ, రాహు, శని, కేతు గ్రహశాంతుల ఆచరించవలెను. నవగ్రహశాంతి క్రమం పరిశీలించండి.

**అదృష్ట సంఖ్య :** **'8'** 5,6 మిత్ర సంఖ్యలు. ప్రతినెలా 8,17,26 తేదీలు బుధ, శుక్ర, శనివారాలు కలిసిన మరింత శుభము.

**అదృష్టరత్నం :** ఉత్తరాషాడ–కెంపు, శ్రవణం–ముత్యం, ధనిష్ట–పగడం

**రుద్రాక్షధారణం :** అష్టముఖి, నవముఖి, సప్తదశముఖి, షష్టదశముఖి, గణేశరుద్రాక్ష

| | | |
|---|---|---|
| 4 / 5 | కు బు 3 | ర శు 2 / చం 1 కే ల |
| 6 | రాశి | 12 |
| రా 7 / గు 8 | 9 | 10 / 11 శ |

# కుంభరాశి ఫలము



**ధనిష్ఠ 3,4, శతభిషం 1,2,3,4,పూ॥భా1,2,3**

**ఆదాయం : 14** **వ్యయం : 14**

**రాజపూజ్యం : 6** **అవమానం : 1**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| గురుడు | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | అష్టమం<br>నవమం | ధనవ్యయం<br>లాభం |
| శని | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-03-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | లాభం<br>దశమం<br>లాభం | సర్వకార్యజయం<br>వ్యతిరేకత<br>సర్వకార్యజయం |
| రాహువు<br>కేతువు | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | సప్తమం/జన్మం<br>షష్ఠం/వ్యయం | శారీరకశ్రమ<br>సర్వకార్యజయం |

కుంభరాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయు సర్వకార్య జయం కలిగి ఉత్సాహ వాతావరణం కొనసాగును. ప్రతి పని సత్వరము నెరవేరగలదు. శత్రు జయము కలుగును. శత్రువులు మిత్రులగుదురు. మిత్రుల సహకారము పెరుగును. సర్వ కార్యములు ప్రయత్నము లేకనే సఫలీకృతం కాగలవు. పాత పనులన్నియు హఠాత్తుగా పూర్తికాగలవు. నూతన వస్తు, వాహన సంచయము కలుగును. సంఘమునందు కీర్తి, గౌరవము కలుగును. నూతన పదవీ యోగం కలుగును. స్థిరచరాస్తులు కొనుగోలు చేయుదురు. ఆర్థిక లాభం కలుగును. భూ గృహ నిర్మాణాది కార్యములు నెరవేరగలవు. అనూహ్యముగా ధనవృద్ధి, దైవక్షేత్ర సందర్శనములు నదీ, సేతు స్నాన ఫలము, బంధుపూజ్యతయు, సన్మానములు, సత్కారములు, దూరదేశమునుండి ఆహ్వానము అచ్చట గౌరవము, నూతన వస్త్రాభరణప్రాప్తియు, గో, అశ్వ వాహన లాబము గురు సేవయు, ఇంటియందు కళ్యాణము, భార్యాపుత్ర సౌఖ్యము, ఇష్టాన్నభోజనము తప్పక కలుగును.

సం॥ర మధ్యమమందు కొంత ఒత్తిడి, శారీరక శ్రమ కలుగును. ధనమునకు ఇబ్బంది కలిగిననూ మొత్తం మీద అనుకూలముగా నుండును. కృషి మూలకముగా ధనలాభము బంధుసపత్తియు, క్రియవిక్రయ కౌశల్యము, విశేష సుఖమును క్షేత్రవృద్ధి, గో, పశు లాభము, ధనసంపత్తియు కలుగును.

ఇంటియందు వివాహోత్సవము, అపూర్వ వస్తు సంప్రాప్తియు, పుత్రలాభము నిశ్చయముగా కలుగును.సుగంధ చందనాదిలాభమును, గ్రామాధిపత్యము, పురాధిపత్యము కలుగును. శయ్యాసౌఖ్యము విదేశీవస్తు లాభము, అపూర్వ మిత్రుల కలయిక దూరదేశ ప్రయాణము కలిగి అచ్చట గౌరవ మర్యాదలు అవార్డులు, రివార్డులు సన్మాన సత్కారములు, అపూర్వవస్తు లాభము, ఆయాచిత ధనలాభము, మనోనిశ్చయము, సంకల్పమాత్రమునే కార్యలాభము తప్పక కలుగును.

విద్యార్థుల ప్రయత్నము లేకనే ర్యాంకులు సంపాదించగలరు. అవివాహితులకు శీఘ్రముగా వివాహములు జరుగగలవు. నిరుద్యోగులు అప్రయత్నంగా ఉద్యోగము సంపాదించగలరు. వ్యాపారులకు పట్టిందల్లా బంగారంవలెనుండును. అప్రయత్నముగా లాభములనార్జించగలరు. రైతులు రెండు పంటల యందు విశేష లాభములను పొందగలరు. ఆక్వా కల్చరుకు అత్యంత అనుకూలము, కార్మికులు సౌఖ్య ఆనందములను పొందగలరు.

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** అధికారుల దర్శనము, శుభకార్యాచరణ, సంతోషము, గృహలాబము, నానామూలకముగా ధనప్రాప్తియు, అప్రయత్న కార్యసిద్ధి, ఆరోగ్యము, కీర్తి, గౌరవము

**మే :** నూతన వస్తు, వాహన లాభము, శయ్యాధిలాభము, సౌఖ్యభోజనప్రాప్తియు, సంఘ గౌరవము, యత్నకార్యార్థసిద్ధియు, గో, అశ్వలాభము, ధనవృద్ధియు, నూతన విదేశీ వస్తు లాభము, క్షేత్రవృద్ధియు, దేహారోగ్యము, విద్యాభ్యాసాది సంగ్రహణము కలుగును.

**జూన్ :** బంధు పూజ్యతయు, సంఘ గౌరవము, నూతన ఉద్యోగ లాభము, రాజకీయ పదవీయోగము, స్వస్థానచలనము, మాతృపూజయు, నూతన దేవాలయ నిర్మాణాధికారము, యజ్ఞయాగాది కార్యక్రమలందు పాల్గొనుట, సంతోషము, వివాహాది శుభకార్యాచరణ

**జూలై :** వైద్యశాలాదర్శనము, స్థానచలనము, అధికారుల పీడ, సుఖభోజనప్రాప్తి, వస్త్రభూషణ లాబము, క్షీరాన్నభోజనప్రాప్తి, తీర్థస్నాన ఫలము,సౌఖ్యము, క్షీరాన్న భోజన ప్రాప్తి కలుగును.

**ఆగష్టు :** దూరదేశగమనము, దేహబాధ, మనోవిచారము, ధర్మకార్యచింతన, తటాకము, బావులు, చెరువులు నిర్మాణ ఫలప్రాప్తియు, దేవతా దర్శనము, సంతానప్రాప్తి, ఉద్యోగ లాభము, రత్నాభరణ సంప్రాప్తియు, అభివృద్ధి, ధనాదాయము కలుగును.

**సెప్టెంబర్ :** అత్యంత కీర్తి లాభము, సుఖము, విదేశీ వస్తు లాభము, రత్నాభరణ సంప్రాప్తి, భృత్యువర్గాభివృద్ధియు, వ్యవసాయ లాభము, క్షీరవృద్ధియు, సుఖము కలుగును.

**అక్టోబర్ :** శుభకార్యప్రాప్తి, వివాహ నిశ్చయం, కీర్తి, గౌరవం, ఉద్యోగ లాభము, భూగృహనిర్మాణాధికారము, మిత్ర సుఖము, శతృ నాశనము, జయము, నూతన పదవీయోగం, మిత్ర సుఖము, నూతన దేవాలయ ప్రతిష్ట కార్యక్రమ నిర్వహణ, విద్యాలాభం

**నవంబర్ :** క్షేత్రసంగ్రహము, కృషి లాభము, వస్త్రాభరణప్రాప్తియు, రత్న లాభము, అపూర్వ వస్తు సంగ్రహము, ప్రియవస్తు ప్రాప్తియు, అప్రయత్న కార్యసిద్ధి, గృహలాభము, విదేశీ వస్తు సంచయము, బంధుపూజ్యతయు, శతృనాశనము, అనుకూల వాతావరణం కలుగును.

**డిశంబర్ :** భార్యాపుత్ర సౌఖ్యము, ఇష్టసిద్ధియు, విశేష సుఖము, క్షేత్ర వృద్ధియు, వస్త్రభూషణ సంగ్రహము, తీర్థయాత్ర చరణ, దైవదర్శనము, ధనలాభము, రాజస్నేహము, అధికార ప్రాప్తియు, సత్కీర్తిలాభము, దేవతా పూజయు, వాహన లాభము కలుగును.

**జనవరి 2018 :** సర్వకార్యజయం, ఆరోగ్యం, గో లాభము, దైవదర్శనము, పుణ్యక్షేత్ర సందర్శనము, క్షేత్రవృద్ధి, నూతన వస్తు లాభము, విదేశీ వస్తు వాహన లాభము, అపూర్వ వస్తు లాభము, కీర్తి, గౌరవము, అపూర్వ మిత్ర కలయిక, సంతోషము, గ్రామాధిపత్యం

**ఫిబ్రవరి :** వాహన ప్రాప్తియు, పురాధిపత్యము, రాజదర్శనము, భూషణలాభము, అర్థలాభము, విశేష సౌఖ్యము, ఇంటియందు కళ్యాణాధి శుభకార్యప్రాప్తియు, గృహలాభము

**మార్చి :** ధనప్రాప్తియు, స్వస్థలవాసము, దేవపూజయు, స్త్రీ దేవతారాధనాసక్తియు, గృహలాభము, కీర్తిప్రతిష్టలు, మృష్టాన్నాభోజనము, గీతాశ్రవణవినోద లాభము

**గ్రహశాంతి :** ఈ సంవత్సరం రవి, కుజ, బుధ, శుక్ర గ్రహశాంతులు ఆచరించవలెను. నవగ్రహశాంతి క్రమం పరిశీలించండి.

**అదృష్ట సంఖ్య :** '8' 5,6 మిత్ర సంఖ్యలు. ప్రతినెలా 8,17,26 తేదీలు బుధ, శుక్ర, శనివారాలు కలిసిన మరింత శుభము.

**అదృష్టరత్నం :** ధనిష్ట-పగడం, శతభిషం-గోమేధికం, పూర్వాభాద్ర-పుష్యరాగం

**రుద్రాక్షధారణం:** సప్తముఖి, అష్టముఖి, షష్టదశముఖి, సప్తదశముఖి ధరించిన శుభం.

| | | |
|---|---|---|
| 3 4 | బు కు 2 | ర శు చం కే 1 12 |
| 5 | రాశి | 11 |
| రా 6 7 గు | 8 | శ 10 9 |

# మీనరాశి ఫలము



**పూ॥భా4, ఉ॥భా1,2,3,4, రేవతి 1,2,3,4**

**ఆదాయం : 11** **వ్యయం : 5**

**రాజపూజ్యం : 2** **అవమానం : 4**

| గ్రహం | నుండి | వరకు | రాశి | స్థానం | ఫలం |
|---|---|---|---|---|---|
| **గురుడు** | ఉగాది<br>12-9-2017 | 12-9-2017<br>17-3-2018 | కన్య<br>తుల | సప్తమం<br>అష్టమం | లాభం<br>ధనవ్యయం |
| **శని** | ఉగాది<br>20-6-2017<br>26-10-2017 | 20-6-2017<br>26-10-2017<br>17-03-2018 | ధనస్సు<br>వృశ్చికం<br>ధనస్సు | దశమం<br>నవమం<br>దశమం | వ్యతిరేకత<br>మిశ్రమం<br>వ్యతిరేకత |
| **రాహువు<br>కేతువు** | ఉగాది<br>18-8-2017 | 18-8-2017<br>17-3-2018 | సింహం/కుంభం<br>కర్కా/మకరం | షష్ఠం/వ్యయం<br>పంచమం/లాభం | సర్వకార్యజయం<br>ధనవృద్ధి |

మీనరాశి వారి ఈ గ్రహస్థితిని పరిశీలించగా సంవత్సరమంతయు శుభాశుభ మిశ్రమ కాలంగా గడుచును. అన్నికార్యములు ఆలస్యము మీద నెరవేరును. ధనము సమకూరును. వ్యతిరేకత వ్యక్తమగుచుండును. శత్రుపీడ, శత్రుభీతి ఉన్ననూ, వారు మిమ్ము ఏమీ చేయజాల కుందురు. మిత్ర సౌఖ్యము, భార్యాపుత్ర సౌఖ్యములుండును. దూరదేశ ప్రయాణములు, సంచారము కలుగుచుండును. అపూర్వమిత్ర దర్శనము కలుగును. భూ గృహ నిర్మాణాధికారములు ఆలస్యము మీద నెరవేరును. మానసిక, శారీరక ప్రశాంతత చేకూరును.

అనవసర దుర్వ్యయము కలుగును. శుభకార్యాచరణ నిమిత్తం ధనవ్యయం కలుగును. దైవదర్శనము, గురు దేవతా పూజయు, మంత్రసిద్ధి, నూతన దేవాలయ నిర్మాణాధికారము, నదీ తటాక స్నానఫలము, కృషి వాణిజ్య లాభము కలుగును. ఇంటియందు శుభకార్యాచరణ, వివాహాది శుభకార్యములు నెరవేరును. యజ్ఞ, యాగాదిక్రతువులందు పాల్గొందురు.

సంవత్సర మధ్యకాలమందు పరిస్థితులు కొంచెం ఇబ్బందికరంగా మారును. అనారోగ్యం బాధించును. ప్రారంభమయిన పనులు మెల్లగా నెరవేరును. ప్రయాణ విఘ్నములు, నీచసేవ, నీచసాంగత్యము, ప్రయాణములో మోసమునకు గురి అగుట, వాహనములు మొరాయించుట, వాహన ప్రమాదము జరుగుసూచనలున్నవి. అనంతరం సమస్యలు పరిష్కారమగును

విద్యార్థులకు సామాన్యఫలము కలుగును. అవివాహితులకు ఆలస్యముగా వివాహములు అగును. అతికష్టం మీద ఉద్యోగ సంపాదించగలరు. వ్యాపారులు లాభము ఆర్జించగలరు. రైతులకు రెండు పంటలయందు సామాన్య ఫలితము ఉండును. కార్మికులకు సామాన్యముగా గడచును. కవులు, కళాకారులకు స్వల్ప ఊరట కలుగును. రాజకీయ నాయకులకు నూతన పదవీయోగము ఆలస్యము మీద నెరవేరును.

గురుడు సం॥ర పూర్వార్థములో ఆరోగ్యము, రాజదర్శనము, శరీరపోషణ, ఇష్టకార్యసిద్ధి కలిగించును. ఉత్తరార్థమున దొంగల భయము, అగ్ని భయము, రాజ భయము, శరీరం సొంపు చెడుట, గాంభీర్యము, క్రూరోక్తులు, వచించుట, తెగువ, కోపము కలుగును. శని సంచారముచే వ్యాకులము దు:ఖము వలన పరితాపము, పాపకృత్యములు చేయుట, ఉద్యోగ విఘ్నము కలుగును. సం॥ర మధ్యమంబున శుభాశుభమిశ్రమఫలం కలుగును. రాహు సంచారముచే ధైర్యము, పరాక్రమము, శత్రు జయము, సుఖము, గో భూ లాభ ప్రాప్తియు కలుగును. కేతు సంచారముచే పుత్ర విరోధము, రాజుల వల్ల పూజింపబడుట, అకాల భోజనము, అందరకు పూజార్హుడుగానుండుటయు కలుగును.

# నెలవారీ ఫలితములు

**ఏప్రియల్ 2017 :** శుభాశుభమిశ్రమ ఫలం కలుగును. భాతృ నాశనము, వాణిజ్యములకు విఘాతము కలుగుట, అధికారులతో వాగ్వివాదము, ధనలాభమును, మిత్ర లాభము కలుగును.

**మే :** ఉద్యోగనాశనము, దూరదేశమునకు ట్రాన్స్‌ఫర్, అగమ్యాగమ్యము కోర్టు కేసులయందు వ్యతిరేకత శతృజయము, నూతనవస్తు సంచయము, బంధుదర్శనము, ఆరోగ్యము నూతన రాజకీయ పదవీయోగము, వాహన ప్రమాదము, వాహన నాశనము కలుగును.

**జూన్ :** అన్నింటా జయం, శతృజయము, ధైర్యము, సాహసము, భూ లాభము, అధికార ప్రాప్తియు, సత్కీర్తి లాభము, దేవతా పూజయు, వాహన లాభము, మనోవిలాసము, శ్రేష్టమైన ఆభరణ ప్రాప్తియు, మష్టాన్నభోజనము, బంధుపూజ్యతయు తప్పక కలుగును.

**జూలై :** ధనప్రాప్తియు, ఆరోగ్యము, స్త్రీ దేవతారాధన, భార్యాపుత్ర సౌఖ్యము, ప్రియ బంధుసుఖము, నూతన వస్త్ర భూషణ లాభము, విశేష సౌఖ్యము, ఆనందము

**ఆగష్టు :** సర్వకార్యజయం, ఆరోగ్యం, గో పశు లాభము, గోపూజ శ్రేష్టమైన రత్నాభరణ సంప్రాప్తి, క్షేత్ర వృద్ధి, నూతన వస్తు, వాహన సంచయము, అపూర్వ మిత్రుల కలయిక, మిత్ర లాభము, శతృ జయము, శతృవులు మిత్రులగుట, సంఘ గౌరవము

**సెప్టెంబర్ :** ధనవృద్ధి, ఆరోగ్యము, నూతన వస్తు లాభము, గృహనిర్మాణాధికారము, మిత్ర లాభము, గురుపూజ, దేవతారాధన, స్నేహశీలత, గో లాభము, బంధుసమాగమము, భార్యపుత్ర సౌఖ్యము, యత్నకార్యసిద్ధియు, యశస్సు, కళ్యాణధి శుభకార్యాచరణ కలుగును.

**అక్టోబర్ :** తేజోవృద్ధి, ఆరోగ్యము, కీర్తి, గౌరవము, నిత్య సంతోషము, గో, పశు లాభము, గో పూజ, దేవతారాధన, తటాక, నదీ స్నానఫలము, దూరదేశప్రయాణము, కార్యసాఫల్యత, శతృవులు మిత్రులగుట, మిత్ర వృద్ధి, పితృజనాభివృద్ధియు, ఆయాచిత ధనలాభము కలుగును.

**నవంబర్ :** మంత్రసిద్ధి, జ్యోతిష్య,జాతకాదివిచారము, నూతన వ్యాపారాభివృద్ధి, గృహ నిర్మాణాధికారము, ఉద్యోగలాభము, వస్త్రభరణ సంప్రాప్తియు, విద్యాభ్యాసాధి సంగ్రహము, శివదీక్షాధిచింతన, మహాత్ముల సందర్శనము, విదేశీ వస్తులాభము, విచిత్ర వస్త్రధారణ

**డిశంబర్ :** ఋణభయము, స్వల్ప అనారోగ్యము, ధనధాన్యానాశనము, జ్వరభయము, స్థానానాశనము, శస్త్రపీడయు, మనోవైకల్యము, వాహన ప్రమాదము, రాజభయము, తెగువ

**జనవరి 2018 :** కూరోక్తుల వచించుట, శరీరం సొంపు చెడుట, తేజో హాని, శరీరం రంగుమారుట, చోర భయము, విలువైన సామాగ్రి పోగొట్టుకొనుట, అగ్నిభయము

**ఫిబ్రవరి :** పాపకార్యచింతన, ఉద్యోగవిఘ్నము, స్థానానాశనము, శస్త్రపీడయు, భార్యాపుత్ర పీడయు, స్వల్ప అనారోగ్యము, శస్త్ర చికిత్సలు, ఔషద సేవనం అన్నింటా సమస్యలు, కుటుంబ కలహములు, శతృపీడ శుభకార్యములు వాయిదా పడుట జరుగును

**మార్చి :** వాహనప్రాప్తియు, పురాధిపత్యము, రాజదర్శనము, భూషణప్రాప్తియు, అర్థలాభము, విశేషసుఖము, ఇంటియందు వివాహాది శుభకార్యాచరణ, బంధుపూజ్యత, బంధులాభము

| | |
|---|---|
| **గ్రహశాంతి** | : ఈ సంవత్సరం రవి, చంద్ర, గురు, శని, గ్రహశాంతులు ఆచరించవలెను నవగ్రహశాంతి క్రమం పరిశీలించండి. |
| **అదృష్ట సంఖ్య** | : '3' 1,2,4,7,9 మిత్ర సంఖ్యలు. ప్రతినెలా 3,12,21,30 తేదీలు ఆది, సోమ, గురువారములు కలిసిన మరింత శుభము. |
| **అదృష్టరత్నం** | : పూర్వాభాద్ర-పుష్యరాగం,ఉత్తరాభాద్ర-నీలం,రేవతి-పచ్చ |
| **రుద్రాక్షధారణం** | : త్రిముఖి, సప్తముఖి, ద్వాదశముఖి, షష్టదశముఖి శుభము. |



# శ్రీ గాయిత్రి విశ్వకర్మ వాస్తు ప్రకాశిక



## గృహవాస్తు
## ముఖ్య విషయములు

గృహవాస్తులో సింహద్వార నిర్ణయము ముఖ్యము భార్యా భర్త లిర్వురికి స్వ,మిత్ర వర్గక్షేత్రములందు స్వ,మిత్ర ఆయములను నిర్ణయించుకొని, నవ వర్గ శుద్ధమైన గణితము కలిగిన కొలతలతో (సెం/సెం) గృహము నిర్మించుకోవలయును.

సింహద్వారం ఏదయిననూ నైఋతిలో యజమాని పడకగది. ఆగ్నేయములో వంటగది పడమర, లేదా దక్షిణాలలో భోజనాల గది. వాయవ్యంలో పిల్లల గది, ఈశాన్యంలో పూజ గది. హాలు ఏర్పరచుకొవలయును. **ప్రకృతిలో ప్రతి స్థానమునకు ఎదురుగా ఉన్న స్థానం ($180^0$ నందు) శతృస్థానంగా పరిగణించబడుచున్నది.** అష్ట దిక్పాలకులకు నవగ్రహములకు తమస్వస్థానములు, ఉచ్ఛస్థానములకు ఎదురుగా ఉన్నస్థానం, శతృస్థానం నీచస్థానంగా పరిగణించబడుచున్నది.




పై చక్రమును పరిశీలించినచో ప్రాచీన వాస్తు విషయములు బోధపడగలవు. ఈ మధ్య వాయువ్యంలో వంట గదులు నిర్మించుచున్నారు. ఇది పూర్తిగా వాస్తు విరుద్ధం ఆగ్నేయమునకు వాయవ్యం శతృస్థానం అగ్నిని వాయవ్యంలో శతృస్థానంలో ఉంచరాదు. ఇంకా విపులముగా తెలియుటకు **"విశ్వకర్మ"** దిక్కులను జంతువులలో పోల్చినాడు. ఆగ్నేయంలో 'పిల్లి' ఉంటుంది. వాయవ్యంలో 'ఎలుక' ఉంటుంది. వీటికి శతృత్వం కలదన్న విషయం విశదమే కదా! మరి అగ్నిని వాయవ్యంలో ఎట్లా ఏర్పాటు చేస్తారు? ఇదే విధముగా అన్ని దిక్కులకు వర్తించును. **ఈ విషయాలపై మరింత విపులమైన చర్చ కొరకు మమ్ము స్వయముగా సంప్రదించండి.**

గృహవాస్తులో అత్యంత ముఖ్యమైనవి. గృహగణితం. నవ వర్గ శుద్ధంగా గణితం ఏర్పరచి నిర్మించిన గృహం సర్వదా శుభములను చేకూర్చగలదు. కాని ఈ మధ్య నూతన నిర్మాణములలో ఈ గణితమునకు ప్రాధాన్యత ఇచ్చుటలేదు. ఇంజినీరింగ్ ప్లాన్ వేసుకున్ననూ గణితం తప్పనిసరిగా అనుసరించవలెను.

తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణ సింహద్వారములకు యజమానికి తగిన సర్వాయ గణితములను ఎన్నుకొని గృహము నిర్మించ వలసియున్నది. 'విశ్వకర్మ' చే అనుగ్రహించబడిన సంపూర్ణ నవవర్ణశుద్ధ సర్వాయ గణితములకు **మమ్ము స్వయముగా సంప్రదించవచ్చును.**

గృహ నిర్మాణములో మరో ముఖ్య అంశం ముహూర్తం. ముహూర్త బలం కలిగి ఉంటే ఆ ఇంట నివశించే వారు ఎల్లప్పుడు ధన, ధాన్యములతో తులతూగగలరు. సంవత్సరమంతా అన్ని సింహద్వారములు నిర్మించుటకు ముహూర్తములుండవు. తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం సింహద్వారములకు 6 నెలలు మాత్రమే ముహూర్తము లుండును. అవి గమనించి గృహనిర్మాణం చేపట్టవలసి యున్నది.

వాస్తులో 'నవమి' తిథి అత్యంత కష్టనష్టములు ఇచ్చునది. కావున ఈ విషయం గమనించవలెను. నవమి తిథిలో సైతం గృహారంభ ప్రవేశములు చేయుట గమనించి యున్నాము. నిషిద్ధ **త్రివిధ 'నవమి' త్రయం** గమనించవలెను.

## నవ వర్గు గణిత క్రమము

నిర్ణయించుకొన్న స్థలంలో మనకు అనుకూలమైన ప్లాన్ నిర్ణయించుకోవాలి. ప్లాన్ పొడవు, వెడల్పుల కొలతలను చదరపు గజాలలో నిర్ణయిస్తారు. ఈ చదరపు గజాలనే 'పదం' (పిండం) అని వాస్తుశాస్త్రంలో వ్యవహరిస్తారు. ఈ పదం ఎంత ఉండాలి అనే విషయంపై ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు నిర్ధిష్టమైన గణితాన్ని రూపకల్పన చేశారు. ఈ వాస్తు గణితంలో నవ వర్గు గణిత, ప్రాచుర్యాన్ని పొందింది. ఈ గణిత విధానంలో '9' అంశాలు నిబిడీకృతం అయిఉంటాయి. అందుకే ఇది నవవర్గు అయినది. **అవి**

**1. ధనం 2. ఋణం 3. తిథి 4. వారం 5. నక్షత్రం 6. ఆయం 7. ఆయుర్దాయం 8. అంశ 9. దిక్కృతి**

ఈ 9 అంశాలను పదాన్ని అనుసరించి గణితం చేయవలసి ఉంటుంది. ఈ తొమ్మిది అంశాలు శుభకరంగా ఉన్న పదం శుభకరమైనదిగా పరిగణిస్తారు.

పద నిర్ణయం : పొడవు × వెడల్పు / 9 = పదం (చదరపు గజాలు)

కట్టదలచుకున్న ఇంటి పొడవు వెడల్పులను (సెం/సెం) అడుగులలో గుణించి వచ్చిన దానిని 9 తో భాగించగా వచ్చిన భాగపలాన్ని పదం అంటారు. ఇది పూర్ణాంకంగా (లేదా) భిన్నాకంగా ఉండవచ్చు. ఇలా వచ్చిన పదసంఖ్యను ఈ క్రింది విధంగా గణించగా వచ్చిన శేషసంఖ్యలతో వర్గులు ఏర్పడతాయి. పదం (చదరపు గజాలలో ఉంటుంది)

| | | |
|---|---|---|
| 1. ధనం | = పదం × 8 / 12 | = శేషం ధనం |
| 2. ఋణం | = పదం × 3 / 8 | = శేషం ఋణం |
| 3. తిథి | = పదం × 6 / 30 | = శేషం తిథి |
| 4. వారం | = పదం × 9 / 7 | = శేషం వారం |
| 5. నక్షత్రం | = పదం × 8 / 27 | = శేషం నక్షత్రం |
| 6. ఆయం | = పదం × 9 / 8 | = శేషం ఆయం |
| 7. ఆయుర్దాయం | = పదం × 9 /120 | = శేషం ఆయుర్దాయం |
| 8. అంశ | = పదం × 6 / 9 | = శేషం అంశ |
| 9. దిక్కృతి | = పదం × 9 / 8 | = శేషం దిక్కృతి |

# గణిత ఫల నిర్ధారణ

1. ధనం : మొత్తం ధనాలు '12' ఋణంలో వచ్చిన శేషం కన్నా ఎక్కువ ఉండాలి.
2. ఋణం : మొత్తం ఋణాలు '8' ధనంలో వచ్చిన శేషం కన్నా తక్కువ ఉండాలి.
3. తిధి : మొత్తం తిధులు '30' శేషం 1,4,9,19,24,,29,30 తిధులు అశుభం మిగిలినవి శుభం.
4. వారం : మొత్తం వారాలు '7' (1 ఆది,2 సోమ,3 మంగళ,4 బుధ,5 గురు,6 శుక్ర, 7శని) 3మంగళవారం నిషిద్ధం 1,7 వారాలు మధ్యమం. 2,4,5,6 శుభం
5. నక్షత్రం : మొత్తం నక్షత్రాలు 27 (అశ్వని నుండి రేవతి వరకు) ఇందులో వచ్చిన నక్షత్రం యజమానులకు తారాబలం కలిగి ఉండాలి.
6. ఆయం : మొత్తం ఆయాలు '8' ఇందులో 2,4,6,8 అశుభ ఫలితాలనిస్తాయి. 1,3,5,7 శుభ ఫలితాలనిస్తాయి. సింహద్వారం అనుసరించి తూర్పు 3,5,7 పడమర 1,3,7 ఉత్తరం 1,3,5 దక్షిణం 1,5,7 లుగా నిర్ణయించుకోవాలి.
7. ఆయుర్ధాయం : మొత్తం 120 సం॥లు ఆయుర్ధాయంలో కనీసం '60'సం॥లు పైన ఉండవలెను.
8. అంశ : మొత్తం అంశలు '9' ఇందులో 1 నష్టాంశ 4 మృతాంశ, 5 దహనాంశ, 6 చోరాంశ కాకుండా 2,3,7,8,9 సంఖ్యలు శుభ ఫలితాలనిస్తాయి.
9. దిక్కృతి : దిక్పాలకులు 8 మంది. ఇందులో 2,4,6,8 రాకుండా 1,3,5,7 వచ్చేటట్లు ఉండాలి. (ఆయంలో వచ్చిన సంఖ్యలే వస్తాయి గనుక ప్రత్యేకంగా గణితం అవసరం లేదు)

ఈ విధంగా గణితంలో ఉన్న 9 అంశాలు శుభకరంగా ఉండేలా పదాన్ని (చ॥గజాలు) గణితం చేసి దాన్ని మనకు కావలసిన పొడవు, వెడల్పులుగా విభాగించుకొని నిర్మాణం సాగించాలి.

ఈ మధ్య వాస్తు సిద్ధాంతులు వేస్తున్న ప్లానులలో ఈ గణితం ఏ మాత్రం సరిపోవుట లేదు. సిద్ధాంతి తప్పనిసరిగా గణితంలో ప్రావీణ్యత కలిగి ఉండాలి. అప్పుడే యజమాని సుఖ సంతోషాలతో జీవిస్తాడు. వాస్తు ప్రతీసారి మార్పు చేర్పులకు గురికాదు స్థిరంగా ఉంటుంది. గ్రహజాతక ఫలితాలలో ఎప్పుడూ స్థిరంగా ఉండవు. వాటిపై మన అదుపు కూడా లేదు. కనుక మన చేతుల్లో ఉన్న వాస్తు గణితం, వాస్తు నిర్ణయాలను సరిగ్గా చేసుకుంటే జీవితంలో గ్రహస్థితులు ఎలా ఉన్నప్పటికి ఇంటిలో సుఖ సంతోషాలతో జీవించవచ్చు. యజమానులు, సిద్ధాంతులు ఇది గమనించి వాస్తు గణితం ఖచ్చితంగా నిర్ణయించుకోవాలి.

తూర్పు సింహద్వారానికి ధ్వజాయం,పడమర సింహద్వారానికి వృషభాయం, ఉత్తర సింహద్వారానికి గజాయం,దక్షిణ సింహద్వారానికి సింహాయం నిర్మించరాదు ఇవి పరస్పరము శతృత్వము కలిగి ఉంటాయి.

**ద్వార నిర్ణయం** తూర్పు,పడమర సింహద్వార గృహాలకు దక్షిణ గుమ్మం–ఉత్తర,దక్షిణ సింహద్వార గృహాలకు పడమర గుమ్మం లేకుండా గృహనిర్మాణం చేయడం అత్యంత శ్రేయస్కరం.

# ఉదాహరణ నవవర్గు శుద్ధ గణితాలు

| | తూర్పు సింహద్వారం | | పడమర సింహద్వారం | | ఉత్తర సింహద్వారం | | దక్షిణ సింహద్వారం | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. పదం | 49.4 | 93 | 50.7 | 79.2 | 49.125 | 88.3 | 47.8 | 87 |
| 2. చ॥అ॥ | 445 | 837 | 457 | 713 | 442.125 | 795 | 431 | 783 |
| 3. పొడవు | 22'3" | 31' | 22' | 31 | 22'1$\frac{1}{4}$ | 31'9$\frac{1}{2}$ | 21'6" | 32'7$\frac{1}{2}$ |
| 4. వెడల్పు | 20' | 27' | 20'9$\frac{1}{4}$ | 23 | 20 | 25 | 20'$\frac{1}{2}$ | 24 |
| 5. ధనం | 12 | 12 | 11 | 10 | 9 | 11 | 12 | 12 |
| 6. ఋణం | 5 | 7 | 1 | 6 | 4 | 2 | 8 | 5 |
| 7. తిథి | 27 | 18 | 5 | 26 | 25 | 21 | 18 | 12 |
| 8. వారం | 4 | 4 | 2 | 6 | 2 | 4 | 4 | 6 |
| 9. నక్షత్రం | 18 | 15 | 2 | 13 | 15 | 5 | 6 | 12 |
| 10. ఆయం | 5 | 5 | 1 | 1 | 3 | 3 | 7 | 7 |
| 11. ఆయు | 85 | 117 | 97 | 113 | 83 | 75 | 71 | 62 |
| 12. అంశ | 9 | 9 | 8 | 8 | 7 | 9 | 9 | 9 |
| 13. దిక్కృతి | 5 | 5 | 1 | 1 | 3 | 3 | 7 | 7 |

పైన ఇచ్చిన గణితాలు అన్నీ నవ వర్గు శుద్ధమైనవే. ఈ విధంగా గణితాన్ని మీరే స్వయముగా నిర్ధారించుకోవచ్చును. నవవర్గు శుద్ధ గణితములకొరకు మమ్ము స్వయముగా సంప్రదించండి. సుఖ సౌఖ్యాలతో జీవించండి.

## వాస్తులో అనుసరించాల్సిన ముఖ్య విషయాలు

గణితం నిర్ణయం తరువాత ప్లాను ఈ క్రింది ప్రాథమిక అంశాల ఆధారంగా సిద్ధం చేసుకోవాలి

| అంశం / దిక్కు | యజమాని గది | పిల్లల గది | పూజ గది | వంట గది | భోజన శాల | హాలు | బాత్ రూమ్ | స్టోర్ రూమ్ | మెట్లు | పంపు | ప్రహారి గేటు | సెప్టిక్ ట్యాంకు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 తూర్పు | ✗ | ✓ | ✓ | ✓ | ✓ | ✓ | ✗ | ✗ | ✗ | ✓ | ✓ | ✗ |
| 2 ఆగ్నేయం | ✗ | ✓ | ✓ | ✓ | ✗ | ✗ | ✓ | ✗ | ✓ | ✗ | దక్షిణ ఆగ్నేయం | ✓ |
| 3 దక్షిణం | ✓ | ✗ | ✗ | ✓ | ✓ | ✗ | ✓ | ✓ | ✗ | ✗ | ✓ | ✗ |
| 4 నైఋతి | ✓ | ✗ | ✗ | ✓ | ✗ | ✗ | ✓ | ✓ | ✓ | ✗ | ✗ | ✗ |
| 5 పడమర | ✓ | ✗ | ✗ | ✗ | ✓ | ✓ | ✓ | ✓ | ✗ | ✗ | ✓ | ✗ |
| 6 వాయువ్యం | ✗ | ✓ | ✗ | ✗ | ✗ | ✓ | ✓ | ✓ | ✗ | ✗ | పడమర వాయువ్యం | ✓ |
| 7 ఉత్తరం | ✗ | ✓ | ✓ | ✓ | ✓ | ✓ | ✗ | ✗ | ✗ | ✓ | ✓ | ✗ |
| 8ఈశాన్యం | ✗ | ✗ | ✓ | ✓ | ✗ | ✓ | ✗ | ✗ | ✗ | ✓ | ✓ | ✗ |

**అనుభవజ్ఞులైన గణిత వేత్తలయిన సిద్ధాంతుల పర్యవేక్షణలో గృహనిర్మాణం చేయడం సర్వదా శ్రేయోదాయకం.**

# నామము (పేరు) ననుసరించి సింహద్వార నిర్ణయ చక్రము

| పేరులోని మొదటి అక్షరం | వర్గం | దిక్కు | సరిపోవు సింహద్వారం | సరిపడని సింహద్వారం | సరిపోయే ఆయం | సరిపడని ఆయం |
|---|---|---|---|---|---|---|
| 1. అ నుండి అః వరకు | అ | తూర్పు | పడమర, ఉత్తరం, దక్షిణం | తూర్పు | ధ్వజ, గజ,సింహాయములు | వృషభాయం |
| 2. క,ఖ,గ,ఘ,ఙ | క | ఆగ్నేయం | పడమర, ఉత్తరం, దక్షిణం | తూర్పు | ధ్వజ, గజ,సింహాయములు | వృషభాయం |
| 3. చ,ఛ,జ,ఝ,ఞ | చ | దక్షిణం | ఉత్తరం, తూర్పు, పడమర | దక్షిణం | సింహ,వృషభ, ధ్వజాయములు | గజాయం |
| 4. ట,ఠ,డ,ఢ,ణ | ట | నైఋతి | ఉత్తరం, తూర్పు, పడమర | దక్షిణం | సింహ,వృషభ, ధ్వజాయములు | గజాయం |
| 5. త,థ,ద,ధ,న | త | పడమర | తూర్పు, ఉత్తరం, దక్షిణం | పడమర | వృషభ, గజ, సింహాయములు | ధ్వజాయం |
| 6. ప,ఫ,బ,భ,మ | ప | వాయువ్యం | తూర్పు, ఉత్తరం, దక్షిణం | పడమర | వృషభ, గజ, సింహాయములు | ధ్వజాయం |
| 7. య,ర,ల,వ | య | ఉత్తరం | దక్షిణం, తూర్పు, పడమర | ఉత్తరం | గజ,ధ్వజ, వృషభాయములు | సింహాయం |
| 8. శ,ష,స,హ | శ | ఈశాన్యం | దక్షిణం, తూర్పు, పడమర | ఉత్తరం | గజ,ధ్వజ, వృషభాయములు | సింహాయం |

1. తూర్పు, సింహద్వారం : (వృషభాయం) - ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ట, ఆషాడ, శ్రావణ మాసములందు నిర్మించాలి.
2. పడమర సింహద్వారం : (ధ్వజాయం) - భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక, మార్గశిర, పుష్య, మాఘ మాసములందు నిర్మించాలి.
3. దక్షిణ సింహద్వారం : (గజాయం) - జ్యేష్ట, ఆషాడ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసములందు నిర్మించాలి.
4. ఉత్తర సింహద్వారం : (సింహాయం) - మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములందు నిర్మించాలి.

# ప్రయాణ విషయమై ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | యోగములు |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వ | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉ.షా | శత | ఆనంద-కార్యజయం |
| భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూ.భా | కాలదండ-మృత్యుంజయం |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | దూమ్ర-కార్యభంగం |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | ధాత్రి-కార్యజయం |
| మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వ | సౌమ్య-సర్వసౌఖ్యం |
| ఆరు | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూ.భా | భర | ధ్వాంక్ష-ధననష్టం |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | ధ్వజ-కార్యజయం |
| పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | శ్రీవత్స-ధనలాభం |
| ఆశ్లే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వ | మృగ | వజ్ర-ఫలప్రాప్తి |
| మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూ.భా | భర | ఆరు | మద్గద-కలహం |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | ఛత్ర - స్త్రీలాభం |
| ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర-సన్మిత్రలాభం |
| హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | మానస-కార్యలాభం |
| చిత్త | జ్యేష్ట | అభి | పూ.భా | భర | ఆరు | మఖ | పద్మ-ఐశ్వర్యప్రాప్తి |
| స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | లంబన-చికాకులు |
| విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ఉత్పాత - కష్టములు |
| అనూ | ఉ.షా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్త | మృత్యు-మృత్యుభయం |
| జ్యేష్ట | అభి | పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | కాల-అవమానం |
| మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధి-ధనప్రాప్తి |
| పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | శుభ - కార్యజయం |
| ఉ.షా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్త | అనూ | అమృత-కార్యప్రాప్తి |
| అభి | పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ట | ముసల-దు:ఖం |
| శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదా-చెరువు కల్గును |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | మాతంగ-అశ్వలాభం |
| శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉ.షా | రాక్షస-మిత్ర కలహం |
| పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | చర-దుర్వార్తలు వినుట |
| ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థిర-శుభాశుభ మిశ్రమం |
| రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | వర్తమాన-శివదర్శనం |

# అమృతాది యోగములు

| నక్షత్రములు | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | అమృ | అమృ | సిద్ధ |
| భరణి | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| కృత్తిక | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ |
| రోహిణి | సిద్ధ | అమృ | అమృ | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ |
| మృగశిర | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ |
| ఆరుద్ర | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | సిద్ధ |
| పునర్వసు | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ |
| పుష్యమి | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ |
| ఆశ్రేష | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | మృత్యు |
| మఖ | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | అమృ | అమృ | అమృ |
| పూ. ఫల్గుణి | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| ఉ. ఫల్గుణి | అమృ | సిద్ధ | అమృ | అమృ | మృత్యు | సిద్ధ | మృత్యు |
| హస్త | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు |
| చిత్త | సిద్ధ | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| స్వాతి | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | అమృ |
| విశాఖ | మృత్యు | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| అనూరాధ | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| జ్యేష్ట | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | ప్రబ | మృత్యు | సిద్ధ |
| మూల | అమృ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ | సిద్ధ |
| పూ. షాఢ | సిద్ధ | ప్రబ | సిద్ధ | అమృ | సిద్ధ | ప్రబ | సిద్ధ |
| ఉ. షాఢ | అమృ | మృత్యు | ప్రబ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శ్రవణం | అమృ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ |
| ధనిష్ట | మృత్యు | సిద్ధ | సిద్ధ | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శతభిషం | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ |
| పూ. భాద్ర | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| ఉ. భాద్ర | అమృ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| రేవతి | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | ప్రబ |

అమృ - అమృతయోగము

సిద్ధ - సిద్ధయోగము

ప్రబ - ప్రబలారిష్టము

మృత్యు - మృత్యుయోగము

# ప్రయాణమునకు శుభ సమయములు

**శుభ తారలు :** అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ట, రేవతి నక్షత్రములు శ్రేష్టములు. రోహిణి, ఉత్తర, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, శతభిషం, మధ్యమములు, తక్కిన తారలు నిషిద్ధములు. మంచి నక్షత్రము లందు వారశూలలు, ఆనందాదియోగములూ చూసుకొని ప్రయాణించవలెను. ఉభయ పక్షములందలి 2, 3, 5, 7, 10, 11, 13 తిధులు మరియు కృష్ణ 1 మంచివి.

**శుభవారములు :** తూర్పునకు మంగళవారం, దక్షిణమునకు సోమ, శనివారములు, పడమరకు బుధ, గురువారములు, ఉత్తరమునకు ఆది, శుక్రవారములు మంచివి.

## ప్రయాణమునకు కూడని తిథి వార శూలలు

| దిక్కు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు |
|---|---|---|---|---|
| తూర్పు | 1-9 | శని-సోమ | జ్యేష్ట - ధనిష్ట | తుల-కుంభం |
| ఆగ్నేయం | 3-11 | శని-గురు | ...... | మకరం |
| దక్షిణం | 5-13 | గురు | శ్రవణం - అశ్వని | మీనం-వృశ్చికం |
| నైఋతి | 4-12 | సోమ-శుక్ర | ...... | కర్కాటకం |
| పడమర | 6-14 | ఆది-శుక్ర | రోహిణి - పుష్యమి | ధనుస్సు-సింహం |
| వాయవ్యం | 7-15 | ఆది-మంగళ | ...... | మేషం |
| ఉత్తరం | 2-10 | బుధ-మంగళ | పుబ్బ - హస్త | కన్య, వృషభం |
| ఈశాన్యం | 8-30 | బుధ | ...... | మిధునం |

పై చక్రమందు చెప్పబడిన శూలలో ప్రయాణము చేయరాదు. మరియు ఏకాదశి సోమవారం, ద్వాదశి శనివారం, షష్టి గురువారం, తదియ బుధవారం, అష్టమి శుక్రవారం, నవమి ఆదివారం, పంచమి మంగళవారం, ఇవి దగ్ధయోగములు. కావున ఆ రోజులలో అస్సలు ప్రయాణము చేయరాదు.

## కొత్తకాపురం

ఆడపిల్లను క్రొత్తగా కాపురమునకు పంపుటకు ఆది, మంగళ,శుక్రవారములు పనికిరావు.

**పునర్వసు నక్షత్రము దోష భూయిష్టము.**

## నిర్హ్న విషయము

నిషిద్ధ కాలములందు తప్పనిసరి ప్రయాణమైనచో ఆదివారం బంగారమును, సోమ-వస్త్రం, మంగళ-ఆయుధం, బుధ-పుస్తకం, గురు-గొడుగు-టోపీ-తలపాగాలలో ఒకటి. శుక్ర-చెప్పులు లేదా వాహనం, శని-కంఠమున ధరించు వస్తువును-ప్రయాణ మార్గమందలి యెవరి యింటనైనా నిర్హ్నముంచుకొని అవసరవేళ శుభ శకునమున ప్రయాణమై వెళ్ళవచ్చును.

# భార్గవ సిద్ధాంత పంచాంగము

**ప్రతీరోజూ సూర్యోదయం నుండి 24 ని॥ల చొప్పున ఫలితము చూడాలి.**
**తిథి, వార, నక్షత్రములు చూడనవసరం లేదు. దీనిని అనుసరించుట శ్రేయోదాయకం.**

| గం॥ని॥ | గం॥ని॥ | ఆదివారం | సోమవారం | మంగళవారం | బుధవారం | గురువారం | శుక్రవారం | శనివారం |
|---|---|---|---|---|---|---|---|---|
| 6-00 | 6-24 | లాభం | వివాదం | ధనలాభం | దుర్వార్త | ధనలాభం | కార్యజయం | కష్టం |
| 6-24 | 6-48 | ధనలాభం | లాభం | సుఖం | మనోవ్యధ | కలహం | మిత్రలాభం | సుఖం |
| 6-48 | 7-12 | కలహం | క్షేమం | భయం | ధనలాభం | భయం | ధనలాభం | విరోధం |
| 7-12 | 7-36 | అనారోగ్యం | ధనలాభం | కష్టములు | కార్యజయం | శుభం | శుభం | ధనలాభం |
| 7-36 | 8-00 | చోరభయం | భూలాభం | జయం | భయం | కార్యసిద్ధి | విరోధం | జయం |
| 8-00 | 8-24 | శతృవృద్ధి | ధననష్టం | సుఖం | సుఖం | కార్యజయం | జయం | కార్యజయం |
| 8-24 | 8-48 | కార్యసిద్ధి | కార్యసిద్ధి | సుఖం | సుఖం | ధనలాభం | హాని | కార్యలాభం |
| 8-48 | 9-12 | సుఖం | వస్తుప్రాప్తి | భయం | భీతి | లాభం | స్నేహం | సన్మానం |
| 9-12 | 9-36 | క్షేమం | ఇష్టసిద్ధి | విరోధం | ధనలాభం | కలహం | అశుభం | కార్యహాని |
| 9-36 | 10-00 | మిత్రవృద్ధి | సుఖం | మనోభయం | మిశ్రమఫలం | కార్యజయం | మిశ్రమఫలం | అనారోగ్యం |
| 10-00 | 10-24 | కార్యభంగం | స్త్రీలాభం | సుఖం | కార్యసిద్ధి | వృత్తిలాభం | సౌఖ్యం | సౌఖ్యం |
| 10-24 | 10-48 | సుఖం | కార్యసాధన | కార్యహాని | మిశ్రమఫలం | శుభం | ధనలాభం | సంతాపం |
| 10-48 | 11-12 | జయం | కార్యహాని | మిశ్రమఫలం | శుభం | ధనలాభం | క్షేమం | భయం |
| 11-12 | 11-36 | కార్యసిద్ధి | వివాదం | భయం | లాభం | ఆరోగ్యం | కార్యసిద్ధి | మిత్రప్రాప్తి |
| 11-36 | 12-00 | కలహం | కార్యసిద్ధి | కష్టము | శుభం | నష్టం | వాహనభీతి | జయం |
| 12-00 | 12-24 | ఇష్టసిద్ధి | ఇష్టలాభం | రోగపీడ | సౌఖ్యం | పనినష్టం | సుఖం | ధనలాభం |
| 12-24 | 12-48 | కార్యహాని | ధనలాభం | లాభం | ఫలసిద్ధి | విరోధం | భయం | శుభం |
| 12-48 | 1-12 | జయం | కార్యజయం | కార్యసిద్ధి | క్షేమం | కార్యసిద్ధి | శుభం | మిశ్రమఫలం |
| 1-12 | 1-36 | ఇష్టసిద్ధి | శుభం | కార్యహాని | మిశ్రమఫలం | బంధనము | సుఖహాని | కార్యసిద్ధి |
| 1-36 | 2-00 | సంతాపం | మిశ్రమఫలం | ఉద్యోగలాభం | వివాదం | హాని | ధనవ్యయం | కార్యజయం |
| 2-00 | 2-24 | ధనవ్యయం | సుఖం | వ్యర్థం | ఇష్టసిద్ధి | కలహం | కార్యజయం | జయం |
| 2-24 | 2-48 | విరోధం | మనస్తాపం | కార్యహాని | లాభం | జయం | సౌఖ్యం | మిశ్రమఫలం |
| 2-48 | 3-12 | ధనలాభం | కార్యసిద్ధి | అపజయం | ఉద్యోగలాభం | కార్యభంగం | భయం | విరోధం |
| 3-12 | 3-36 | శతృవృద్ధి | ప్రయాణం | శతృజయం | విజయం | అశుభం | కార్యహాని | రోగపీడ |
| 3-36 | 4-00 | కలహం | ధనలాభం | ధనవ్యయం | అభీష్టసిద్ధి | స్నేహం | నష్టం | మనస్తాపం |
| 4-00 | 4-24 | రోగం | విద్యాలాభం | సుఖం | శుభం | అధికజయం | అపవాదులు | లాభం |
| 4-24 | 4-48 | ధనలాభం | కార్యనష్టం | కార్యలాభం | క్షేమం | కలహం | భయం | కార్యసిద్ధి |
| 4-48 | 5-12 | కార్యసిద్ధి | గౌరవం | క్షేమం | జయం | మనోభీతి | పనినష్టం | లాభం |
| 5-12 | 5-36 | నష్టము | శుభం | కార్యసిద్ధి | ఉద్యోగలాభం | జయం | కార్యజయం | సుఖం |
| 5-36 | 6-00 | భూలాభం | అధికారలాభం | సౌఖ్యం | అశుభం | కార్యసిద్ధి | ధనలాభం | జయం |

## శాంతి నక్షత్రములు

అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, ఆశ్రేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూ.షాడ, పూ.భాద్ర, రేవతి. ఈ 18 శాంతి తారలు. వీనిలో జ్యేష్టమూల మిక్కిలి దోషతారలు. జ్యేష్ట చివరి 4 ఘ॥లు మూల ప్రారంభమందలి 4 ఘడియలు అత్యంత దోషము, పుష్యమి 2పాదం కన్యాలగ్నం. ఉత్తర 1 పాదం సింహలగ్నమందు పగలు పుత్రజననం తండ్రికి రాత్రి బాలాకాజననం తల్లికి గండము. మరియు బహుళ చతుర్థశి అమావాస్య, సంధ్యాకాలం, గ్రహణ సమయం. తిథి నక్షత్ర సంధి సమయములు వర్జ్యదుర్ముహూర్తములందు తల్లి తండ్రీ సోదరులు – వీరి నక్షత్రములందు జననమైన మిక్కిలి దోషము. తప్పక శాంతులు జరపవలెను.

## నవవిధ శాంతులు

దుష్టనక్షత్రములందు స్త్రీలు రజస్వలలైనప్పుడు, గండనక్షత్రములలో శిశుజననమైనప్పుడు జరపవలసిన శాంతి 9 విధములు.

**1. తైలావలోకనం :** కంచు లేదా మట్టిపాత్రలో తగినంత మంచినూనె పోసి అందులో పగడం–ముత్యం వుంచాలి. ఒకచోట ఉప్పు గుట్టగాపోసి – దానిపై ఈ పాత్రను ఉంచి పూజించాలి. తదనంతరం – ఆ తైలంలో శిశువు ముఖం చూడాలి

**2. రుద్రాభిషేకం :** నక్షత్రం యొక్క దోషబలాన్ని బట్టి శక్తివంచన లేకుండా ముగ్గురు గాని – అయిదుగురు గాని, 11మందిగాని రుద్రన్యాస యుక్తముగా 11 పర్యాయాలు శివాభిషేకము, పూజ చేయించాలి. తదుపరి ఆ బ్రాహ్మణులను భోజన, తాంబూల, దక్షిణలచే సంతోషింపచేసి వారి ఆశీస్సులను పొందవలెను.

**3. సూర్యనమస్కారములు :** ఒంటికాలిపై నిలిచి – అరుణ మంత్రమును 108 పర్యాయములు జపించుచూ చేయు క్రియకు సూర్య నమస్కారమని పేరు. దీనికి ఒకరు గాని ముగ్గురు గాని, 5గురు గాని బ్రాహ్మణులను నియుక్తపరచవలెను.

**4. మృత్యుంజయ జపము :** దీనినే అపమృత్యుహరం అంటారు. యధాశక్తి బ్రాహ్మణులను నియమించి–లక్షసార్లు మృత్యుంజయ మంత్రజపం చేయించటం సాంప్రదాయం. తద్వారా అన్ని విధములైన అపమృత్యుదోషాలు తొలగిపోతాయి.

**5. నక్షత్రజపం :** 27గురు బ్రాహ్మణులను నియమించి – ఒక్కొక్క నక్షత్రమునకు 108 నుండి 1008 పర్యాయములు శాంతి మంత్రము జపింప చేయవలెను.

**6. నవగ్రహ జపం :** నవగ్రహములకు 9మంది విప్రులచే ఆయా శాంతి మంత్రములను జపింపచేయవలెను.

**7. హోమము :** నవగ్రహముల పేరిట తగు హోమము (అగ్ని పూర్వకంగా) చేయింపవలెను.

**8. సువాసినీ పూజ :** శక్తిననుసరించి, తగినంత మంది ముత్తైదువులకు భోజన తాంబూలాదు లిచ్చి, పువ్వులు పండ్లను సమర్పించి, నమస్కరించి వారి ఆశీస్సులు పొందవలెను.

**9. అన్నసమారాధన :** ఈ ఎనిమిదింటి యనంతరము – తగుమంది బ్రాహ్మణులకు సమారాధన చేయవలెను. దానగ్రహీతయైన బ్రాహ్మణుడు అనంతరము స్నానము, జపము తప్పక ఆచరించవలెను. ఈ తొమ్మిది అంగములో చేసినదే 'శాంతి' యనబడును. తద్వారా సర్వ నక్షత్రగ్రహదోషములు అపమృత్యు భయములు తొలగి సుఖశాంతులు లభించును. ఈ శాంతి కార్యములు ఇంటి పురోహితులను (స్థానిక బ్రహ్మను) సంప్రదించి జరిపించుకోవలెను.



# మహిళలకు శుభాశుభ ముహూర్తములు ప్రధమ రజస్వల విషయములు



**1. శుభతారలు :** ఈ సమయంలో నక్షత్రబలమునకు పట్టు యెక్కువ. దోష నక్షత్రమైనచో అధికశాంతి చేయించవలెను. అశ్వ, రో, మృ, ఆర్ద్ర, పుష్య, ఉత్తరాత్రయ, చి, స్వా, వి, అనూ, మూ, శ్ర, ధ, శత, రేవతి మంచివి. భర్త యొక్క జన్మనక్షత్రము అమితహాని. వివాహాలకు వరుని జన్మతారను వధువు ప్రధమ రజస్వలా తారనూ పరిశీలించవలెను.

**2. శుభతిధులు :** 3,5,7,10,11,13,15 శుభం. తక్కినవాటికి శాంతి.

**3. శుభవారములు :** గురు, శుక్ర, మంచిది. సోమ, బుధ, సామాన్య శాంతి, ఆది, మంగళ, శనివారములు అధికశాంతి.

**4. శుభలగ్నములు :** వృష, మిధు, కటక, కన్యా, తులా, ధనూ, మీనలగ్నములు మంచివి. తక్కినవి చెడ్డవి. అయినప్పటికినీ లగ్నము శుభయుతమైనచో సామాన్య శాంతి చాలును.

**5. వేళా విశేషములు :** ప్రాత:కాలమందు చిరసౌభాగ్యం, పూర్వాహ్ణం పుణ్యక్షేత్ర దర్శనం. మధ్యాహ్నం ధనవతి, పుత్రవతి మిగిలిన సమయాలలో దోషము సూచించును. గావున దైవజ్ఞులను సంప్రదించి శాంతులు జరిపించుకొనవలెను.

## భవిష్యత్ - అధిక మాసములు

1. శ్రీ విళంభి నామ సంవత్సరం 2018 - 19 జ్యేష్ఠమాసము
2. శ్రీ శార్వరి నామ సంవత్సరం 2020 - 21 ఆశ్వయుజమాసము
3. శ్రీ శోభకృతు నామ సంవత్సరం 2023 - 24 శ్రావణ మాసము
4. శ్రీ పరాభవ నామ సంవత్సరం 2026 - 27 జ్యేష్ఠ మాసము
5. శ్రీ సౌమ్య నామ సంవత్సరం 2029 - 30 చైత్ర మాసము
6. శ్రీ విరోధి నామ సంవత్సరం 2031 - 32 భాద్రపద మాసము
7. శ్రీ ఆనంద నామ సంవత్సరం 2034 - 35 ఆషాఢ మాసము
8. శ్రీ పింగళ నామ సంవత్సరం 2037 - 38 జ్యేష్ఠ మాసము
9. శ్రీ సిద్ధార్థి నామ సంవత్సరం 2039 - 40 ఆశ్వయుజ మాసము
10. శ్రీ దుందుభి నామ సంవత్సరం 2042 - 43 శ్రావణ మాసము
11. శ్రీ క్రోధన నామ సంవత్సరం 2045 - 46 జ్యేష్ఠ మాసము
12. శ్రీ విభవ నామ సంవత్సరం 2048 - 49 చైత్ర మాసము

## మృత విషయమై గృహవర్జన

1,2,3,6,9,12,14,30 తిధులు, ఆది,మంగళ,శుక్రవారములు దోషము, చిత్త,మృగశిర, నక్షత్రములందలి మృతి విషయమై 3నెలలు కృత్తిక,ఉత్తర,ఉత్తరాషాఢ,విశాఖ,పునర్వసులందు 4నెలలు, రోహిణి,మఘ,ధనిష్ఠ,శతభిషం,పూర్వాభాద్ర,ఉత్తరాభాద్ర రేవతి 6నెలలు భరణి 1నెల, ఆ గృహమును విసర్జించవలెను. చెడు తిధి, చెడు వారము అయి నక్షత్రము బాగున్నచో అర్ధదోషమగును. తిధి వార నక్షత్రములు 3ను చెడు అయినచో పూర్ణదోషము. తిధి కంటే వారదోషము ఎక్కువ. శుక్రవారము కంటే మంగళవారము కీడు. ఈ వారములతో ద్వి,త్రిపాద,ధనిష్ట పంచక నక్షత్రములు కలసినచో ఒక మరణముతో మరోక మరణము సూచ్యము. కావున గృహమును విసర్జించుట మంచిది.

## సుస్వప్నములు (కలలు)

ఫలవృక్షములు, రధములు, గుఱ్ఱములు, ఏనుగులు, మేడ, పర్వతములు, వీటిని ఎక్కుట, రాజు, రాజ లాంఛనములు, బంగారం, ఎద్దు, ఆవు, పండ్లు, పూలు, గోక్షీరము, గోఘృతము, కన్యక, వేశ్య, రత్నములు, ముత్యాలు, శంఖము దేవతావిగ్రహములు, చందనము, పుణ్యస్థలం, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, భక్ష్యములు తినుట, పీతాంబరములు, ఆభరణములు ధరించుట, జయము పొందుట, దేవతాదర్శనం, సువాసినిలు, విమానయానము, ఉన్నతపదవి నందుట, సన్మాన సత్కారములు, పల్లకి, ఆకాశయానము, గాలిలో తేలిపోవుట, సూర్యచంద్రులు, సాధుపురుషులు, గురువులు, స్త్రీ సంగమము, తల్లి, చెల్లి, భార్య, వదిన, అత్త, సంగీత సాధనములు, నాట్యము, కల్లు, అగ్ని (మంటలు), నక్షత్రములు, ప్రవహించునదులు, ఉద్యానవనములు, స్వప్నమందు కనిపించుట శుభప్రదము.

## దుస్వప్నములు

సముద్రమున పడుట, బురదలో కూరుకుపోవుట, ప్రవాహమున కొట్టుకుపోవుట, వాహనం నుండి పడుట, చెరసాలలో నుండుట, ఏడ్చుట, అరచుట, మృతివార్త వినుట, క్షౌరం చేయించుకొనుట, ముండ్లపొదలో చిక్కుట, పర్వతం నుండి జారుట, తన గొంతుకు ఉరి తగిలినట్టు, తనను ఇతరులు కొట్టినట్లు, తన చేతిలోని ఫలవస్తువులాదిగా గలవానిని ఇతరులు లాగికొనుట, సర్పం, దున్నపోతు, గాడిద, కాకి, పిల్లి, నక్క ఆముదము, తిలభాండము, నువ్వులు, నల్లని ద్రవ్యములు, ఊక, బూడిద, బొగ్గులు, ఎముకలు, ఆయుధాలు, యముడు, యమధూతలు, భూతప్రేత పిశాచాలు, క్షుద్రవ్యక్తులు, మంత్రగాళ్ళు, వైద్యుడు, రక్షకభటులు, సంకెళ్ళు, ఇతర ఇనుప గొలుసులు, మంత్రసాని, బిచ్చగత్తె, చాకలి స్త్రీ, రోగగ్రస్తులు, రైలుబండి, ఓడ, పడవ, అరణ్యము, క్రూర జంతువులు, వేట, శవములు, స్మశానం, సన్యాసి, రక్తం, పొగ, మలినవస్త్రములు ధరించినట్లు, విధవా స్త్రీ, పసిపిల్లలు, చీకటిగుహలు, శత్రువు, కోతి మొ॥నవి దుష్టస్వప్నములు చెడు సూచించును.

## ఔషద సేవా శుభకాలము

ఆది, మంగళ, గురు, శుక్రవారములందు గల అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతీ నక్షత్రములందు రోగికి తారాబలము గల నక్షత్రం గల దినమందు శుభగ్రహహోరాకాలంలో ఔషదసేవనము ప్రారంభించుట శుభప్రదము.

## ఆయుష్కర్మ (క్షౌరమునకు) శుభాశుభములు

క్షౌరము చేసుకొనుటకు 2,3,5,7,10,13 తిధులు సోమ, బుధ, గురువారములు అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, జ్యేష్ట, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతీ నక్షత్రములు. భోజనాత్పూర్వము ప్రాత:కాలము శుభప్రదము. తూర్పు లేక ఉత్తర ముఖముగా కూర్చుని క్షౌరము చేయించుకొనవలెను. ముందు కుడివైపు ప్రారంభించవలెను. పుణ్యక్షేత్రములందు వివాహ యజ్ఞాదిదీక్షా కాలములందు, రాజాజ్ఞలందు, మృత్యుసూతక, ప్రాయశ్చిత్తాది కార్యములందు, నిషిద్ధ తిధివారాదుల యందు కూడా దోషము లేదు.

# వధూవర గుణమేళన చక్రము

## (వరుని నక్షత్రము)

| వధూ నక్షత్రము | అశ్వి | భ | కృ 1 | కృ 3 | రో | మృ 2 | మృ 2 | ఆ | పున 3 | పున 1 | పు | ఆ | మ | పు | ఉఫ 1 | ఉఫ 3 | హ | చి 2 | చి 2 | స్వా | విశా 3 | విశా 1 | అనూ | జ్యే | మూ | పూషా | ఉషా 1 | ఉషా 3 | శ్ర | ధ 2 | ధ 2 | శత | పూభా 3 | పూ 1 | ఉభా | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | 28 | 33 | 28 | 18 | 21 | 22 | 26 | 17 | 18 | 22 | 31 | 27 | 21 | 26 | 17 | 11 | 9 | 13 | 22 | 26 | 22 | 19 | 26 | 15 | 13 | 27 | 24 | 26 | 24 | 21 | 21 | 15 | 16 | 14 | 24 | 26 |
| భరణి | 34 | 28 | 29 | 19 | 22 | 15 | 18 | 26 | 26 | 30 | 23 | 24 | 21 | 19 | 28 | 21 | 19 | 6 | 14 | 29 | 22 | 19 | 17 | 19 | 21 | 20 | 27 | 28 | 26 | 19 | 10 | 20 | 14 | 22 | 16 | 28 |
| కృత్తి-1 | 27 | 27 | 28 | 17 | 9 | 15 | 19 | 20 | 21 | 25 | 26 | 23 | 17 | 21 | 22 | 15 | 15 | 18 | 27 | 15 | 19 | 16 | 20 | 26 | 24 | 19 | 14 | 15 | 10 | 25 | 25 | 27 | 19 | 17 | 19 | 11 |
| కృత్తి-3 | 18 | 18 | 19 | 28 | 19 | 25 | 16 | 17 | 18 | 22 | 23 | 20 | 19 | 23 | 24 | 21 | 21 | 23 | 22 | 10 | 14 | 21 | 25 | 31 | 20 | 13 | 9 | 14 | 10 | 23 | 29 | 31 | 23 | 20 | 22 | 14 |
| రోహిణి | 23 | 23 | 10 | 19 | 28 | 36 | 27 | 23 | 23 | 27 | 26 | 13 | 12 | 26 | 28 | 25 | 26 | 20 | 19 | 15 | 9 | 16 | 30 | 24 | 14 | 20 | 11 | 17 | 18 | 20 | 26 | 24 | 30 | 27 | 26 | 19 |
| మృగ2 | 22 | 13 | 15 | 27 | 34 | 28 | 20 | 25 | 23 | 26 | 19 | 22 | 21 | 17 | 25 | 23 | 27 | 13 | 10 | 25 | 17 | 23 | 22 | 25 | 15 | 11 | 18 | 21 | 24 | 13 | 19 | 27 | 29 | 26 | 17 | 27 |
| మృగ-2 | 27 | 18 | 21 | 18 | 25 | 20 | 28 | 33 | 31 | 19 | 10 | 15 | 24 | 20 | 28 | 30 | 34 | 21 | 14 | 27 | 19 | 14 | 11 | 13 | 23 | 18 | 24 | 20 | 25 | 12 | 13 | 21 | 23 | 27 | 17 | 27 |
| ఆర్ద్ర | 19 | 27 | 21 | 18 | 24 | 26 | 34 | 28 | 25 | 13 | 20 | 13 | 23 | 29 | 22 | 24 | 24 | 27 | 20 | 27 | 20 | 13 | 17 | 4 | 16 | 27 | 27 | 22 | 22 | 17 | 18 | 11 | 16 | 19 | 27 | 27 |
| పునర్వ3 | 19 | 26 | 22 | 19 | 23 | 24 | 32 | 24 | 28 | 16 | 23 | 16 | 22 | 27 | 21 | 23 | 24 | 25 | 18 | 27 | 21 | 13 | 20 | 5 | 13 | 26 | 27 | 27 | 23 | 17 | 18 | 11 | 17 | 19 | 27 | 28 |
| పునర్వ 1 | 21 | 28 | 23 | 20 | 24 | 25 | 19 | 10 | 14 | 28 | 35 | 28 | 15 | 20 | 14 | 18 | 18 | 20 | 20 | 27 | 20 | 19 | 26 | 10 | 8 | 20 | 21 | 28 | 27 | 21 | 12 | 7 | 11 | 17 | 25 | 25 |
| పుష్యమి | 30 | 21 | 26 | 23 | 24 | 17 | 10 | 18 | 21 | 35 | 28 | 30 | 18 | 14 | 23 | 26 | 27 | 12 | 11 | 26 | 21 | 20 | 19 | 22 | 17 | 11 | 22 | 26 | 25 | 13 | 4 | 14 | 18 | 24 | 18 | 27 |
| ఆశ్రేష | 25 | 23 | 22 | 19 | 12 | 21 | 13 | 12 | 15 | 28 | 28 | 28 | 15 | 15 | 17 | 20 | 20 | 26 | 25 | 11 | 16 | 15 | 20 | 26 | 22 | 16 | 8 | 12 | 13 | 27 | 18 | 18 | 12 | 18 | 20 | 12 |
| మఖ | 21 | 21 | 17 | 18 | 11 | 19 | 22 | 22 | 21 | 16 | 18 | 16 | 28 | 30 | 16 | 16 | 16 | 22 | 25 | 11 | 17 | 24 | 26 | 34 | 24 | 21 | 11 | 5 | 4 | 18 | 24 | 25 | 18 | 17 | 18 | 12 |
| పుబ్బ | 27 | 19 | 21 | 22 | 25 | 17 | 20 | 28 | 27 | 21 | 16 | 16 | 30 | 28 | 34 | 24 | 22 | 8 | 11 | 25 | 19 | 26 | 24 | 24 | 19 | 19 | 27 | 21 | 18 | 4 | 11 | 19 | 24 | 23 | 16 | 24 |
| ఉత్తర 1 | 18 | 27 | 22 | 23 | 27 | 25 | 28 | 21 | 21 | 16 | 25 | 18 | 26 | 34 | 28 | 18 | 16 | 14 | 17 | 26 | 17 | 24 | 32 | 19 | 10 | 27 | 28 | 22 | 20 | 11 | 18 | 12 | 16 | 15 | 26 | 24 |
| ఉత్తర 3 | 13 | 21 | 16 | 21 | 25 | 23 | 30 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 25 | 19 | 28 | 25 | 24 | 16 | 25 | 16 | 18 | 27 | 13 | 15 | 28 | 29 | 26 | 25 | 16 | 16 | 10 | 14 | 18 | 29 | 27 |
| హస్త | 11 | 20 | 16 | 21 | 26 | 26 | 33 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 22 | 17 | 26 | 28 | 27 | 19 | 36 | 17 | 19 | 26 | 12 | 14 | 26 | 27 | 23 | 24 | 19 | 19 | 7 | 14 | 19 | 27 | 27 |
| చిత్త 2 | 13 | 6 | 19 | 25 | 20 | 12 | 19 | 26 | 24 | 20 | 12 | 26 | 23 | 9 | 15 | 24 | 27 | 28 | 20 | 19 | 26 | 28 | 11 | 25 | 28 | 13 | 21 | 17 | 19 | 18 | 18 | 24 | 18 | 22 | 11 | 21 |
| చిత్త 2 | 22 | 15 | 28 | 23 | 20 | 12 | 13 | 20 | 18 | 20 | 12 | 26 | 25 | 10 | 17 | 17 | 20 | 21 | 28 | 27 | 34 | 24 | 7 | 21 | 28 | 13 | 21 | 25 | 27 | 26 | 20 | 26 | 20 | 15 | 4 | 13 |
| స్వాతి | 27 | 29 | 17 | 12 | 16 | 27 | 27 | 26 | 26 | 28 | 28 | 15 | 13 | 25 | 25 | 25 | 27 | 21 | 28 | 28 | 20 | 10 | 23 | 18 | 23 | 26 | 18 | 22 | 23 | 27 | 21 | 20 | 25 | 19 | 20 | 13 |
| విశాఖ 3 | 22 | 22 | 20 | 15 | 10 | 18 | 19 | 21 | 21 | 22 | 21 | 19 | 17 | 19 | 18 | 17 | 18 | 27 | 34 | 18 | 28 | 18 | 17 | 21 | 28 | 21 | 13 | 17 | 17 | 32 | 26 | 26 | 22 | 16 | 13 | 5 |
| విశాఖ 1 | 16 | 16 | 14 | 19 | 14 | 22 | 13 | 14 | 14 | 19 | 18 | 15 | 21 | 23 | 21 | 18 | 19 | 28 | 23 | 8 | 17 | 28 | 27 | 31 | 23 | 17 | 9 | 12 | 12 | 27 | 27 | 26 | 22 | 21 | 18 | 9 |
| అనూ | 24 | 14 | 19 | 24 | 27 | 20 | 11 | 16 | 21 | 26 | 18 | 21 | 24 | 20 | 29 | 26 | 27 | 12 | 7 | 22 | 17 | 28 | 28 | 31 | 16 | 14 | 22 | 25 | 26 | 12 | 12 | 22 | 24 | 24 | 18 | 27 |
| జ్యేష్ఠ | 12 | 18 | 24 | 29 | 22 | 22 | 13 | 3 | 6 | 10 | 20 | 26 | 31 | 23 | 16 | 13 | 12 | 25 | 20 | 17 | 20 | 31 | 30 | 28 | 15 | 17 | 17 | 20 | 20 | 25 | 25 | 18 | 11 | 9 | 21 | 21 |
| మూల | 12 | 20 | 24 | 19 | 13 | 14 | 21 | 15 | 12 | 8 | 17 | 24 | 25 | 19 | 9 | 13 | 13 | 27 | 27 | 21 | 27 | 24 | 26 | 16 | 28 | 27 | 25 | 15 | 15 | 21 | 25 | 21 | 11 | 17 | 25 | 27 |
| పూ.షా | 27 | 20 | 19 | 13 | 20 | 12 | 18 | 26 | 26 | 23 | 13 | 17 | 21 | 19 | 27 | 27 | 26 | 11 | 11 | 26 | 19 | 18 | 18 | 19 | 27 | 28 | 34 | 24 | 23 | 8 | 15 | 22 | 29 | 32 | 23 | 32 |
| ఉ.షా 1 | 25 | 27 | 14 | 8 | 11 | 18 | 24 | 26 | 26 | 23 | 24 | 9 | 11 | 27 | 28 | 28 | 27 | 20 | 20 | 19 | 12 | 11 | 25 | 19 | 25 | 34 | 28 | 18 | 15 | 15 | 22 | 22 | 28 | 31 | 32 | 23 |
| ఉ.షా 3 | 28 | 29 | 16 | 14 | 17 | 22 | 20 | 22 | 22 | 27 | 28 | 13 | 6 | 22 | 23 | 26 | 25 | 17 | 24 | 23 | 16 | 14 | 28 | 22 | 16 | 25 | 19 | 28 | 25 | 25 | 17 | 17 | 23 | 30 | 32 | 23 |
| శ్రవణం | 27 | 26 | 13 | 10 | 17 | 26 | 23 | 21 | 23 | 28 | 26 | 15 | 17 | 18 | 20 | 23 | 25 | 18 | 25 | 23 | 16 | 14 | 28 | 23 | 17 | 25 | 15 | 24 | 28 | 30 | 20 | 18 | 23 | 32 | 31 | 24 |
| ధనిష్ట 2 | 20 | 10 | 26 | 23 | 20 | 12 | 8 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 5 | 12 | 16 | 18 | 16 | 24 | 26 | 30 | 28 | 14 | 28 | 21 | 9 | 16 | 25 | 21 | 28 | 18 | 23 | 21 | 26 | 15 | 22 |
| ధనిష్ఠ 2 | 20 | 11 | 26 | 30 | 27 | 19 | 10 | 19 | 19 | 14 | 5 | 20 | 25 | 11 | 19 | 17 | 21 | 18 | 19 | 22 | 25 | 28 | 12 | 26 | 29 | 16 | 13 | 18 | 21 | 20 | 28 | 33 | 28 | 18 | 7 | 14 |
| శతభిషం | 15 | 21 | 28 | 32 | 25 | 25 | 18 | 10 | 10 | 7 | 15 | 20 | 26 | 20 | 13 | 11 | 8 | 26 | 26 | 19 | 26 | 26 | 21 | 19 | 22 | 23 | 23 | 18 | 18 | 25 | 33 | 28 | 19 | 9 | 17 | 16 |
| పూ.భా 3 | 18 | 25 | 20 | 24 | 31 | 31 | 24 | 17 | 17 | 13 | 20 | 14 | 19 | 25 | 17 | 15 | 17 | 18 | 19 | 28 | 21 | 21 | 27 | 12 | 15 | 30 | 29 | 24 | 25 | 20 | 27 | 19 | 28 | 18 | 23 | 20 |
| పూ.భా 1 | 14 | 21 | 16 | 19 | 26 | 26 | 25 | 18 | 18 | 18 | 25 | 18 | 16 | 22 | 14 | 16 | 18 | 19 | 12 | 20 | 14 | 21 | 27 | 11 | 15 | 31 | 30 | 28 | 30 | 25 | 17 | 7 | 16 | 28 | 33 | 30 |
| ఉ.భా | 24 | 15 | 18 | 21 | 25 | 17 | 16 | 25 | 27 | 26 | 19 | 20 | 17 | 15 | 25 | 27 | 26 | 9 | 3 | 19 | 12 | 19 | 20 | 22 | 24 | 22 | 31 | 29 | 29 | 14 | 6 | 16 | 21 | 33 | 28 | 34 |
| రేవతి | 25 | 24 | 11 | 14 | 17 | 26 | 25 | 24 | 25 | 24 | 27 | 13 | 12 | 22 | 22 | 24 | 26 | 20 | 13 | 11 | 5 | 12 | 27 | 22 | 27 | 30 | 21 | 19 | 22 | 22 | 14 | 16 | 18 | 29 | 33 | 28 |



బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణకూటము, వైశ్యులకు రాశి లేక స్త్రీ ధీర్ఘకూటము శూద్రులకు యోని పొంతనము శుభయుక్తమై 18 గుణములకు పైన వచ్చిన వివాహమునకు శుభము



# వివాహ ప్రకరణము



యుక్త వయస్సు వచ్చిన తమ కుమారుడు, కుమార్తెలకు వివాహం చేయడం తల్లిదండ్రుల కర్తవ్యం. ప్రస్తుత దేశకాల పరిస్థితులలో తగిన వధువు, వరుడు లభించడం వారి పూర్వజన్మ సుకృతమే. ప్రస్తుతం సమాజంలో వివాహం అయిన భార్యాభర్తల మధ్య అన్యోన్నత తగ్గి అవగాహన రాహిత్యంతో విడాకులు తీసుకోవడం సర్వసాధారణం అయిపోయింది.

ఈ పరిస్థితులలో వధూ, వరులకు తగిన భర్త, భార్యలను వెదకడం కష్ట సాధ్యమయిన పని, జ్యోతిష్య శాస్త్రం మాత్రమే ఈ సమస్యకు పరిష్కారం చూపగలదు.

వధూ, వరుల జన్మతేది సమయాల ఆధారంగా తయారుచేసిన వారి జాతకాలు అనుసరించి వారి భార్యభర్తల మైత్రిని గుణించి యోగ్యమైన సంబంధాలను నిర్ణయించవలసి వుంటుంది.

జన్మ తేది లేని వారికి పేర్లు ఆధారంగా కూడా భార్యాభర్తల మైత్రిని గుణించవచ్చు.

## 1. వధూవర గుణమేళనం

1. వర్గము, 2. వశ్యము, 3. తార, 4. యోని, 5. గ్రహమైత్రి, 6. గుణము, 7.రాశి, 8. నాడి అనేది అంశాల ఆధారంగా మొత్తం 36 గుణములకు కనీసం సగం 18 గుణములు పైనవచ్చినచో వారి మైత్రి శుభకరంగా ఉన్నట్లు గమణించాలి.

ఈ మైత్రిలో18 గుణములు వచ్చిన పిదప బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు, గణకూలము, వైశ్యులకు తార కూటమి, శూద్రులకు యోని పొంతనము శుభయుక్తంగా వుండాలిని శాస్త్రం సూచిస్తుంది.

## 2. విరోధి జంతువులు

(లేడి – కుక్క) (ఆవు – పులి) (పాము – ముంగిస) (సింహం – ఏనుగు) (గుఱ్రము – దున్న) (కోతి – మేక) (ఎలుక – పిల్లి) ఇవి విరోధ జంతువులు వీటిని గమనించవలసి యుంటుంది. **పులి – మేక లకు విరోధము లేదని గ్రహించవలయును.**

## 3. లగ్న/రాశి మైత్రి

జన్మలగ్నము కలవారికి లగ్నమును అనుసరించి పేరుతో చూచినపుడు రాశిని అనుసరించి **వధువు** జన్మలగ్నము, జన్మరాశి నుండి 8వ లగ్నము, 8వ రాశి గల వరునకు వివాహము చేయరాదు. దీని ప్రకారం ఈ క్రింది లగ్నం / రాశుల వారికి వివాహము చేయరావు.

1. మిధునం – మకరం
2. కర్కాటకం – కుంభం
3. సింహం – మీనం
4. కన్య – మేషం
5. వృశ్చికం – మిధున
6. ధనస్సు – కర్కాటకం
7. మకరం – సింహం
8. కుంభం – కన్య
9. మీనం – తుల
10. వృషభం – ధనుస్సు

## ఒకే నక్షత్రం కలవారికి వివాహం

అశ్వని, కృత్తిక, రోహిణీ, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, విశాఖ, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ 19 నక్షత్రముల వధూవరులకు ఏకనక్షత్రమైననూ వివాహం చేయవచ్చును.

భరణి, ఆశ్లేష, స్వాతి, జ్యేష్ట మూల, ధనిష్ట, శతభిషం, పూర్వాభాద్ర ఈ 8 నక్షత్రముల వారికి ఏకనక్షత్రమైన వివాహం చేయరాదు. ఏకనక్షత్ర వివాహం చేయవలసినపుడు వరుని నక్షత్ర పాదము ముందు, వధువు నక్షత్ర పాదము వెనుక ఉండవలెను.

## కుజదోషం

వివాహ విషయంలో అత్యంత ముఖ్యమైన అంశం కుజదోషం. జాతక చక్రంలో లగ్నాత్ 1,2,4,7,8,12 స్థానాలలో కుజుడు ఉన్నా లేక ఆ స్థానాలకు కుజదృష్టి కల్గిన కుజదోషంగా భావించాలని శాస్త్ర నిర్ణయం. కుజదోషం కల్గిన పురుషుల భార్యస్థానానికి, స్త్రీల భర్త స్థానానికి పీడ కలుగుతుంది. వధూవరుల జాతకాలు రెండింటా కుజదోషం కలవారికి వివాహం చేయడం శ్రేయస్కరమని శాస్త్ర వచనం.

కన్యా, మిధున లగ్నములకు ద్వితీయ మందున, తుల వృషభలగ్న జాతకులకు వ్యయమందును, వృశ్చిక మేష లగ్నజాతకులకు చతుర్ధమందును, కర్కాటక మకర లగ్నజాతకులకు సప్తమ మందును, ధనుర్ మీన జాతకులకు, అష్టమ మందును, కజుడు **దోష ప్రదుడు కాదు.** కుంభ సింహ లగ్నములకు కుజదోషమునని లేదు. పై విషయమున్నీ గ్రహించి వధూవరుల జాతకాలు పరిశీలించి వివాహ పొంతన నిర్ణయించవలసివుంటుంది. అనుభవజ్ఞులైన శాస్త్రీయ విజ్ఞానం కల గణిత సిద్ధాంతులచే వివాహ పొంతన, ముహూర్త నిర్ణయం చేయించడం శ్రేయస్కరం. ఈ విషయంలో సరి అయిన నిర్ణయం కొరకు మమ్ము సంప్రదించవచ్చును.

## త్రి జ్యేష్ట స్వరూపం

జ్యేష్టులనగా తొలిచూలు సంతానమని అర్ధము. ప్రధమ గర్భ జనితులే జ్యేష్టులగుదురు. జన్మించిన వారిలో ప్రధములకే జ్యేష్టత్వము. ప్రధమ సంతానము మరణించినచో రెండవ సంతానమునకు జ్యేష్టత్వము లేదు.

వివాహ సమయము నందు ఈ జ్యేష్ఠాస్వరూపమును చర్చించవలయును. జ్యేష్టత్వము జ్యేష్ట మాసము, జ్యేష్ట నక్షత్రము అను మూడు సందర్భములలో ఆరుసార్లు జ్యేష్ట శబ్ధము ఉత్పన్నమగును. ఇందు 3 జ్యేష్టలు (త్రిజ్యేష్ట), 4 జేష్టలు (జ్యేష్ఠా చతుష్టయం), 5 జ్యేష్టలు (జ్యేష్ఠా పంచకం) 6 జ్యేష్టలు (షట్జ్యేష్టి) నిషిద్ధం

3 జ్యేష్టలు అంతకన్నా ఎక్కువ జ్యేష్ఠా శబ్ధములు ఉత్పన్నమయినపుడు అట్టి వివాహము శ్రేయస్కరం కాదని గ్రహించవలయును. ఈ విషయములో అనుభవజ్ఞులైన దైవజ్ఞులు, సిద్ధాంతులను సంప్రదించి తెలుసుకొనగలరు.

# పెదగాడి వారి రత్నశాస్త్రము

| | | |
|---|---|---|
| జాతిపచ్చ ఫలితాలు సంతాన ప్రాప్తి, అదృష్టం | వజ్రము ఫలితాలు భోగభాగ్యాలు, విలాసం | ముత్యం ఫలితాలు కార్యజయం, మనశ్శాంతి |
| కనకపుష్యరాగం ఫలితాలు కుటుంబ కీర్తి, వివేకం | కెంపు ఫలితాలు రాజకీయకీర్తి, దాంపత్య సుఖం | పగడం ఫలితాలు శత్రుజయం, దీర్ఘాయువు |
| వైఢూర్యం ఫలితాలు ఆరోగ్యలాభం, ఏకాగ్రత | నీలం ఫలితాలు పేరు, ప్రతిష్ఠ, అభివృద్ధి | గోమేధికం ఫలితాలు ధనలాభం, అధికారము |

సకల చరాచర జగత్తు అంతా నవగ్రహాల ప్రభావంపై ఆధారపడి చరిస్తూ వుంటుంది. దైవానుగ్రహ ఫలాలు సైతం గ్రహగమనాన్ని అనుసరించి మనకు చేరువవుతూ వుంటాయి. ఇదే సమయంలో ప్రతికూల ప్రబావాలను సైతం మనం అనుభవించక తప్పదు. ఇట్టి ప్రతికూల ఫలితాలనుండి మనల్ని మనం రక్షించుకోవడానికి జ్యోతిష శాస్త్రం శాంతి విధానాన్ని ప్రసాదించింది. ఆ శాంతి విధానంలో నవరత్న ధారణం అత్యంత ముఖ్యమైనది. ప్రతికూల ప్రభావాలనుండి రక్షణగా మనకు ప్రకృతి నవరత్నాలను ప్రసాదించింది. ఈ నవరత్నాలు భూమిలో ఆయాగ్రహాల ప్రభావ ఫలితంగా ఏర్పడుతూ ఉంటాయి. వాటిని మనం సేకరించి, సానపట్టి ఆయా గ్రహాల అనుకూలత కొరకు ధరిస్తూ ఉంటాం. ప్రకృతి సహజసిద్ధంగా ప్రసాదించిన ఈ నవరత్నాలకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. నవగ్రహాల్లోని ఒక్కొక్క గ్రహానికి ఒక్కొక్క రత్నాన్ని శాస్త్రంలో పేర్కొన్నారు. వీటి ధారణవల్ల రోగపీడలు, శత్రు బాధలు తొలగుతాయని నమ్మకం. జన్మరాశి లేదా జన్మలగ్నానికి అధిపతి అయిన గ్రహానికి వర్తించే రత్నం ధరించడం ఒక పద్ధతి. జాతకంలో ఏగ్రహ దశ నడుస్తున్నదో ఆ గ్రహానికి సంబంధించిన రత్నధారణ మరో పద్ధతి. అలాగే జన్మ నక్షత్రానికి అధిపతి అయిన గ్రహానికి వర్తించే రత్నాన్ని కూడా ధరించవచ్చు.

## నవరత్నములు ధరించుట వలన కలుగు ఫలితములు

**కెంపు :** ఇది సూర్యునికి సంబంధించిన రత్నం. ఆరోగ్య, ఉద్యోగం, అధికారం, నేత్ర, హృదయ రోగాలనుంచి విముక్తికి దీనిని ధరించవచ్చునని శాస్త్రం చెబుతోంది. సింహరాశివారు, కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాడ నక్షత్రాల వారు దీనిని ధరించవచ్చు. అలాగే 1,10,19,28 తేదీల్లో జన్మించిన వారు ధరించవచ్చు. దీనిని బంగారంలో చేయించి ఆదివారం నాడు **కుడిచేతి ఉంగరపు వేలికి ధరించాలి**. రాజకీయాల్లో ఉన్నతస్థితికి కూడా ఈ రత్నం ఉపకరిస్తుంది.

**ముత్యం :** ఇది చంద్రునికి వర్తించే రత్నం. కర్కాటకం చంద్రుని రాశి. రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రాలలో జన్మించిన వారు. 2,11,20,29 తేదీల్లో జన్మించినవారు. ఈ రత్నం ధరించవచ్చు. కర్కాటక రాశి, లగ్నంలో జన్మించిన వ్యక్తులు కూడా ముత్యం ధరించవచ్చు. అలాగే చంద్రదశ జరుగుతున్నప్పుడు కూడా దీనిని ధరించవచ్చు. ఉబ్బసం, శ్వాసకోశ, ఉదర వ్యాధులు, చర్మవ్యాధుల నివారణకు ఇది ఉపకరిస్తుంది. వివాహం సకాలంలో జరిగేందుకు కూడా దీనిని ధరిస్తారు. దీనిని వెండి ఉంగరంలో ఉంచి సోమవారం **కుడిచేయి చూపుడు / ఉంగరం వేలికి ధరించాలి.**

**పుష్యరాగం :** ఇది గురుగ్రహానికి సంబంధించిన రత్నం. ధనుస్సు, మీనం గురుని భాద్ర నక్షత్రాల వారు 3,12,21,20 తేదీల్లో జన్మించిన వారు దీనిని ధరించవచ్చు. జాతక చక్రంలో గురుడు నీచస్థితి (మకరం)లోనూ, దుర్బల రాశుల్లోనూ ఉన్నవారు, గురు దశ నడుస్తున్న వారు ఈ రత్నంని ధరించవచ్చు. ఉన్నత విద్య, ఆర్థికాభివృద్ధి, కీర్తికి, సంతాన ప్రాప్తి పుష్యరాగం ధరించవచ్చు. దీనిని బంగారపు ఉంగరంలో ఉంచి గురువారం **కుడి చేయి చూపుడువేలికి ధరించాలి.**

**గోమేధికం :** ఇది రాహువునకు చెందినది. ఆరుద్ర, స్వాతి, శతభిషం నక్షత్రాలు, 4,13,22,31 తేదీల్లో జన్మించినవారు దీనిని ధరించవచ్చు. జాతకచక్రంలో రాహువు నీచ స్థితి, అర్థాష్టమ, అష్టమ స్థానాల్లో ఉన్నవారు కూడా దీనిని ధరిస్తే మంచిది. శత్రు, రుణ, రోగ బాధలు తొలగి ఉపశమనం కలుగుతుందని నమ్మకం. రాహువునకు వృషభరాశి ఉచ్ఛ, వృశ్చికరాశి నీచస్థితి. దీనిని సత్తు లోహం ఉంగరంలో ఉంచి **సోమ/శనివారం ఎడమ చేతి మధ్య వేలికి ధరించాలి.**

**పచ్చ :** ఇది బుధునికి వర్తించే రత్నం. మిధునం, కన్యారాశులు, లగ్నాలవారు. ఆశ్లేష, జ్యేష్ట, రేవతి నక్షత్రాల వారు 5,14,23 తేదీల్లో జన్మించిన వారు జాతిపచ్చ ధరిస్తే మంచిది. అలాగే బుధ మహాదశ జరుగుతున్న వారు కూడా దీనిని ధరించవచ్చు. నరాలు, మెదడుకు సంబంధించిన వ్యాధులు, రక్తపోటు నివారణకు ఇది ఉపకరిస్తుందని నమ్మకం. దీనిని వెండి ఉంగరంలో ఉంచి బుధవారం **కుడి చేతి చిటికెన వేలికి ధరించాలి.**

**వజ్రం :** ఇది శుక్రునికి సంబంధించినది. అతి ఖరీదైన రత్నం ఇదే. శుక్రుని రాశులైన వృషభం, తులారాశులు, ఈ లగ్నాల వారు, భరణి, పుబ్బ, పూర్వాషాఢ నక్షత్రాల వారు, 6,15,24 తేదీల్లో జన్మించిన వారు దీనిని ధరించవచ్చు. అలాగే జతకచక్రంలో శుక్రుడు నీచస్థితి (కన్య)లో ఉన్నవారు. శుక్రదశ జరుగుతున్న వారు కూడా వజ్రాన్ని ధరించవచ్చు. కళాకారులు దీనిని ధరిస్తే మంచి ఫలితాలు ఉంటాయని నమ్మకం. దీనిని బంగారపు వుంగరంలో ఉంచి **శుక్రవారం కుడి చేతి చూపుడు / ఉంగరం వేలికి ధరించాలి.**

**వైఢూర్యం :** ఇది కేతువునకు సంబంధించిన రత్నం. పిల్లికన్ను మాదిరిగా ఉంటుంది. మధ్యలో తెల్లటి వెండిరేఖ మాదిరిగా కనిపిస్తుంది. అశ్విని, మఖ, మూల నక్షత్రాలు, 7,16,25 తేదీల్లో జన్మించిన వారు, కేతు దశ జరుగుతున్నవారు, కేతువు నీచస్థితి (వృషభరాశి)లో వున్న వారు దీనిని ధరించవచ్చు. జ్యోతిషం, తర్కశాస్త్రాలు అభ్యసించే వారికి మేలు చేస్తుంది. దీని రంగు మారిందంటే ఏదో వ్యాధి ఉన్నట్లని శాస్త్రం. దీనిని పంచలోహాల ఉంగరంలో ఉంచి **ఆది/మంగళవారం ఎడమచేతి ఉంగరం వేలికి ఉంగరం ధరించాలి.**

**నీలం :** ఇది శనిగ్రహానికి చెందినది. మకర, కుంభరాశులు, లగ్నాలవారు, పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాల వారు, 8,17,26 తేదీల్లో జన్మించిన వారు, శనిదశ జరుగుతున్న వారు, అర్ధాష్టమ, అష్టమ, ఏల్నాటి శని జరుగుతున్న వారు దీనిని ధరించవచ్చు. **ఎడమచేతి మధ్య వేలికి దీనిని ధరించాలి.** కష్టాలను తొలగించి మానసిక ప్రశాంతతకు, ఆరోగ్యానికి ఇది దోహదపడుతుంది. దీనిని వెండి ఉంగరంలో ఉంచి శనివారం ధరించాలి.

**పగడం :** ఇది కుజునికి వర్తించే రత్నం. శత్రుభయం, రుణబాధలు, రోగపీడ, కుజదోషం ఉన్నవారు దీనిని ధరించవచ్చు. భూవివాదాలు పరిష్కారానికి, సోదరులతో సఖ్యతకు దీనిని ధరిస్తే మంచి ఫలితాలు ఉంటాయని నమ్మకం. మేషం, వృశ్చిక రాశులు, ఈ లగ్నాలు, మృగశిర, చిత్త, ధనిష్ట నక్షత్రాలు వారు 9,18,27 తేదీల్లో జన్మించిన వారు దీనిని ధరిస్తే మంచి ఫలితాలు ఉంటాయి. దీనిని రాగి ఉంగరంలో ఉంచి మంగళవారం **ఎడమచేతి ఉంగరపు వేలికి ధరించాలి.**

## నవరత్న ఉంగరం

### నవగ్రహానుకూలతకై నవరత్నాలుపొదిగిన ఉంగరాన్ని ధరించటం శ్రేయోదాయకం

# పెదగాడి వారి సంఖ్యాశాస్త్రము

సంఖ్యలను అనుసరించి గ్రహఫలాలను తెలుసుకొనుటకు ఏర్పడినదే ఈ సంఖ్యాశాస్త్రం పుట్టినతేదీని బట్టి అది తెలియనివారు వారి యొక్క పేరును ఇంగ్లీషులో వ్రాసుకొని ఆయా అక్షరములకు క్రింద తెల్పిన విధముగా అంకెలను ఏర్పరచుకొని వాటిని మొత్తముగా ఏక అంకెగా మార్చుకొనవలయును. అట్లు వచ్చిన అంకె (1 నుండి 9) ను వారి అదృష్ట సంఖ్యగా నిర్ణయించుకొని ఫలమును చూచుకొనవలయును.

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 8 | 3 | 5 | 1 | 1 | 2 | 3 | 4 | 5 | 7 | 8 | 1 | 2 | 3 | 4 | 6 | 6 | 6 | 5 | 1 | 7 |

ఉ॥ P. DIVYA SRI 8+4 +1 +6 +1 +1 +3+2+1 = 27 = 2+7 = 9 వీరి అదృష్ట సంఖ్య

## అదృష్ట సంఖ్యలకు గ్రహ ఫలము

**1.రవి 2.చంద్రుడు 3.గురుడు 4.రాహువు 5.బుధుడు 6.శుక్రుడు 7.కేతువు 8.శని 9. కుజుడు**

జనన తేదీకి మిత్ర, సమ, శత్రు సంఖ్యలు

| జనన తేది అదృష్ట సంఖ్య | మిత్ర సంఖ్యలు | సమ సంఖ్యలు | శత్రు సంఖ్యలు |
|---|---|---|---|
| 1, 4 | 2,3,7,9 | 5 | 6,8 |
| 2, 7 | 1,4 | 3,5,6,8,9 | లేదు |
| 3 | 1,2,4,7,9 | 8 | 5,6 |
| 5 | 1,4,6 | 3,8,9 | 2,7 |
| 6 | 5,8 | 3,9 | 1,2,4,7 |
| 8 | 5,6 | 3 | 1,2,4,7,9 |
| 9 | 1,2,3,4,7 | 6,8 | 5 |

పై విధముగా మిత్ర, సమసంఖ్య గల వారితో స్నేహము, శుభ ఫలములను, శత్రు సంఖ్య గలవారితో శత్రుత్వము కలుగును.కావున వీటి ప్రకారము అనుసరించవలయును.



## అదృష్ట సంఖ్య 1. రవి (సూర్య) ఫలము

వీరు గౌరవాధికారములతో కూడిన స్వతంత్ర జీవనము చేయుదురు. పట్టుదల ఎక్కువ ధైర్య సాహసములు కలిగి స్వశక్తి వలన అభివృద్ధిలోనికి వచ్చెదరు. ఇతరుల మీద పెత్తనం వహించెదరు. అధికారము వహింపగలశక్తి సామర్థ్యములు యుండును. ప్రభుత్వ కార్యాలయములలో ప్రధానోద్యోగములు చేయుదురు. దైవబలము అనుకూలించును విదేశములయందు పేరు సంపాదింతురు. పితృభాగ్యము వలను సుఖసౌఖ్యములు పొందుదురు.

ఆదివారము, సోమవారములు అదృష్ట ప్రదమైనవి. 1,4,10,13,19, 22,29,31 తేదీలు ఏనెలయందైనా మంచివి. 6,8,15,16,24,26 తేదీలు వ్యతిరేకం 2,4,7,11,13, 16,20,22,25 తేదీలు మధ్యమమైనవి. పై తేదీలు వారములు కలిసిన అనుకూలము.జాతి కెంపు ఉంగరములో ధరించిన అదృష్ట ప్రధము, పసుపురంగు అనుకూలము జాతక రీత్యా రవి, రాహుదశలు యోగించును. మార్చి, జూన్, అక్టోబరు నెలలలో చిక్కులు, ధన్యవ్యయము కలుగుచుండును. ఏకముఖి, దశముఖి రుద్రాక్షధారణ శుభమునిచ్చును.



## అదృష్ట సంఖ్య 2. చంద్రుడు ఫలము

వీరు మంచి విజ్ఞానశక్తి కలిగియుందురు. నూతన విషయాలు కనిపెట్టుచుందురు. కాని ఏ పనియందు పట్టుదల చూపరు. చంచల స్వభావులు, జాయింటు వ్యాపారములు, స్పెక్యులేషన్ అనుకూలించును. మనోనిగ్రహముతో కష్టములు ఎదుర్కొందురు. ఉద్రేకము ఎక్కువ, దూరప్రయాణములు చేయుచుందురు వేదాంత విషయములందు అభిలాష హెచ్చు. ఆలోచనాశక్తి ఎక్కువ కళాభిమానము కలిగి యుందురు.

దాన ధర్మములు చేయుదురు సంసారతాపత్రయము ఎక్కువ, ద్వికళత్ర / ద్విభర్తృ యోగమున్నది. క్రయవిక్రయాలు లాభించును. ఇతర భాషాపరిజ్ఞానము ఉండును. న్యాయ వైద్య శాస్త్రాలయందు ప్రావీణ్యము కలిగియుందురు. కవిత్వము చెప్పుదురు. 19,22,23,37 సంవత్సరాలలో విద్యలో రాణించెదరు. నావికా సంబంధమైన విద్య అనుకూలము. శరీర ఆరోగ్యము తక్కువ జఠరము మందము, దగ్గు, రొంప, ఊపిరితిత్తుల వ్యాధులు బాధించును. 40 సంవత్సరాల నుండి యోగము ఆరంభము.

ఆది, సోమ, శుక్ర వారములు 1,4,7,10,13,16,19,22,25,28,31 తేదీలు మంచివి. తెలుపు, ఆకుపచ్చ రంగులు యోగించును. జాతి ముత్యము ధరించవలయును. వెండి పాత్రలో భుజించవలయును. జనవరి, ఫిబ్రవరి, జూలై నెలలో చిక్కులు, ధనవ్యయము. శ్రీ పార్వతి దర్శనము, శ్రీ లలితా సహస్రపారాయణము శుభము.

**ద్విముఖి, ఏకాదశముఖి, గర్భగౌరి రుద్రాక్షధారణ శుభదాయకము**



## అదృష్ట సంఖ్య 3. గురు ఫలము

వీరు మంచి తెలివితేటలు కలిగి అధికారం వహించగల శక్తి సామర్థ్యములు కలిగి ఉందురు. స్వతంత్ర జీవులు ఉన్నత స్థితి వ్యక్తులతో స్నేహం చేయుదురు. దైవభక్తి ఎక్కువ తీర్థయాత్రలు చేయుదురు. ధనము నార్జింతురు విద్యాలయములు, బ్యాంకులు న్యాయవాదులు దేవస్థానములయందు పనిచేయుదురు. విద్యావిషయములలో ఆసక్తి ఎక్కువ రెండుమూడు భాషలలో ప్రావీణ్యము సంపాదింతురు జ్యోతిష్య, కవిత్వ, సాహిత్యాభిలాషులై ఉందురు. సంగీతము, చిత్రలేఖనము, నాటకములలో నిష్ణాతులు

వీరు తరచు చర్మ రోగములకు గురి అగుదురు. అజీర్తి శ్లేష్మ, పైత్య తత్వములుండును. 37 సంవత్సరములనుండి యోగం ఆరంభమగును. మంగళ, గురు శుక్రవారములు, అదృష్ట ప్రదమైనవి. 3,12,21,30 తేదీలు అనుకూలమైనవి. జాతి పుష్యరాగం ధరించవలయును. పసుపురంగు మంచిది. ఫిబ్రవరి, జూన్, సెప్టెంబర్, డిశంబర్ నెలలు మంచివి. శ్రీ దక్షిణామూర్తి దర్శనము నమక చమక రుద్రాభిషేకములు శుభము.

**త్రిముఖి, ద్వాదశముఖి, వింశతిముఖి రుద్రాక్షధారణ శుభదాయకము**



## అదృష్ట సంఖ్య 4. రాహు ఫలము

వీరికి పట్టుదల ఎక్కువ శక్తికి మించిన పనులు సాధింప ప్రయత్నించెదరు. ఇతరులకు ఉపకారం చేయుదురు. వాదప్రతివాదములు చేయుదురు. శత్రు వృద్ధి ఎక్కువ బాల్యమందు అల్లరి చిల్లరిగా ఉందురు. క్రమేణా అభివృద్ధి లోనికి వచ్చెదరు. ఇతరులను లెక్కచేయరు. స్వతంత్ర వృత్తి, జీవనము కోరుచుందురు. మత్తు పదార్థములు, మందులు ఇన్స్యూరెన్స్, రసాయన వృత్తులు అనుకూలించును. వైద్యవృత్తి వలన లాభము ఎక్కువ.

విద్యావిషయములలో ఆసక్తి ఎక్కువ. వైద్య రసాయన శాస్త్రములను అభిమానించెదరు. విదేశములకేగి విద్యనార్జింతురు. జ్యోతిష్యశాస్త్ర పరిచయముండును. హృదయము, నేత్రవ్యాది, స్ఫోటక భాదలు ఉండును. పక్షవాత భయముండును. దీర్ఘవ్యాదులు కలుగును.

31వ సంవత్సరమునుండి యోగదశ ఆరంభమగును. శని ఆది సోమ వారములు 1,2,4,7,10,11,13,16,19,20,22,25,28,29,31తేదీలు అనుకూలమైనవి. జాతి గోమేధికం ధరించిన శుభము. ఊదారంగు మంచిది. జనవరి,ఫిబ్రవరి,జూలై,ఆగష్టు నెలలు మంచివి. శ్రీ దుర్గా దర్శనము, శ్రీ దుర్గా సహస్ర పారాయణములు శుభము.

**నవముఖి, అష్టాదశముఖి, రుద్రాక్షధారణ శుభదాయకము**



## అదృష్ట సంఖ్య 5. బుధుడు ఫలము

వీరు మంచి తెలివితేటలు చురుకుదనం కలిగి ఏ అంశమునైన సులువుగా గ్రహించగలరు. వ్యాపార వ్యవహారములయందు ప్రజ్ఞ కలిగి యుందురు. బుద్ధి విశేషముచే ఇతరులను వశపరుచుకొందురు. ధనార్జన చేయుటలో నేర్పు, సులువు కలిగి యుందురు. యుక్తిగా వ్యవహరించెదరు. రెండుమూడు విధములుగా ధనార్జన చేయుదురు. కళత్ర సుఖము తక్కువ. ఏకాంత జీవనము ఇష్టము. కాంట్రాక్టులు లాభించును. ధనము ఖర్చు చేయుటలో అతి జాగ్రత్త వహించెదరు. బంగారము, వెండి వస్త్రములు పట్ల ఆకర్షితులగుదురు.

విద్యావిషయములలో ఆసక్తి తక్కువ స్వతంత్ర జీవనము పట్ల అభిలాష ఎక్కువ. ఏ విద్యలోను పరిపూర్ణత ఉండదు. జ్యోతిష్యం,వ్యాకరణం,భూగోళ, ఖగోళ విద్యలలో ప్రావీణ్యులు. 10,13,14,15,19,22,23,32 సంవత్సరములలో అభివృద్ధి కలుగును. తరచుగా నరముల బలహీనత నీరసము కలుగుచుండును. 32 సంవత్సరములు లగాయతు యోగము ఆరంభమగును.

బుధ, శుక్ర వారములు అదృష్ట ప్రదమైనవి. ఆకుపచ్చరంగు శుభము కలిగించును. జాతి పచ్చ ధరించవలయును. జనవరి, మార్చి, మే అక్టోబరు నెలలు మంచివి.

శ్రీ విష్ణు దర్శనము, శ్రీ విష్ణు సహస్ర పారాయణములు శుభము

**చతుర్ముఖి, త్రయోదశ ముఖి, ఏకోన్న వింశతి ముఖి రుద్రాక్షధారణ శుభదాయకము**



## అదృష్ట సంఖ్య 6. శుక్రుడు ఫలము

వీరు నిర్మలమైన స్వభావము కలిగి చూడముచ్చటగా నుందురు. అందరిచే ప్రేమింపబడుదురు గంభీరమైన మనస్సు కలిగి తామున్న ప్రదేశములు, గృహములను విలువైన వస్తువులతో అలంకరించెదరు. సంగీత ప్రవేశముండును. శృంగారమనిన ప్రీతి. నాట్యము శిల్ప రచన చిత్ర నిర్మాణముల యందు అభిలాష ఎక్కువ. ధనము కన్న గౌరవమునకు ప్రాధాన్యత ఎక్కువ. శత్రువులు అరుదు. న్యాయాన్యాయ విచక్షణా జ్ఞానము కలిగియుందురు. విద్య విషయములకన్న సంగీతము, కవిత్వము, సినిమా నాటక రంగములన్న ప్రీతి, వైద్యం, ఇంజనీరింగు రాణించును.

ఆయాసం, నీరసం, ఊపిరితిత్తులు, ముక్కు, తలనొప్పి భాదలు ఉండును. 33 సంవత్సరముల లగాయితు యోగం ఆరంభమగును. ఆకస్మాత్తుగా కీర్తి ప్రతిష్టలు కలుగును. విదేశీవ్యాపారము క్రయ విక్రయములు లాభించును. మంగళ, గురు, శుక్ర వారములు శుభము. 3,6,9,12,15,18,21,24,27,30 తేదీలు శుభము.

జాతివజ్రం ధరించవలయును. తెలుపు రంగు శ్రేష్టమైనది. మార్చి ఏప్రియల్, జూన్, జూలై, డిశంబర్ నెలలు అనుకూలమైనవి. శ్రీ లక్ష్మీదేవతా దర్శనము, శ్రీ లక్ష్మిసహస్ర పారాయణము శుభము.

**పంచముఖి, చతుర్ధశముఖి రుద్రాక్షధారణ శుభదాయకము**



## అదృష్ట సంఖ్య 7. కేతువు ఫలము

వీరికి మనోబలము తక్కువ ఇతరులమీద ఆధారపడుదురు. స్వేచ్ఛాజీవనము కోరుకుందురు. ధర్మకార్యములు చేయుదురు. భవిష్యత్తును గూర్చి తొందర పడుచుందురు. ఆకస్మిక ప్రయాణములు చేయుదురు. మధ్యవర్తిత్వము బాగుగా అనుకూలించును. ప్రతి అంశమును విమర్శనా దృష్టితో చూచు చుందురు. దైవభక్తి ఎక్కువ ప్రజాకర్షణ కలిగియుందురు. రాజీలు సలుపటయుందు నేర్పరులైయుందురు. పేరు ప్రతిష్టలు పొందుదురు. భూత భవిష్యద్వర్తమానములను దర్శించగలరు. మంత్ర,తంత్ర,ఇంద్ర జాల విద్యలు తెలియును. గ్రంధ రచన, శాస్త్ర సంబంధ విషయాలలో ఆసక్తి ఎక్కువ. పరిశోధనా రచనలు చేయుదురు. చిత్రలేఖనము, రసాయన శాస్త్రము, హూణ విద్య కవిత్వములయుందు ప్రావీణ్యులు, జ్ఞాపక శక్తి ఎక్కువ.

ఉష్ణశరీర, చర్మవ్యాధి, హృద్రోగ భాదలు ఉండును. వీరికి 34 సంవత్సరముల నుండి యోగము ఆరంభమగును. స్థిరాస్థిని అభివృద్ధి చేయుదురు. ఆది సోమ వారములు 1,2,4,7,10,13,16,19,20,25,28 తేదీలు యోగించును. జాతివైడూర్యం ధరించవలయును. లేత రంగులు మంచివి. మార్చి ఏప్రియల్,మే,సెప్టెంబర్,డిశంబర్ నెలలు అనుకూలము. శ్రీ సూర్య నమస్కారములు ఆచరించవలయును

**సప్తముఖి, షష్టదశముఖి రుద్రాక్షధారణ శుభదాయకము**



## అదృష్ట సంఖ్య 8. శని ఫలము

వీరు స్వశక్తి మీద ఆధారపడుదురు. ఒంటరి జీవనము కోరుకుందురు. ప్రతి విషయము నందు లోపములను ఎంచుదురు. పైకి కోప స్వభావము కలిగినను. హృదయము మంచిది. అనేక విధములైన కష్టములు, ఈతి భాదలు పొంది, అకస్మాత్తుగా అభివృద్ధిలోనికి వచ్చెదరు. మధ్యరకమైన జీవనము గడుపుదురు. నమ్మినవారి వలన మోసపోవుదురు. పరిశోధనా ప్రియులు. బంధుప్రేమ అంతగా ఉండదు. పితృమూలక చికాకులు ఉండును. స్థిరాస్తిని నష్టపోవుదురు. స్వంత విషయములకంటే ఇతరుల విషయముల పట్ల శ్రద్ధ చూపుదురు. సాహస కృత్యములు చేయుదురు.

వ్యాకరణము, రసాయనశాస్త్రము, వేదాంతము, యంత్ర నిర్మాణము మొదలగు సాంకేతిక విద్యలలో ప్రావీణ్యులై ఉందురు. వాత సంబంధ రోగములు మత్తు పదార్ధముల వలన భాదపడుదురు. 44 సంవత్సరములనుండి యోగము ప్రారంభము. శని, ఆదివారములు మంచివి 8,17,26 తేదిలు అనుకూలం.

జాతి నీలము ధరించిన శుభము, నీలము ముదురు రంగులు మంచివి. మార్చి, ఏప్రియల్, మే, ఆగష్టు, అక్టోబర్ నెలలు మంచివి. శివ దర్శనము, మహాన్యాస పూర్వక రుద్రాభిషేకములు ఆచరించవలయును.

**అష్టముఖి, సప్తదశముఖి, గణేశ రుద్రాక్షధారణ శుభదాయకము**



## అదృష్ట సంఖ్య 9.కుజుడు ఫలము

వీరికి పట్టుదల ఎక్కువ గౌరవము కొరకు పాటు పడుచుందురు. అపారమైన తెలివితేటలు కలిగి ప్రతి విషయములలోను నిర్లక్ష్యముగా ఉందురు. రహస్యములు దాచలేరు. స్త్రీలు చెప్పిన ప్రకారము నడుచుకుందురు. దైవభక్తి ఎక్కువ. మనోబలముతో అభివృద్ధిలోనికి వచ్చెదరు. అధికార గౌరవములు పొందుదురు. వ్యవసాయము లాభించును. అన్నదమ్ముల యందు అభిమానం ఎక్కువ. ప్రతి కార్యమును చక్కగా నెరవేర్చుదురు. అన్నిరకముల వారితో స్నేహ లాభములుండును.

గణిత శాస్త్రము, ఇంజనీరింగ్, వైద్య శాస్త్రములయందు ప్రావీణ్యులు, మేహసంబంధవ్యాదులు, కురుపులు, గాయములు, కుక్షి, ఉదరవ్యాధి, శ్లేష్మ చర్మరోగములుండును.

45 సంవత్సరములనుండి యోగము ప్రారంభము. వ్యవసాయ రీత్యా లాభించును. భూగృహ వ్యాపారములు లాభించును. మంగళ, గురు, శుక్రవారములు, 2,3,9,10,14,16,18,25,27 తేదీలు మంచివి. జాతి పగడము ధరించవలయును. ఎరుపు గులాబి రంగులు అనుకూలమైనవి. జనవరి, ఫిబ్రవరి, మార్చి, జూన్, జూలై, డిశంబర్ నెలలు మంచివి. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర దర్శనము, సహస్రపారాయణము శుభము.

**షణ్ముఖి, పంచదశముఖి, గౌరీశంకర రుద్రాక్షధారణ శుభదాయకము**

# ఏకవింశతి మహాదోషములు - అపవాదములు

1. **పంచాంగశుద్ధిహీన :** ఏష్యము, దుష్టగ్రహవేధ, క్రాంతులు, వైప్రా, అనుదోషములు గల రోజులు. కాని బుధ, గురులు బలముగా నున్నచో దోషము లేదు.
2. **సూర్య సంక్రాంతి :** రవి ప్రవేశమునకు **16** ఘ॥ముందు వెనుకలు, మేష, కర్కా, తులా, మకర, సంక్రమణములకు ఆయన ప్రవేశములకు 30 ఘ॥ ముందు వెనుకలు దోషము.
3. **పాపషడ్వర్గు :** లగ్న, హోర, ద్రేక్కాణ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశల యందు పాపగ్రహములు లేకుండుట.
4. **భృగుషట్కం :** ఉచ్ఛంగతుడైన శుక్రుడు 6వ యింట ఉండకూడదు. శత్రునీచ స్థానములో అస్తంగతుడైన దోషము లేదు అని కొందరందురు. కాని, నిరూపణము కానరాదు.
5. **అష్టమకుజ :** 8వ యింట కుజుడు ఉచ్ఛస్థుడైన కాకున్నను దోషమే శత్రునీచ అస్తంగతుడైన దోషము లేదనుట సరికాదు
6. **గండాంతము :** 5-6, 9-10, 10-11 తిధుల మధ్య చివరి 4 ఘడియలుగండ దోషము, ఆశ్రే, మఘ, జ్యేష్ట, మూల, రేవతి, అశ్వినుల మధ్య 4 ఘ॥ నక్షత్ర గండ దోషము. నంద తిధులకు ప్రారంభమున 2 ఘడియలు, పూర్ణ తిధులకు అంత్యమున 2 ఘడియలు గండాంతములగును.
7. **రాశిగండదోషము :** కర్కా-సింహ, వృశ్చి-ధ, మేష-మీనరాశుల మధ్య 2 ఘ॥రాశి గండ దోషము చంద్ర గురులు శుభులైనచో ఈ దోషము బాధించదు.
8. **కర్తరీ :** లగ్నాత్తు 2వ యింట వక్రగ్రహము, 12వ యింట ఋజుగ్రహము, సమ భాగములలో నున్న దోషము. 1,4,5,7,9,10,11వ యింట బుధ, గురు, శుక్రులున్న దోషము లేదు.
9. **షష్టాష్టారిఫః, సగ్రహచంద్ర దోషము :** చంద్రుడు 6,8,12వ యింట నున్నను. క్రూరగ్రహములతో కూడియున్నను. దోషము, చంద్రుడు ఉచ్ఛమిత్ర స్వక్షేత్రములందున్న దోషములేదు. 8 చంద్రదోషము అనివార్యము
10. **లగ్నాదష్టమము :** లగ్నాధిపతి 8వ యింట, జన్మలగ్న నక్షత్ర లగ్నములకు 8వ లగ్నము, 8వ యింట చంద్రుడున్నను అష్టమాధిపతి లగ్నమందున్నను దోషము. ఆయా 8 స్థానములు శుభగ్రహ వీక్షణ పరస్పర మైత్రులు కలిగినచో దోషము లేదు.
11. **అష్టమచంద్ర :** అష్టమచంద్రుడైనచో, ఆ చంద్రుడు నీచ నవాంశగతుడైనచో దోషము లేదు.
12. **వర్జ్య, దుర్ముహూర్త దోషములు :** పంచాంగములో వ్రాసిన వర్జ్య దుర్ముహూర్తకాలములు పనికిరావు.
13. **కుళికా :** ఆది 8 సోమ 2 మంగళ 12 బుధ 11 గురు 3 శుక్ర 7 శని 25 ఘ॥ తరువాత 4 ఘ॥కు కుళికాదోషము. లగ్నాత్తు చంద్రుడు 3,4,5,7,9,10 స్థానములతో ఉన్న శుభప్రదము.
14. **ఖర్జూరయోగము :** 1. పంచశలాక, సప్తశలాక, ఖర్జూర చక్రములందు (అభిజిత్తుతో)

వ్రాసిన నక్షత్రములు ఒకే రేఖపై గలవి వేధించబడును. 2. క్రూరగ్రహమునకు ముందు వెనుక నున్నవి. వేధానక్షత్రములు క్రూరాక్రాంత గలవి.

**15. ఏకార్గళ :** దుష్టయోగములైన 1. వ్యాఘా-పున, 2. శూల-మృగ, 3. పరిఘ-మఘ, 4. వ్యతీ-ఆశ్రే, 5. నిష్కం-అశ్వి, 6. గండ-మూల, 7. అతిగండ-అనూ, 8. వజ్ర-పుష్య, 9. వైధృ-చిత్ర మొ॥గా గల నక్షత్రములు మొదటి రేఖపై నున్నచో ఏకార్ధళ దోషము. సూర్యచంద్ర నక్షత్రములు 1-4, 4-1,2-3 పా॥ కానిచో దోషము లేదు.

**16. ఉత్పాత :** భూకంపములు, తోకచుక్కలు మొదలగునవి ఉత్పాత అనబడును. దాని నుండి 7 రోజుల వరకు దోషము.

**17. గ్రహణం :** గ్రహణములు సంభవించిన నక్షత్రములు ఆ పిదప 7 రోజుల వరకు దోషము అర్ధగ్రాస గ్రహణమైన 3 రోజులు మాత్రమే వదలవలెను. ఏ నక్షత్రమున గ్రహణము పట్టునో ఆ నక్షత్రము ఆరు మాసముల వరకు ముహూర్తములకు పనికిరాదు.

**18. క్రూర గ్రహ వేధ :** పాపగ్రహ, ప్రవేశ వర్జ్య రాశులు పనికిరానివి. ఆ రాశులు శుభగ్రహయుక్తమైనపుడు శుభప్రదము.

**19. అశుభ విద్ధ నక్షత్రములు :** పంచాగములోని రవే, రాక్రాం, రావే, కుక్రాం, కువే, శక్రాం, శవే మొ॥ దినమందలి నక్షత్రములు దోషములు.

**20. క్రూరగ్రహ నవాంశ :** లగ్న, నవాంశాధిపతులు, నవాంశులను చూచుచుండి నను, లగ్ననవాంశాధిపతులు పరస్పరదృష్టి,లగ్నగతులైనను,శుభ,మిత్ర,దృష్టి కలిగినను శుభప్రదము.

**21. మహావ్యతీపాత వైధృతి :** శోభ, హర్షణ, శూల, వైధృతి, వ్యతీపాత గండ అనువాటి చివర భాగములలో సూర్యచంద్ర క్రాంతి దోషము కలిగిన వ్యతీపాత దోషము. మొత్తము మీద యోచించగా లగ్న కేంద్ర, దోషములయందు గురు, శుక్ర బలములున్నచో శుభము. ముహూర్తములకు బలము నిర్ణయించునపుడు లగ్నబలము చూచుట ముఖ్యము. నైసర్గిక పాపులైన రవి, కుజ, రాహు, కేతువులు 3,6,11 స్థానములందును. శుభగ్రహములైన గురు గ్రహము లెంత బలముగానున్నను లగ్నబలము లేనిచో ప్రయోజనము లేదు. గర్భాధాన, వివాహ, ఉపనయన, అన్నప్రాశనలకు తప్ప. మిగిలిన సమస్త శుభకార్యములకు లగ్నమందు చంద్రేతర శుభగ్రహము లెన్ని వున్న అంత లగ్నబలము. వివాహేతర శుభకార్యములకు సప్తమము నుండి ముహూర్త లగ్నమును శుభులు చూచుట మంచిది. కోణము లందుండి గురుడు, షష్టమము నుండి కుజుడు. ఏకాదశము నుండి శని చూచుట మంచిదే అగును.

## ఏకోదర సంస్కార నిర్ణయము

అన్నదమ్ములకు ఒకేరీతి సంస్కారములు ఒకేసారి చేయకూడదు. కనీసము ఆరుమాసముల వ్యవధి ఉండవలెను. తప్పనిసరైన సంవత్సరాది పండుగకు ముందు ఒకరికి, తర్వాత ఒకరికి చేయుట ఆచారము కలదు. అన్నా, చెల్లెళ్లకు, ఒకే సంస్కారము, అక్కచెల్లెళ్ళకు ఒకేసారి చేయవచ్చును. కన్యాదానము చేసిన తదుపరి, కన్యను, తెచ్చుకోవలయును. అనగా పుత్రిక వివాహము తరువాత పుత్రుని వివాహము చేయవలెను. తన పుత్రికను ఇచ్చిన ఇంటిలో తన కుమారునికి కన్యను తేకూడదు. మొదటి ఇవ్వబడిన పుత్రిక జీవించి ఉండగా మరలా పుత్రికను ఇవ్వకూడదు. జ్యేష్ఠ పుత్రికా పుత్రులను విడిచి తదుపరి సంతానమునకు సంస్కారము చేయకూడదు. ఇంట వివాహ శుభకార్యానంతరము పుత్రునకు, తనకు కేశఖండనము, ఉపనయనము జరుపరాదు.



# శుభముహూర్త విషయములు



**గృహారంభం (శంఖుస్థాపన) :** తదియ, పంచమి, సప్తమి, ఏకాదశి, పూర్ణిమ, తిధుల యందును సోమ,బుధ,గురు,శుక్రవారము లందును. రోహిణి, మృగశిర, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందును, వృషభ, సింహ, వృశ్చిక, కుంభలగ్నములుమంచివి. మేష,కర్కాటక, తుల, మకరలగ్నములు మధ్యమం మిధున, కన్య, ధనుస్సు, మీనరాశులు సామాన్యము లగ్నమునకు చతుర్ధ అష్టమ శుద్ధులు ఉండాలి. ఉదయం 12 గంటల లోపునే శంఖుస్థాపనకు మంచిది. వృషభకలశచక్రశుద్ధులు కూడా కావలెను.

**గృహప్రవేశం :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి త్రయోదశి, పూర్ణిమ, తిధులు, బుధ,గురు,శుక్రవారములు, రోహిణి, మృగశిర, ఉత్తర, చిత్త, అనూరాధ, ఉత్తరాషాడ, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు, వృషభ, మిధున, కన్య, ధనుస్సు, మీనలగ్నములు మంచివి. స్థిరలగ్నం అత్యంత బలీయం, చతుర్ధ, అష్టమ శుద్ధులు, వృషభ, కలశచక్రశుద్ధిఉండాలి.

**ఉద్యోగములో చేరుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులు, అశ్విని, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, అనూరాధ, రేవతి, నక్షత్రములు, బుధ,గురు, శుక్రవారములు. శుభలగ్నాల్లో రవి, కుజులు 10,11 స్థానములలో వుండుట చాలా యోగం. ఉద్యోగాల్లో స్థిరత్వం పొంది, క్రమేపి చేయు ఉద్యోగంలో అభివృద్ధి సాధించి ప్రమోషన్లు పొందుదురు.

**యాత్రలు చేయుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిధులు సోమ, బుధ, గురు, శుక్రవారాలు అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, శ్రవణం, ధనిష్ట, రేవతి, నక్షత్రములు, మేష,వృషభ, కర్కాటక, కన్య, తుల, ధనుస్సు, మీనలగ్నములు మంచివి. మరియు ప్రయాణానికి శకునబలం, తారాబలం పంచమశుద్ధి, వారశూలలు, పంచకరహితం ఆనందాదియోగం. గౌరీపంచాంగం తప్పక చూడాలి.

**వివాహ నిశ్చయతాంబూలాలు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, ఉభయపక్షతిధులు, శుక్లపక్షంలో త్రయోదశి, పూర్ణిమతిధులు, ఆది, బుధ, గురు, శుక్ర, శనివారములు. అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, అనూరాధ. శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతి, నక్షత్రాలు. లగ్నంకు 5,9 స్థానాలలో పాపగ్రహాలు లేకుండా నిశ్చయతాంబూలాలు పుచ్చుకోవాలి.

**పెండ్లి కుమారున్ని, పెండ్లికుమార్తెను చేయుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులు. ఆది, బుధ, గురు, శనివారాలు, అశ్విని, పునర్వసు, పుష్యమి, చిత్త, స్వాతి, శ్రవణం, ధనిష్ట నక్షత్రాలు 5,9 స్థానాలు శుద్ధి చూడాలి.

**పెండ్లి పీట :** పెండ్లిపీట వెడల్పు 5", ఎత్తు 6" పొడవు 37" అంగుళములు ఉండాలి

**వివాహమునకు :** వివాహమునకు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, రోహిణి, మృగశిర, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, కర్కాటక, తుల, కన్య, ధనుస్సు, మీన లగ్నాలు. వైశాఖ, జ్యేష్ట, చైత్రమాసమున వివాహం చేయవచ్చును. సప్తమందు ఏ గ్రహం కూడా ఉండరాదు. అష్టమ శుద్ధి తప్పనిసరి.

**నవవధువు ప్రవేశము :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిధులు, బుధ, గురు, శుక్రవారాలు, అశ్వని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తరాషాడ, హస్త, స్వాతి, చిత్త, అనూరాధ, శ్రవణం, మఖ, మూల, పునర్వసు, జ్యేష్ట, ధనిష్ట, రేవతి, నక్షత్రాలు, వృషభ, మిధున, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనస్సు, కుంభ, మీనలగ్నాలు మంచివి. **వివాహం జరిగిన 16 రోజులలోపున తిధి, వార నక్షత్రాలను పాటించక గృహప్రవేశమును చేయించవచ్చును.**

**గర్భాదానము (శోభనం) :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, తిధులు, సోమ, బుధ, గురు, శుక్రవారాలు, రోహిణి, మృగశిర, పునర్వసు, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, నక్షత్రాలు, వృషభ, కర్కాటక, కన్య, తుల, ధనుస్సు, మీన లగ్నాలు. లగ్నశుద్ధి, అష్టమ శుద్ధి, తప్పనిసరి. పంచపర్వములు, వ్రతదినాలు, సంధ్యాసమయం, శ్రాద్ధదినాలు, పనికిరావు. వివాహం అయిన 16 రోజులలో చేసిన యెడల ముహూర్తం అవసరం లేదు.

**పుంసవన సీమంతము :** విదియ, తదియ, పంచమి, సప్తమి, త్రయోదశి, పూర్ణిమ, తిధులు, బుధ, గురు, శుక్రవారాలు రోహిణీ, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, ఉత్తర, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, పునర్వసు, అనూరాధ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతి నక్షత్రాలు. మేష, మిధున, తుల, ధనుస్సు, కుంభలగ్నాలు, పుంసవనమునకు 3వ నెల సీమంతమునకు 5,7,8,9 నెలలు మంచివి.

**స్త్రీలు ఆభరణములు, నూతన వస్త్రములు ధరించుటకు :** అశ్వని, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ధనిష్ట, రేవతి, నక్షత్రములయందు బుధ,గురు, శుక్రవారములందు వెండి, బంగారు, ఆభరణములు, నూతన వస్త్రములు, ధరించుటకు మంచిది. సోమ, మంగళవారములందు సౌభాగ్యవత్తులైన స్త్రీలు ఆభరణములు, నూతన వస్త్రములు ధరించరాదు.

**గర్భిణీ స్త్రీ ధర్మములు :** గర్భవతి అయిన స్త్రీలు యీ క్రింది నియమములు తప్పనిసరిగా పాటించవలెను. ముత్తైదువులను, పూజించాలి. ఇష్టదైవమును భగవన్నామమును నిత్యం పూజించాలి. శుభప్రదమైన ఆభరణములు ధరించాలి. 4,6,8 మాసములందు ప్రయాణములు చేయరాదు. గర్భిణీ స్త్రీ ఏ వస్తువులను కోరునో ఆ వస్తువులను వెంటనే తెచ్చి ఇవ్వవలెను. సముద్రస్నానం, చెట్లు నరుకుట, గృహారంభ, శంఖుస్థాపనలు చేయరాదు. మైలను తాకరాదు. శోకించరాదు. సూర్య చంద్రగ్రహణములందు మాత్రం జాగ్రత్తగా ఉండేది. పరుండి మాత్రమే ఉండవలెను.

**మొదటి కాన్పుకు తీసుకొనువెళ్ళుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, తిధులు. సోమ, బుధ, గురు, శనివారాలు శుభనక్షత్రాలలో గర్భిణిస్త్రీకి తారాబలం సరిపోయే విధంగా చూసి, వారశూలాలు చూచుకొని తీసుకొని వెళ్ళవలెను. కుటుంబ ఆచారముబట్టి తీసుకువెళ్ళాలి. మౌఢ్యమి, శూన్యమాస దోషములు లేవు

**బాలింతస్నానమునకు :** ఆది,మంగళ, గురువారాలు మంచివి. అశ్వని, రోహిణి, మృగశిర, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు మంచివి. 11వ రోజున స్నానం చేయించాలి.

**శిశువునకు ఊయలలో వేయుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, తిధులు, సోమ,బుధ,గురు,శుక్రవారాలు, అశ్వని, రోహిణి,మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, అనూరాధ, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రాలు. వృషభ, మిధున, కర్కాటక, కన్య, తుల, ధనుస్సు, మీనలగ్నాలు, అష్టమశద్ధి తప్పక చూడవలెను.

**శిశువునకు మొలత్రాడు కట్టుటకు :** శిశువునకు వెండి లేదా బంగారపు మొలత్రాడును పురిటిశుద్ధి రోజునలేదా 5వ నెల యందు కట్టవలెను. మొలత్రాడునకు నల్లపూసలు, రాగికాణి, శిశువు యొక్క పురిటిసమయమందు తీసిన బొడ్డు కట్టినచో గాలి, ధూళి, దిష్టి, దోషాలు తొలగును.

**బిడ్డను ఇల్లు కదుపుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులు. అశ్వని, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, అనూరాధ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాడ, రేవతి నక్షత్రాలు. మేష, వృషభ, కర్కాటక, తుల, ధనుస్సు, మీనలగ్నాలు, సోమ, బుధ, గురు, శుక్రవారాలు, మంచివి. శిశువు పుట్టిన 3వ నెలలో ముందుగా దేవాలయమునకు తీసుకొని వెళ్ళి ఆతర్వాత మేనమామ ఇంటికి తీసుకొని వెళ్ళాలి.

**పురుడు తరువాత శిశువుతో అత్తవారింటికి వెళ్ళుట :** శిశువుకు 3వ నెలగాని, 5వ నెలగాని, ఆపై 7,9,11 నెలల్లో అత్తవారింటికి వెళ్ళవచ్చును. విదియ, తదియ, చవితి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులు. సోమ,బుధ, గురు, శనివారములు. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాడ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు. తారాబలము, వారశూల, ఆనందాది యోగములు తప్పక చూడాలి. తారాబలము మాత్రం తల్లికి, శిశువుకు ఇద్దరుకూ సరిపోవాలి. **శూన్యమాసములు, గురు, శుక్రమూఢములు పనికిరావు.**

**నామకరణం :** ఈ కార్యక్రమమును పురిటి శుద్ధి అనంతరం బారసాల రోజున అనగా 11,21,29 రోజులలోగాని 3వ నెలలో గాని పేరు పెట్టాలి. శుభనక్షత్రాలు, శుభతిధులు చూచుకోవాలి. **శూన్యమాసము, మూఢములయందు చేయరాదు.**

**కేశఖండనము (పుట్టు వెంట్రుకలు) :** కేశఖండన విషయంలో తరతరాలుగా వస్తున్న ఆచారం, సాంప్రదాయాలను చూడవలెను. ఎవరికి ఏ దేవాలయం అయితే వారు అక్కడ కేశఖండన కార్యక్రమాన్ని ఆనవాయితీగా నిర్వహించాలి. దీనిని ముఖ్యంగా విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, తిధులు, సోమ, బుధ, గురువారాలు, అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, శ్రవణ, ధనిష్ట, శతభిషం, రేవతి, నక్షత్రాలు, వృషభ, మిధు.న, కర్కాటక, కన్య, ధనుస్సు, మీనలగ్నాలు గురుబలం అష్టమ శుద్ధి, తప్పనిసరి 6,7,8,10 నెలల్లో జరిపించాలి.

**అన్నప్రాశన :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులు, సోమ, బుధ, గురు, శుక్రవారాలు, అశ్వని, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రాలు, వృషభ, మిధున, కన్య, కర్కాటక, ధనుస్సు, మీన లగ్నాలలో అన్నప్రాశన జరిపించినా అన్నివిధాలుగా ఆరోగ్యంగా జీర్ణశక్తి కలిగిఉంటారు. లగ్న శుద్ధి, దశమ శుద్ధి కావలెను. పురుషులకు సరినెల, స్త్రీలకు బేసి నెల చూడాలి.

**చెవులు కుట్టుటకు (కర్ణవేధ) :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, తిధులు, సోమ, బుధ, గురు, శుక్రవారాలు, అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రాలు వృషభ, మిధున, కర్కాటక, కన్య, ధనుస్సు, మీన లగ్నములు అష్టమ శుద్ధి గురుబలం ఉండాలి. 6,7,8 నెలల్లో జరిపించాలి.

**ముక్కు కుట్టుటకు :** శుభలగ్నాలలోను, శుభనక్షత్రాలలోను,శుభతిధులను చూచుకొనిముక్కు కుట్టుట కార్యక్రమం నిర్వహించాలి.

**ఉపనయనము :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిధులు, కృష్ణపక్షమున విదియ, తదియ, తిధులు, బుధ, గురు, శుక్రవారాలు, అశ్వని, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూలా, పూర్వాషాడ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రాలు, వృషభ, మిధున, కర్కాటక, కన్య, ధనుస్సు, మీనలగ్నాలు అష్టమశుద్ధి, చూడాలి. మీన, చైత్రం దీనికి మంచిది. గ్రహబలం చాలా ముఖ్యం తల్లిదండ్రులకు తారాబలం చూడాలి. కేంద్రము నందు పాపగ్రహములుండరాదు.

**యజ్ఞోపవీతధారణ (జంధ్యము వేసుకొనుట) :** శ్రావణ, పౌర్ణమికి, గ్రహణం విడిచిన తరువాత, జ్ఞాతులు మరణించిన మైలశుద్ధి, పురిటిమైలశుద్ధి అయిన వెంటనే క్రొత్త జంధ్యము ధరించాలి. ప్రతినెల పౌర్ణమి నందు ధరించుట శుభము

**దత్తతస్వీకారం :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిధులు, ఏకాదశి, త్రయోదశి తిధులు శుభం. బుధ, గురు,శుక్రవారాలు శుభం. రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, ధనిష్ట, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు మంచివి. లగ్నాలలో శుభగ్రహాలు ఉండాలి. లగ్నశుద్ధి, లగ్నానికి శుభగ్రహవీక్షణ ఉండాలి. పంచమంలోపాపగ్రహాలుగాని వారి దృష్టులు గాని ఉండరాదు.



# వ్యాపార సంబంధ శుభముహూర్త విషయములు



**బట్టల దుకాణములు ప్రారంభించుటకు :** అశ్వని, రోహిణి, పునర్వసు, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు. విదియ, తదియ, పంచమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిథులునూ, సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి.

**బంగారు, వెండి నగల వ్యాపారమునకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, తిథులు, అశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త,చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు, సోమ, బుధ, గురు, శుక్రవారములందు లాభదాయకం.

**కిరాణా దుకాణము :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిథులందునూ, అశ్వని, రోహిణి, మృగశిర, పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర, రేవతి, ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములందు లాభదాయకము.

**ఇనుము స్టీలు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిథులు, శుక్లపక్షచతుర్థశి మంచిది. శని, సోమ, బుధవారములు, అశ్వని, రోహిణి, మృగశిర, పుష్యమి, అనూరాధ, స్వాతి, ఉత్తరాభాద్ర నక్షత్రములు మంచివి.

**ఎలక్ట్రికల్ షాపులు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, పూర్ణిమ, తిథులందునూ, మంగళ, బుధ, శుక్రవారములందునూ, రోహిణి, మృగశిర, పుష్యమి, హస్త, అనూరాధ, ఉత్తరాబాధ్రలుమంచివి.

**ఫ్యాన్సీ షాపులు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, తిథులు, సోమ, బుధ, గురు, శుక్ర వారములు, రోహిణీ, మృగశిర, పుష్యమి, హస్త, చిత్త, శ్రవణం, ధనిష్ట నక్షత్రములు మంచివి.

**మందుల షాపులు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, తిథులు, ఆది, మంగళ, బుధవారములు, రోహిణి, మృగశిర, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, ధనిష్ట, నక్షత్రములు మంచివి.

**పండ్లు దుకాణములు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిథులందునూ, సోమ, బుధ, గురు, శుక్రవారములు, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములందు లాభదాయకము.

**స్టేషనరి దుకాణములు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిథులందునూ, సోమ, బుధ, గురు, శుక్రవారములు, రోహిణి, మృగశిర, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ఉత్తరాభాద్ర నక్షత్రములందు ప్రారంభించిన ధనలాభములు కలుగును.

**రేడియో, టి.వి. వాచ్ దుకాణములు :** పంచమి, సప్తమి, దశమి, తిథులందునూ, సోమ,బుధ, గురు, శుక్ర, శనివారములందునూ, రోహిణి, మృగశిర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ఉత్తరాభాద్ర నక్షత్రములందు శుభము.

**గృహఫర్నీచర్ దుకాణములు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిథులందునూ, సోమ,బుధ, గురు, శుక్రవారములు, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతులు, లగ్నబలం కూడా వుంటే లాభదాయకముగా నుండును.

**రైసు మిల్లులు ప్రారంభించుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, తిథులందునూ సోమ, బుధ, గురు, శుక్రవారములందునూ, అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములందునూ, స్థిరలగ్నములందునూ చతుర్ధ, అష్టమ, శుద్ధులుకావలెను.

**సినిమా, ఫిలిండిస్ట్రిబ్యూషన్ వ్యాపారమునకు :** సోమ, బుధ, గురు, శుక్రవారములు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిథులందున్నూ, అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, స్వాతి, అనూరాధ, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములందునూ సప్తమశుద్ధి, శుక్రుడు బలీయముగా నున్నయెడల ఈ వ్యాపారమందు అధికలాభములు.

**సైకిల్, మోటారుసైకిళ్ళ వ్యాపారమునకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిథులు మంగళ, బుధ, గురు, శుక్రవారములందునూ, అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, స్వాతి, అనూరాధ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందునూ స్థిరలగ్నములు, మేష, వృశ్చికము కూడా బలీయమైనవి.

**హోటల్ వ్యాపారమునకు :** విదియ, తదియ, సప్తమి, దశమి, ఏకాదశి, తిథులు, బుధ, గురువారములందు అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములందునూ శుభలగ్నములందుచేసిన లాభదాయకము, తృతీయ శుద్ధి మంచిది.

**చిట్‌ఫండ్ వ్యాపారమునకు :** తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, తిథులు, బుధ, గురువారములందు, అశ్వని, రోహిణి, మృగశిర, ఉత్తర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందునూ, వృషభ, మిధున, కర్కాటక, తుల, ధనుస్సు, మీనలగ్నములు, సప్తమందు బలీయమైన శుభగ్రహం మంచిది.

**పుష్పముల దుకాణము :** సోమ, గురు, శుక్రవారములు, రోహిణి, మృగశిర, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, ఉత్తరాషాడ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి మంచివి.

**ఫైనాన్స్ వ్యాపారమునకు :** అష్టమశుద్ధితో కూడిన లగ్నమందునూ, స్వాతి, పునర్వసు, పుష్యమి, ధనిష్ట, శ్రవణం, శతభిషం, నక్షత్రములందునూ చరలగ్నములందునూ 5,9 స్థానములందు శుభలుండగా అప్పులుయిచ్చేది. మంగళవారం, సంక్రమణదినమందు, హస్తతో కూడిన ఆదివారం అప్పు తీసుకోకూడదు.

**పుస్తకముల వ్యాపారమునకు :** వృషభ, మిధున, కర్కాటక, సింహ, తుల, ధను, మీన, లగ్నములు, సోమ,బుధ,గురు,శుక్ర వారములు, విదియ,తదియ,పంచమి,సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిథులు, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర మంచివి.

**లిక్కర్ వ్యాపారమునకు :** మత్తుపానీయములు, లిక్కర్ల వ్యాపారమునకు మేష, వృషభ, కర్కాటక, తుల, ధనుస్సు, మకర, కుంభ, మీన లగ్నములందునూ, మంగళ, శని, ఆదివారములందునూ విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, పూర్ణిమ, తిథులందునూభరణి, ఆరుద్ర, ఆశ్రేష, మఖ, పుబ్బ, జ్యేష్ట, మూల, పూర్వాషాడ, ఉత్తరాభాద్ర నక్షత్రములందు మంచిది.



# గృహ సంబంధ వస్తువులు
## శుభముహూర్త విషయములు



**బంగారం, వెండి, స్టీలు, పాత్రలందు భుజించుటకు :** బుధ, గురు, శుక్రవారములందునూ, అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తర, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రేవతీ నక్షత్రములందునూ, అమృతయోగమునందునూ, బంగారం, వెండి, స్టీలు, పాత్రలందు భోజనముచేయుటకు మంచిది.

**క్రొత్తచెప్పులు ధరించుటకు :** బుధ, శని, ఆదివారములందునూ, కృత్తిక, ఆరుద్ర, మృగశిర, మఖ, పుబ్బ, ఆశ్లేష, చిత్త, విశాఖ, జ్యేష్ట, మూల, పూర్వాషాడ, పూర్వాభాద్ర, రేవతి, నక్షత్రములందునూ చెప్పుల దుకాణం ప్రారంభించుటకు, క్రొత్తచెప్పులు కొనుటకు ధరించుటకు చర్మంతో తయారుచేసే పనులు ప్రారంభించుటకు చాలా మంచిది.

**కార్లు, సైకిళ్ళు, లారీలు, మొదలగు క్రొత్త వాహనములు కొనుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, శుద్ధఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ, తిధులందునూ, సోమ, బుధ, గురు, శుక్రవారము లందునూ, అశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ట, శ్రవణం, నక్షత్రములందునూ, వృషభ, మిధున, కర్కాటక, కన్య, తుల, మీనలగ్నములు అష్టమ శుద్ధి పగటి భాగమునందు మంచిది. రాత్రియందు కూడదు.

**మంచమునకు నవ్వారు, నులక వేయుటకు :** ఆదివారం–లాభము, సోమవారం–సుఖదాయకం, మంగళవారం–సంతానసౌఖ్యం, బుధవారం–రోగభయం, గురువారం–ధనప్రాప్తి, కుటుంబసౌఖ్యం, శుక్రవారం–లక్ష్మీప్రాప్తి, సుఖం, శనివారం–రోగపీడలు, మృత్యుభయము కలుగును.

**కుర్చీలు, మంచము, టేబిల్స్ వాడుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులందునూ బుధ, గురువారములందునూ, అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వస్తు, పుష్యమి, హస్త, చిత్త, ఉత్తర, స్వాతి, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు చాలా మంచిది.

**గ్యాస్‌స్టౌవ్, ఫ్రిజ్, మిక్సీగ్రైండర్, యిత్యాది వస్తువులు వాడుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులందునూ, మంగళ, బుధ, గురు, శుక్రవారములందునూ, కుజహోరలో, వ్యర్జం, దుర్ముహూర్తములేకుండా ఉపయోగించియెడల ఆ వస్తువు త్వరగా పాడవదు.




# విద్యా సంబంధ ముహూర్తములు




**అక్షరాభ్యాసం :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిథులు, అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఆరుద్ర, హస్త, చిత్త, స్వాతి, శ్రవణం, రేవతినక్షత్రములు ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు మేష, కర్కాటక, తుల, మకర, మీనలగ్నాలు శుభం. ఉత్తరాయణంలో 5వ సం॥రలో చేయాలి. అష్టమ శుద్ధి తప్పనిసరి **గురు శుక్రమూఢములలో చేయరాదు.**

**గణిత శాస్త్ర, కంప్యూటర్ విద్యలకు :** రోహిణి, ఆరుద్ర, పుష్యమి, హస్త, అనూరాధ, శతభిషం, పూర్వాభాద్ర, రేవతి, నక్షత్రాలు, బుధ, గురువారాలు, మిక్కిలి మంచివి. ఈ శుభఘడియలలో గణిత, కంప్యూటర్ విద్యను అభ్యసించిన అన్నివిధాలుగా యోగిస్తుంది.

**వ్యాకరణం నేర్చుకోవడానికి :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిథులు. అశ్వని, రోహిణి, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, నక్షత్రాలు. సోమ, బుధ, గురు,శుక్రవారాలు శుభం.

**వైద్య విద్యలకు :** విదియ, తదియ, పంచమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ, తిథులు ఈ తిథులకు అశ్వని, రోహిణి, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త,స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు ఉన్నప్పుడు, ద్విస్వభావరాశుల లగ్నమందు అయినా మిక్కిలిశుభకరం.

**భాషా విద్యాభ్యాసాలకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, తిథులు, ఆది, మంగళ, శనివారాలు, భరణి, కృత్తిక, ఆరుద్ర, మఖ, పుబ్బ, విశాఖ, జ్యేష్ట పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శతభిషం, పూర్వాభాద్ర, రేవతి నక్షత్రాలు మంచివి.

**న్యాయశాస్త్ర అభ్యాసాలకు :** అశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, స్వాతి, శ్రవణం, హస్త, శతభిషం, నక్షత్రాలు సోమ, మంగళ, బుధవారాలు మంచివి.

**ధర్మశాస్త్ర, అర్థశాస్త్ర పురాణాదివిద్యలకు :** అశ్వని, మృగశిర, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ధనిష్ట, శతభిషం, రేవతి, నక్షత్రాలు మంచివి.

**సంగీతం, నాట్యాలకు :** సోమ, బుధ, గురు, శుక్రవారాలు ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాబాద్ర, అనూరాధ, పుష్యమి, హస్త, జ్యేష్ట, శతభిషం, ఆరుద్ర, ధనిష్ట, రేవతి నక్షత్రాలు మంచివి.

**తబలా, వీణ మొదలగు వాయిద్యాలకు :** అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త,అనూరాధ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతి నక్షత్రాలు బుధ, గురు, శుక్రవారాలు పంచమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిథులు మంచివి.

**చిత్రలేఖనమునకు :** ఆది, సోమ, మంగళ, శుక్రవారాలు విదియ, పంచమి, సప్తమి, ఏకాదశి, తిథులు, అశ్వని, భరణి, రోహిణి, మృగశిర, పునర్వసు, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, ఉత్తరాషాఢ, శ్రవణం, పూర్వాభాద్ర, రేవతి నక్షత్రాలు శుభం.



# వ్యవసాయ విషయములు

**క్రొత్తగాభూమిసాగు చేయుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిధులందునూ, ఆది, మంగళ, బుధ, శుక్రవారములందునూ, అశ్వని, రోహిణి, మృగశిర, మఖ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాడ, ధనిష్ట, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములందు భూమిలో క్రొత్తగా సాగుచేయుటకు మంచిది.

**ఏరువాక, దుక్కిదున్నుటకు :** ఆది, మంగళ, గురువారము లందునూ, అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, హస్త, చిత్త, విశాఖ, అనూరాధ, మూల, పూర్వాషాడ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములందునూ, వృషభ, మిధున, కన్య, ధనుస్సు, మీనలగ్నములందునూ, దుక్కుదున్నుట ప్రారంభించుటకు మంచిది. మేషలగ్నమునందు పశునష్టము, కర్కాటకమునందు అధికవర్షముల వలన పంటనాశనము. సింహలగ్నమునందు క్రిమికీటకాదులభయం, తులయందు, ప్రాణభయం, మకరమునందు పంటనాశనము, కుంభమునందు, దొంగల భయం.

**విత్తనములు చల్లుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులందునూ, అశ్వని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములందునూ విత్తనములు చల్లిన బాగుగా మొలకెత్తును. యింకనూ ఏ రంగు గల విత్తనములు ఆరంగుగల గ్రహవారములందు చల్లిన శుభం కల్గును. ఉదాహరణకు తెల్లవిత్తనములు సోమవారం చల్లవలెను.

**పొలిపెట్టుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిధులందునూ, ఆది, గురు, శుక్రవారములందునూ, అశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, మఖ, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు మంచిది.

**వరి ఆకు ఊడ్చుటకు :** చవితి, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి తిధులందునూ, సోమ, బుధ, గురు, శుక్రవారములందునూ, అశ్వని, రోహిణి, నక్షత్రములలందు చాలా మంచిది.

**ధాన్యం పోలం నుండి ఇంటికి తెచ్చుటకు :** ఇంటి యజమానితారాబలం, చంద్రబలం చూసుకొని వర్జ్యం దుర్ముహూర్తము లేకుండా, శుభగ్రహ హోరలలో క్రొత్త ధాన్యములు ఇంటికి తెచ్చుకోవలెను.

**ప్రతి, పొగాకు తోటలు వేయుటకు :** అశ్వని, భరణి, మృగశిర, పుష్యమి, ఆరుద్ర, హస్త, స్వాతి, రేవతి నక్షత్రాలందునూ, ఆది, బుధ, గురు, శుక్రవారాలు ఆ సంవత్సరంసస్యాధిపతి, అయిన వారమునందు వేయుటమంచిది. ఈ విధంగా విత్తనాలు వేయుట వల్ల పంటలు బాగా పండి, అధిక దిగుబడులు వచ్చును. క్రిమికీటకాలబాధలుకూడా తగ్గి పంట బాగా పండి చేతికి వచ్చును.

**కొబ్బరి, అరటి, మామిడి తోటలు వేయుటకు :** తదియ, పంచమి, నవమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ, తిధులు బుధ, గురు, శుక్రవారాలు, అశ్వని, పంచమి, నవమి, దశమి, ఏకాదశి, అనూరాధ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు శుభం. ఈ విధంగా ఈ తోటలు వేసిన సకాలంలో పంట పండిచేతికి వచ్చును.

**వరి, మొక్కజోన్న, వేరుశనగ, ప్రొద్దుతిరుగు పంటలు వేయుటకు :** విదియ, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిధులు. ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారాలు. అశ్వని, భరణి, రోహిణి, ఆరుద్ర, పుష్యమి, హస్త, స్వాతి, మఖ, అనూరాధ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు మేష, వృషభ, కర్కాటక, తుల, ధనుస్సు, మీనలగ్నాలు మంచివి. ఈ విధంగా వ్యవసాయం చేయటంవలన అధికమైన దిగుబడులు వచ్చి, మంచి ఆదాయం కలుగును.

**చెరుకు, గోధుమ, ఆయిల్‌ఫామ్, తమలపాకు, తోటలు వేయుటకు :** ఆది, మంగళ, గురు, శుక్ర, శనివారాలు, మేష, వృషభ, కర్కాటక, తుల, ధనుస్సు, మకర, మీనలగ్నములు, అశ్వని, మఖ, మూల, భరణి, పుబ్బ, పూర్వాషాడ, కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాడ, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాలు శుభప్రదం. ఈ విధంగా ముహూర్తం నిర్ణయించుకొని ఈ రకాల పంటలు వేసిన పంటలు బాగాపండి, క్రిమికీటకాల వలన ఇబ్బందులు తొలగి, అధికమైన దిగుబడి వచ్చి మంచిరేటు పలికి ధనదాయం బాగుండును.

**మిరప, పసుపు, అల్లం, ఉల్లి, వెల్లుల్లి పంటలు వేయుటకు :** ఆది,మంగళ, బుధ, గురు, శనివారాలు, మేష, మిధున, కర్కాటక, కన్య, వృశ్చిక, మకరకుంభలగ్నాలు అశ్వని, మఖ, మూల, రోహిణి, హస్త, శ్రవణం, పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర, మృగశిర, చిత్త, ధనిష్ట నక్షత్రాలు మిక్కిలిశేషం. ఈ విధంగా చూచుకొని పంట వేసిన అధిక దిగుబడి వచ్చి ధనదాయం కలుగును.

**వంగ, బెండ, టమాటో, దొండ మొ॥ పంటలు వేయుటకు :** అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, ఉత్తర, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, మఖ, మూల, పుబ్బ, పూర్వాషాడ, ఉత్తరాషాడ, నక్షత్రాలు మిక్కిలి శుభఫలాల్ని ఇస్తాయి. ఈ విధంగా వ్యవసాయం చేసిన పంటలు బాగా పండిరైతులకు ధనం లాభం.

**చిక్కుడు, కాకర, దోస, పొట్ల, బీర, గుమ్మడిపంటలు వేయుటకు :** బుధ, గురు, శుక్రవారాలు, అశ్వని, భరణి, పుబ్బ, విశాఖ, రోహిణి, మృగశిర, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, పూర్వాషాడ, ఉత్తరాషాడ, శ్రవణం, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలు మంచివి. సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిధులు బుధ, గురు, శుక్రవారాలు, రోహిణి, మృగశిర, పునర్వసు, ఉత్తర, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు, వృషభం, కర్కాటక, సింహం, తుల, వృశ్చిక, ధనుస్సు, కుంభలగ్నాలలో విత్తనాలు వేసినలాభదాయకంగా ఉండి పంట అధిక దిగుబడివచ్చును.

**ఖర్జూర, ద్రాక్ష, సీతాఫలం, రేగు పంటలు వేయుటకు :** బుధ, గురు,శుక్రవారాలు, శుభతిధులందునూ, అశ్వని, మృగశిర, పుష్యమి, హస్త, అనూరాధ, మూల నక్షత్రాలలో మొక్కలను వేసిన పంటలు బాగా పండి, ధనలాభము కలుగును.

**జామ, బత్తాయి, నిమ్మ, దానిమ్మ కమలాల పంటలు వేయుటకు :** బుధ, గురు, శుక్ర, శని, ఆదివారాలు శుభతిధులు. అశ్వని, భరణి, రోహిణి, ఆరుద్ర, పునర్వసు, ఆశ్లేష, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, పూర్వాషాడ, ఉత్తరాషాడ, శ్రవణం, ధనిష్ట, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలలో మొక్కలు వేసిన పంటలు బాగాపండి రైతులకు మంచిధనాదాయం కలుగును.

**కరివేపాకు, బొప్పాయి, మునగ పంటలు వేయుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, పూర్ణిమ, తిధులు, మేష, వృషభ, కర్కాటక, సింహ, తుల, కుంభ, మీనలగ్నాలు, అశ్వని, మఖ, మూల, భరణి, పుబ్బ, పూర్వాషాడ, పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర, ఆశ్లేష, జ్యేష్ట, రేవతి, నక్షత్రాలు సోమ, బుధ, గురు, శుక్రవారాలు మిక్కిలి శుభప్రదం.

**చెరువులో చేప, రొయ్య విత్తనం (సీడ్) వేయుటకు :** విదియ, తదియ, చవితి, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ, తిధులు. మేష, వృషభ, మిధున, కర్కాటక, తుల, ధనుస్సు, మీనలగ్నములు, అశ్వని, భరణి, రోహిణి, మృగశిర, పునర్వసు, ఆశ్లేష, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, పూర్వాషాడ, ఉత్తరాషాడ, శ్రవణం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములలో రొయ్య, చేపవిత్తనం వేసిన మంచి దిగుబడి వచ్చి అధిక లాభాలు పొందుతారు.



# పశుసంబంధ విషయములు



**పశువులశాల వేయుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిథులు. అశ్వని, మృగశిర, పుష్యమి, హస్త, మూల, పూర్వాభాద్ర, నక్షత్రములు సోమ, బుధ, గురు, శుక్రవారములు. పశువులశాలవేయుటకు మంచిది. పుష్యమి, నక్షత్రమున గురువారం కలసిన రోజున వృషభలగ్న, వృషభనవాంశయందు పశువులదొడ్డివేసిన మృగ, చోరభయముకలుగక క్షేమముగా యుండును.

**పశువులను కొనుటకు :** ఆది, గురు, శుక్రవారములందు, అశ్వని, అనూరాధ, మఖ, మృగశిర, పునర్వసు, స్వాతి, చిత్త, మూల, నక్షత్రములందునూ, ఆది, మంగళ, శనివారములందు తెచ్చుటకు శుభప్రదముగా నుండును.

**పశువులను క్రొత్తగా తెచ్చుటకు :** భరణి, కృత్తిక, ఆరుద్ర, అనూరాధ, మఖ, మృగశిర, పునర్వసు, స్వాతి, చిత్త, మూల నక్షత్రములందునూ, ఆది, మంగళ, శనివారములందు తెచ్చుటకు శుభప్రదముగా నుండును.

**పశువులను అమ్ముటకు :** సోమ,బుధ, గురువారములందును, అశ్వని, మృగశిర, ఆశ్లేష, మఖ, హస్త, విశాఖ, జ్యేష్ట, పూర్వాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర నక్షత్రములందుమంచిది.

**పశువులనుబంధమువేయుటకు :** ఆది,గురు,శుక్రవారములందు, అశ్వని, మృగశిర, పుష్యమి, పుబ్బ,మూల, రేవతి, నక్షత్రములందునూ మంచిది.

**పశువులను పశువులశాలలో కట్టుటకు :** అశ్వని, మృగశిర, పుష్యమి, హస్త, మూల, పూర్వాభాద్ర, నక్షత్రములందు క్రొత్తగా పశువులను కట్టిన పశువృద్ధి కలుగును.

**దూడలను దుక్కికిమప్పుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, తిథులందునూ, అశ్వని, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతి, నక్షత్రములందు, ఆది, సోమ, గురు, శుక్రవారములందు మంచిది.

**క్రొత్తగా పశువులను కాడి పూన్చుటకు :** అశ్వని, భరణి, రోహిణి, పునర్వసు, హస్త, విశాఖ, జ్యేష్ట, శతభిషం, రేవతి, ఆది, గురువారములందు మంచిది.

**పోతులను పూన్చుటకు :** చవితి, అష్టమి, నవమి, చతుర్థశి, అమావాస్య, తిథులందునూ, భరణి, రోహిణి, చిత్త, ఉత్తర, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర, నక్షత్రములందు శని, ఆదివారములందునూ పున్చుటకు మంచిది.

## గృహప్రవేశవిషయమై చక్రశుద్ధి (అభిజిత్తుతో సహా)

| వృషభ చక్రం : రవినక్షత్రంలగాయితు | | కలశచక్రం : రవి ఉన్న నక్షత్రం లగాయతు | |
|---|---|---|---|
| 3 మృత్యువు | 18 ధనం | 1 శిరచ్ఛేధం | 17 నిర్ధనం |
| 7 దుర్దశ | 22 ధాన్యం | 5 ప్రవాసం | 21 గర్భస్రావం |
| 11 ధైర్యం | 25 సంపద | 9 అభయం | 24 లక్ష్మీప్రాప్తి |
| 14 భ్రమణం | 28 పశువృద్ధి | 13 ధాన్యం | 27 ఆయుష్యం |

# సుముహూర్త సుధానిధి

బ్రహ్మ సృష్టిరచన ఎంతో అధ్భుతమైనది. ఈసృష్టిలో కోటాను కోట్ల నక్షత్రమండలాలోని ఒక సూర్యమండలంలో, సూర్యుని చుట్టూ భ్రమిస్తున్న గ్రహరాసులలో భూగ్రహం మీద 33 లక్షల జీవరాసుల్లో మానవజన్మ ఉత్కృష్టమైనది. బ్రహ్మ తన సృష్టి రచనా వైభవాన్ని అర్ధంచేసుకునే శక్తిని ఒక్క మానవునికి మాత్రమే ప్రసాదించడం జరిగినది. అందులో భాగంగా అనేక శాస్త్రాలు నిర్మించడమైనది.

సర్వశాస్త్రాలకు తలమానికం జ్యోతిషం (జ్యోతిషం ఊర్ధ్వ నిశ్చితమ్). అట్టి జ్యోతిష శాస్త్రానికి కాలమే ప్రత్యక్ష నిదర్శనం. కాలగణనమే జ్యోతిషం. కాల గణణాన్ని అర్ధం చేసుకునే మార్గమే పంచాంగము. పంచాంగమనగా 1.తిధి, 2.వారం, 3.నక్షత్రం, 4.యోగం, 5.కరణం అనే విషయం తెలిసిందే.

మానవ జీవనం మనుగడకు కాలగమనాన్ని అనుసరించడంలో పంచాంగం మనకు తోడ్పడుతుంది. పంచాంగములోని 5 అంగాలను చక్కగా పరిశీలించి అందులోని మంచి చెడ్డలను అవగాహన చేసుకొని శుభపలితాలను పొందవలసి ఉంటుంది. అట్టి కాల వినియోగాన్ని సుముహూర్తంగా నిర్ణయించడం జరిగింది.

సుముహూర్త నిర్ణయంలో తిధి,వార,నక్షత్ర,యోగ,కరణాలు అత్యంత ప్రాధాన్యత కలిగి ఉన్నాయి. ఒక్కోక్క అంగం ప్రత్యేకించబడిన శుభ ఫలితాల నొసంగుతాయి. వాటిని బాగుగా పరిశీలించి వాడుకొనవలసియున్నది. ఈ విషయాలను మహర్షి ప్రోక్తంగా నిర్మించబడిన జ్యోతిష శాస్త్రం మనకు అందిస్తుంది.

ఈ జ్యోతిషశాస్త్రాన్ని సామాన్య జనావళికి ఉపయుక్తంగా వారి సాధారణ జీవనానికి అవసరమైన సూచన,సలహాలను అందించవలసిన బాధ్యత పండితులు, శాస్త్రాభిమానులపై ఎల్లప్పుడూ ఉంటుంది. శాస్త్రాన్ని తమ స్వార్ధాలకు వినియోగించుకుంటూ, వక్రభాష్యాలు చెపుతూ తమ జీవన గమనం కోసం లేనివాటిని ప్రచారం చేయడం సామాన్య జనావళిని భయభ్రాంతులకు గురిచేయడం ఈ మధ్య పరిశీలించడం జరుగుతుంది. అందుకే సామాన్యులకు, విజ్ఞులైన పండితులకు అర్ధమయ్యేరీతిలో పురాతన మహర్షి ప్రోక్తాలకు విఘాతం కలుగకుండా ఈ పంచాంగాన్ని నిర్మించడం జరిగినది.

ఈ నా ప్రయత్నాన్ని అర్ధంచేసుకుని అభిమానిస్తారని, అనుసరిస్తారని పెద్దలు ఆశీర్వదిస్తారని ఆశిస్తున్నాను.

## పంచాంగములు-సుముహూర్త నిర్ణయం

**1.తిధి :** శు॥పాడ్యమి,విదియ,బ॥చతుర్ధశి, అమావాస్య సకల శుభకార్యములకు నిషిద్దము.శుద్ద అష్టమి నుండి బ॥అష్టమి వరకు(15రోజులు) సకల శుభకార్యములకు శ్రేష్టమైనవి. **నవమి** తిధి మాత్రం ప్రయాణ, గృహారంభ, ప్రవేశ నూతన వ్యాపారారంభములకు నిషేధించబడినది (నిషిద్ద నవమి త్రయం)

**2. వారము :** సోమ,బుధ,గురు,శుక్రవారములు సకల శుభకార్యములకు శ్రేష్టమైనవి. సోమవారం వివాహం ప్రాంతీయభేదముననుసరించి ఆచరించ వచ్చును. ఆది,శనివారములు ఉపనయన గృహారంభములకు యోగ్యము కాదు. మంగళవారం సకల శుభకార్యములకు నిషిద్దము.

**3. నక్షత్రము :** అశ్వని,రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,మఘ,ఉత్తర,హస్త,చిత్త, స్వాతి,అనూరాధ,మూల,ఉత్తరాషాడ,శ్రవణం,ధనిష్ట,శతభిషం, ఉత్తరాభాద్ర,రేవతి ఈ18 నక్షత్రాలను సర్వసామాన్య శుభ నక్షత్రములుగా పరిగణించడం జరుగుతుంది. ఈ 18 నక్షత్రాలు ఈ క్రింది విధంగా శుభకార్యమునునుసరించి పనికిరాని నక్షత్రాలను విసర్జించి మిగిలిన వాటిని వాడుకొనవలసియున్నది.

**వివాహం :** పునర్వసు, పుష్యమి పనికిరావు

**గృహప్రవేశం :** అశ్వని,పునర్వసు,హస్త,స్వాతి,శ్రవణం పనికిరావు

**ప్రయాణం :** చిత్త పనికిరాదు

**గర్భాదానం :** మూల పనికిరాదు

**ఉపనయనం :** భరణి,కృత్తిక,మఘ,విశాఖ,జ్యేష్ట ఈ 5నక్షత్రాలు మినహా మిగిలిన 22 నక్షత్రాలు పనికివస్తాయి.

**4.యోగము :** విష్కంభం (2గంటలు) అతిగండం (2గంటల 24 నిమిషాలు), శూల (2గంటల 48 నిమిషాలు), గండ (2గంటల 24 నిమిషాలు), వ్యాఘాతం (1గంట 12 నిమిషాలు), వ్యతీపాత్ (12గంటలు), పరిఘ (1గంట 12 నిమిషాలు), వైధృతి (6గంటలు) ప్రారంభము నుండి విడిచి మిగిలిన కాలమంతయూ శుభకార్యములు ఆచరించవచ్చును.

**5.కరణము :** తిధిని అనుసరించియుండును. కావున విసర్జనీయ కరణములు ఏమియూలేవు.

ఈ విధమైన తిధివార నక్షత్రయోగ కరణ రూపమైన కాలస్వరూపమును తెలుసుకొని ఆయా కర్మలను చేయు బుద్ధిమంతులు కాల స్వరూపుని అనుగ్రహము పొందుదురని శాస్త్ర వచనం.

ఈ పంచాంగము నందు పై తెల్పిన నిందిత తిధ్యాదులను విడచి సుముహూర్తములు నిర్ణయించడమైనది. యోగ్య పంచాంగములను స్వీకరించిన పిదప నిర్ణయ లగ్నమునకు గ్రహబలములను నిర్ణయించవలసియున్నది. అంతేకాని గ్రహబలమున్నచో తిధ్యాదులను లెక్కించనవసరము లేదను వాదన నిష్ప్రయోజనము. అట్లైన గ్రహబలముండెనేని అమావాస్యనందు, వివాహాది శుభకార్యములు ఆచరించవచ్చునా? ప్రశ్నించుకొని నిర్ణయించు కొనవలసియున్నది. పండితులైనవారు సామాన్యులను వక్రమార్గమున పయనింపచేయరాదని మనవి చేయుచున్నాను.

సుముహూర్త నిర్ణయములో ఏకవింశతి మహా దోషములను తప్పక విసర్జించవలెను. అందు షష్టారిఫ (6,8,12) దోష చక్రము, అష్టమ (8) కుజ దోషము, భృగు షట్క(6) దోషములను తప్పని సరిగా పరిశీలించి నిర్ణయించవలెను. వివాహ ముహూర్త నిర్ణయములో సప్తమ స్థానము(7) నందు చంద్రుడుతో సహ ఏ ఇతర గ్రహములు లేకుండా ఉండుట శ్రేష్టము. గృహారంభ, ప్రవేశ సుముహూర్తములకు వృషభచక్ర, కలశచక్ర పరిశీలన అత్యంత అవశ్యకము.

**ఖచ్చితమైన సుముహూర్త నిర్ణయమునకు పంచాంగకర్తను సంప్రదించండి.**

| షష్టాష్టారిఫః (6,8,12) చంద్ర దోష చక్రము | | | | | అష్టమ (8) కుజ దోష చక్రము | | వివాహమునకు సప్తమ (7) చంద్ర దోష చక్రము | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ముహూర్త నక్షత్రం | చంద్ర రాశి | 6 చంద్ర దోషలగ్నం | 8 చంద్ర దోషలగ్నం | 12 చంద్ర దోషలగ్నం | కుజుడు ఉన్న రాశి | 8 కుజదోష లగ్నం | ముహూర్త నక్షత్రం | చంద్ర రాశి | 7 చంద్రదోష లగ్నం |
| అశ్వని | మేషం | వృశ్చికం | కన్య | వృషభం | మేషం | కన్య | అశ్వని | మేషం | తుల |
| రోహిణి | వృషభం | ధనస్సు | తుల | మిధునం | వృషభం | తుల | రోహిణి | వృషభం | వృశ్చికం |
| మృగశిర1,2 | వృషభం | ధనస్సు | తుల | మిధునం | మిధునం | వృశ్చికం | మృగశిర12 | వృషభం | వృశ్చికం |
| మృగశిర3,4 | మిధునం | మకరం | వృశ్చికం | కర్కాటకం | కర్కాటకం | ధనస్సు | మృగశిర34 | మిధునం | ధనస్సు |
| ఆరుద్ర | మిధునం | మకరం | వృశ్చికం | కర్కాటకం | సింహం | మకరం | ఆరుద్ర | మిధునం | ధనస్సు |
| పునర్వసు123 | మిధునం | మకరం | వృశ్చికం | కర్కాటకం | కన్య | కుంభం | పునర్వసు123 | మిధునం | ధనస్సు |
| పునర్వసు 4 | కర్కాటకం | కుంభం | ధనస్సు | సింహం | తుల | మీనం | పునర్వసు4 | కర్కాటకం | మకరం |
| పుష్యమి | కర్కాటకం | కుంభం | ధనస్సు | సింహం | వృశ్చికం | మేషం | పుష్యమి | కర్కాటకం | మకరం |
| మఘ | సింహం | మీనం | మకరం | కన్య | ధనస్సు | వృషభం | మఘ | సింహం | కుంభం |
| ఉత్తర 1 | సింహం | మీనం | మకరం | కన్య | మకరం | మిధునం | ఉత్తర 1 | సింహం | కుంభం |
| ఉత్తరం234 | కన్య | మేషం | కుంభం | తుల | కుంభం | కర్కాటకం | ఉత్తర 234 | కన్య | మీనం |
| హస్త | కన్య | మేషం | కుంభం | తుల | మీనం | సింహం | హస్త | కన్య | మీనం |
| చిత్త12 | కన్య | మేషం | కుంభం | తుల | **శుక్రుని రాశి** | **6 శుక్రదోషలగ్నం** | చిత్త12 | కన్య | మీనం |
| చిత్త 34 | తుల | వృషభం | మీనం | వృశ్చికం | మేషం | వృశ్చికం | చిత్త34 | తుల | మేషం |
| స్వాతి | తుల | వృషభం | మీనం | వృశ్చికం | వృషభం | ధనస్సు | స్వాతి | తుల | మేషం |
| అనూరాధ | వృశ్చికం | మిధునం | మేషం | ధనస్సు | మిధునం | మకరం | అనూరాధ | వృశ్చికం | వృషభం |
| మూల | ధనస్సు | కర్కాటకం | వృషభం | మకరం | కర్కాటకం | కుంభం | మూల | ధనస్సు | మిధునం |
| ఉత్తరాషాడ1 | ధనస్సు | కర్కాటకం | వృషభం | మకరం | సింహం | మీనం | ఉత్తరాషాడ1 | ధనస్సు | మిధునం |
| ఉ.షాడ234 | మకరం | సింహం | మిధునం | కుంభం | కన్య | మేషం | ఉ.షాడ234 | మకరం | కర్కాటకం |
| శ్రవణం | మకరం | సింహం | మిధునం | కుంభం | తుల | వృషభం | శ్రవణం | మకరం | కర్కాటకం |
| ధనిష్ట12 | మకరం | సింహం | మిధునం | కుంభం | వృశ్చికం | మిధునం | ధనిష్ట 12 | మకరం | కర్కాటకం |
| ధనిష్ట34 | కుంభం | కన్య | కర్కాటకం | మీనం | ధనస్సు | కర్కాటకం | ధనిష్ట 34 | కుంభం | సింహం |
| శతభిషం | కుంభం | కన్య | కర్కాటకం | మీనం | మకరం | సింహం | శతభిషం | కుంభం | సింహం |
| ఉత్తరాభాద్ర | మీనం | తుల | సింహం | మేషం | కుంభం | కన్య | ఉత్తరాభాద్ర | మీనం | తుల |
| రేవతి | మీనం | తుల | సింహం | మేషం | మీనం | తుల | రేవతి | మీనం | తుల |

# ఏల్నాటి శని ప్రభావం



జన్మరాశికి -12, 1,2 రాశులలో శని సంచరించుటనే ఏల్నాటి శని యందురు. ఒక్కొక్క రాశిలో 2 1/2 సం॥రములు చొప్పున మొత్తం 7 1/2, సం॥రములు దోషమగును. 12వ రాశిలోనికి రాగానే ధనవ్యయముపై దెబ్బతీయును. దరిద్రము, ఇంటిపోరు, కష్టములు, మానహాని, వ్యవహారించి చిక్కులు కలుగును. జన్మ (1) రాశిలోనికి రాగానే గతంలో మిగిలిన దేమైనావుంటే అది కూడా ఖర్చు చేయించి శరీరమును బాధించును. బంధు అరిష్టము, కళత్రపీడ, గురించలేని వ్యాధులు, మతిభ్రమణం, కళాకాంతులు, లేకపోవుట కలిగించును. 2వ రాశికి రాగానే ఎనలేని ఆశలు కల్పించును. కాని నిందలుపడుట, నిత్యదు:ఖము కలుగును. మానసికముగా క్రుంగదీయును. 3వ రాశిలోనికి ప్రవేశించగానే సర్వ శుభములూ కలిగించును. జననకాలంలో శని స్వస్థాన, ఉచ్ఛలగ్నములందు శని అధిపత్య నక్షత్రము లందు జన్మించిన వార్కి ఈ శని రాశుల సమీప సంచారమందు ఉన్నతిని కల్గించునని భావించవచ్చును.

మొత్తం మీద శని సంచారవేళ - 'గురుబలం' కొంత ఉపయుక్తమౌతుంది. ఏది ఏమైనా ఈ 7 1/2 సంవత్సరాలు శనిస్తోత్రం, జపం, దాన, ధాన్యశాంత్యాదులు మృత్యుంజయ మంత్ర జపం చేయాలి. శని పీడా పరిహారార్థమై తూ॥గో॥జిల్లా, కొత్తపేట తాలూకా - **'మందపల్లి'** గ్రామమందు వెలసియున్న శ్రీ శనైశ్చరస్వామి వారికి తైలాభిషేకము, హోమాదులు జరుపుట శ్రేయస్కరం.

మరి చిక్కులు పడేవారు తంత్రశాస్త్రం ప్రకారం కాలిమట్టి, పాతమేకు గ్రహించి నల్లగుడ్డలో శనీశ్వరయంత్రం లిఖించి అచ్చట కాలువలో వర్జించవలెను. నలుపు వస్త్రము, నువ్వులు, నూనె, బెల్లము, నవధాన్యాలు మున్నగు పదార్థాలు అభిషేకమునకు వినియోగించదగును.

నల్లనువ్వులు, బెల్లం కలిపి పడమర దిశగా కాకికి గాని నల్లని ఆవుకు పెట్టినచో శనిగ్రహ దోష నివారణ జరుగును. జాతి నీలం ఎడమ చేతి మధ్యవ్రేలికి ధరించవలెను.

| | సం॥ | నె | రో | ఫలం |
|---|---|---|---|---|
| 1. | 0 | 3 | 10 | ముఖమునందు-హాని, పీడ, వ్యయ ప్రయాణాలు, |
| 2. | 1 | 1 | 00 | దక్షిణభుజము-జయం, లాభం, కొతవరకు శాంతి |
| 3. | 1 | 8 | 10 | పాదములు త్రిప్పుట, బెంగ, అశాంతి. |
| 4. | 1 | 4 | 20 | హృదయస్థానం, ధనప్రాప్తి, గౌరవం, ఉన్నతి, స్థిరం |
| 5. | 1 | 1 | 10 | నామభుజం-రోగము, దు:ఖము, అస్థిమితం |
| 6. | 0 | 10 | 00 | శిరోభాగం-సంతోషం, లాభం, లాటరీ ఛాన్సు |
| 7. | 0 | 6 | 20 | కన్నులు-మర్యాద, మన్నన, సంతోషం |
| 8. | 0 | 6 | 20 | గుదము-గొప్ప దు:ఖం, మానహాని |
| మొత్తం | 7 | 6 | 0 | |

## శంఖుస్థాపనాది శుభ ముహూర్తములకు యోగ్యమైన, తిథి, వార, నక్షత్ర లగ్న శుద్ధి చక్రము

| శుభకార్యము | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | శుద్ధి - విశేషములు |
|---|---|---|---|---|---|
| గృహారంభం | 2,3,5,7,10 11,13,15 | సోమ,బుధ గురు,శుక్ర | అశ్వ, రో,మృ,ఉత్తరాత్రయం, హస్త చిత్త, స్వాతి, అనూ, శ్ర, ధని, శత, రేవతి | వృష, మి, సిం, కన్య, వృశ్చి, కుంభం, మీనం | అష్టమ శుద్ధి-కర్తరీ, మిధున ధనుర్మా సములు, చక్రశుద్ధులు నింద్యములు |
| గృహప్రవేశం | 1,3,5,7,10 11,13,15 | సోమ,బుధ గురు,శుక్ర | రోహి, మృగ, ఉత్తరాత్రయం, చిత్త అనూ, ధని, శత, రేవతి (పుష్యమి) | వృష, మి,సిం,కన్య, వృశ్చి ధను, కుంభం, మీనం | అష్టమ శుద్ధి - కలశచక్ర శుద్ధి (చతుర్థ శుద్ధి) |
| నిషేకం | 2,3,5,7, 10,13 | సోమ,బుధ గు,శు,శ | అశ్వ, రో,మృ, పున,పుష్య,ఉత్తరాత్రయం హ,చి,స్వా,అనూ,మూ, శ్రవ, ధని, శత, రేవ | శుభయుత దృష్టి లగ్నములు | సంధ్యా, పర్వ, ప్రదోష, వ్రత, శ్రాద్ధ సమయాలు నింద్యం |
| గర్భాదానం | 2,3,5,7 10,13 | ఆది,సోమ బు,గు,శు | రో,మృ, ఆరు, పున,పుష్య, పూ॥త్రయం, ఉ॥త్రయంహ,చి,స్వా,అనూ,మూ,శ్రవ,ధని, శత, | శుభయుత దృష్టి లగ్నములు | సంధ్యా, సర్వ, ప్రదోష, వ్రత, శ్రాద్ధ సమయాలు నింద్యం |
| పుంసవన సీమంతములు | 2,3,5,7,10 11,13,15 | ఆది,మంగ బు,గు,శు | మృ,పున,పుష్య,హ, అనూ, శ్రవ, ధ, శత, రే (అశ్వ, రో,చి,స్వా, ఉత్తరాత్రయం) | మే,వృష,మి,తుల, కుంభ, మీనం | పుంసవనమునకు 3వ నెల సీమంతమునకు 4,6,9 నెలలు |
| జాతకర్మ నామకరణములు | 2,3,57,10 11,13 | ఆది,సోమ బు,గు,శు | అశ్వి,రో,మృ,పున,పుష్య,హ,చి,స్వా అనూ, ఉత్తరాత్రయం, శ్ర, ధని, శత, రేవతి | శుభలగ్నములు | అష్టమశుద్ధి, లగ్నశుద్ధి |
| అన్నప్రాశనం | 2,3,5,7 10,13,15 | ఆది,సోమ బు,గు,శు | అశ్వ,రో, మృ, పున,పుష్య, ఉత్తరాత్రయం హ,చి,స్వా,అనూ,శ్రవ, ధని, శత,రేవతి | మేష,మీన, వృశ్చిక, మీనం | దశమ శుద్ధి, పూర్వాహ్ణం పురుషులకు సరి, స్త్రీలకు బేసినెలలు |
| కర్ణవేధ | 2,3,5,7 10,13,15 | సోమ,బుధ గురు,శుక్ర | అశ్వ, రో, మృ,ఆర్ద్ర, పున, పుష్య, ఉత్తరాత్రయం హ,చి,శ్రవ, ధని,శత, అనూ, రేవతి | మేష,వృష,మిధున, కటక, కన్య తుల, ధను, మక, మీనం | 6,7,8 మాసములు అష్టమ శుద్ధి |
| కేశఖండనం | 2,3,5,7,10 11,13,15 | సోమ,బుధ గురు, శుక్ర | అశ్వ, మృగ, పున, పుష్య, హ,చి,స్వా (జ్యే) శ్రవ, ధన, శత (రేవతి) | శుభలగ్నములు | ఉత్తరాయణ పూర్వాహ్ణం బేసి మాసములు, అష్టమ శుద్ధి |
| అక్షరాభ్యాసం | 2,3,5,7 10,11,13 | సోమ,బుధ గురు,శుక్ర | అశ్వ, రేవతి, పున, పుష్య, హ,చి,స్వా అనూ, శ్రవ,(మృ, ఆర్ద్ర, ధని,శత), రేవతి | మే, కన్య, ధను, మీనం | అష్టమ శుద్ధి, ఉత్తరాయణం 3,5 సంవత్సరాలలో |

| | | | | | |
|---|---|---|---|---|---|
| విద్యారంభం | 2,3,5,7, 10,11,13, | సోమ,బుధ గురు,శుక్ర | అశ్వ,మృగ,ఆర్ద్ర,పున,పుష్య,ఆశ్రే, పూర్వా,ఉత్తరాత్రయం, హ,చి,స్వా,మూ, శ్రవ, (ధ,శ,అనూ) | మే, మి, కటక, కన్య, తుల ధన, మకరం | దివా భాగము శుభము |
| ఉపనయనం | 2,3,5,7,10 11 - (6-12) | సోమ,బుధ గురు,శుక్ర | అశ్వని, రో, మృగ,పున, పుష్య,ఉత్తరాత్రయం హ,చి,స్వా,అనూ,శ్ర,ధ,శత,రేవతి | శుభలగ్నములు | అష్టమశుద్ధి మీనచైత్రము శుభము |
| వివాహం | 2,3,5,7,10 11,12,13,15 | బుధ గురు,శుక్ర | రో,మృగ,మఘ,ఉత్తరాత్రయం, హ, అనూ స్వాతి,మూ,శత,రే,(అశ్వి,శ్ర,చి,ధ) | శుభలగ్నములు | జామిత్ర శుద్ధి |
| వాపి కూపాదికం | 1,3,5,7, 10,11,13,15 | సోమ,బుధ, గురు,శుక్ర | అశ్వ, రో,మృ,పుష్య,ఉత్తరాత్రయం, హస్త అనూ (జ్యే) మూల శ్రావణం, ధని, శత, రేవతి | కర్కాటకం, మకరం, కుంభం, మీనం | ఆగ్నే,దక్షిణ, నైఋతి, వాయు దిశలు, గృహ మధ్యం కూడదు |
| బీజావాపనం | 2,3,5,7,9 10,11,12,13, | ఆది,సోమ బు,గు,శు | అశ్వ, రో, మృగ, పున, పుష్య,ఉత్తరాత్రయం, హ,చి,స్వా,అనూ,శ్రవ, ధని, శత, రేవతి | వృష, కర్కట, సింహ (తుల) మక, (కుంభం, మీనం) | అష్టమ శుద్ధి 3,6 లలో శుభం |
| దేవతాప్రతిష్ఠ | 2,3,5,7,8 10,11,12,13 | ఆది,సోమ బు,గు,శు | అశ్వ, రో,మృగ,పున,పుష్య,ఉత్తరాత్రయం, హ,చి,స్వా,అనూ, శ్రవ,ధని, శత, రేవతి | వృష, వృశ్చి, సిం, కన్య, ధను, కుంభ, మీనం | శుభులకు ఉత్తరాయణం మిగిలిన వార్కి దక్షిణాయనం |
| యాత్ర | 2,3,5,7 10,11,13 | బుధ,గురు శుక్ర | అశ్వ, రో,మృ,పున, పుష్య,(ఉత్తరాత్రయం) హ, అనూ, (మూ), శ్రవ,ధ,(శత) రేవతి | మేష, కటక, తుల, వృశ్చి ధను, మకర, మీనం | పంచమశుద్ధి, వారశూలలు కూడవు. |
| హలకర్మ | 2,3,5,7 10,11,13,15 | ఆది, మంగ, బుధ, గురు | అశ్వ, రో, మృగ, పున,పుష్య, మఖ, ఉత్తరాత్రయం, హ,చిత్త, స్వా,వి,అనూ,మూల, శ్రవ, ధ, శత | వృష, మిధున, కన్య, వృశ్చి ధను, మీనం | కర్తరి కూడదు |
| క్రయవిక్రయ వాణిజ్యారంభం | 2,3,5,7, 10, 11, 13,15 | ఆది, సోమ బుధ, గురు శుక్ర, శని | అశ్వ, భర, కృత్తి, రో, మృ, (ఆర్ద్ర), పుష్య, ఆశ్లే పూర్వాత్రయం, ఉత్తరాత్రయం, హ,చి, స్వా (విశా), అనూ, శ్రవ, శత, రేవతి | కుంభం, వినా - | శు.చ.శుభయుతం, అష్టమ దశమశుద్ధి శుద్ధి 12,2,11 శుద్ధి |

శుభకర్మలయందు – మహాదోషములు : దుష్టతిథి, వారనక్షత్ర, యోగకరణములు (విష్కంభం, అతిగండ శూల, గండ, పరి, వ్యతీ, పరిఘ, వైధృతి, దుష్టయోగము, విష్టి, శకుని, చతు, నాగ, కింస్తుఘ్నము) సంక్రాంతి, అయనదినములు, పాపాక్రాంత, పాపదృష్ట లగ్నములు, అష్టమకుజుడు, షష్ఠశుక్రుడు, పాపగ్రహకర్తరి, జన్మలగ్న చంద్రలగ్నములకు అష్టమలగ్నము, షష్ఠాష్టమ ద్వాదశములలో చంద్రుడు సగ్రహచంద్రుడు, వేదాక్రాంతలు, గ్రహణనక్షత్రము, వర్జ్యదుర్ముహూర్తములు, తిథినక్షత్ర లగ్న సంధులు, మహపాతలు ఇవి విడువదగినవి. శుభముహూర్తములకు మహాదోషములను విడువవలెను. ఆయా శుభకర్మలకై ఇందు చెప్పబడిన తత్కాలముసున్నవి యగు తిథి పక్షాదినుండి లెక్కింపవలెను. వారనక్షత్ర లగ్నము గలిపి 9చే భాగించగా నగు శేషము 1,2,4,6,8 యగుచోనవి క్రమముగ మృత్యు, అగ్నిరాజ, చోర, రోగ భయములను చేయును. 3,5,7,9 ఇవి శేషమగుట శుభము. 1-2 మిక్కిలిదోషం. గత తిథి లగ్న సంఖ్యలను కలిపి 9 చే భాగించుట మతాంతరము.

# పెదగాడి వారి పుట్టుమచ్చల శాస్త్రము

సృష్టికర్త మానవులయొక్క శరీరములను వారివారి పూర్వజన్మ పుణ్యపాప కర్మలను బట్టి సృష్టించును. వారి శరీరములపై భవిష్యత్ ను తెలుసుకొనుటకు వారి వారి పూర్వజన్మ సుకృత దుష్కృతములను బట్టి కొన్ని గుర్తులు కల్పించబడును. అట్టి గుర్తులే పుట్టుమచ్చలనబడును.

**"స్త్రీణాం ధన్యా వామ భాగే పురుషాణాంచ దక్షిణే"**

అను ప్రమాణానుసారం స్త్రీలకు ఎడమ భాగము, పురుషులకు కుడిభాగమునందును ఉన్న పుట్టుమచ్చలను అనుసరించి ఫలితము తెలియవలెను. పుట్టుమచ్చలు రంగు ఆకారములనుసరించి ఈ క్రింది విధముగా శుభఫలములిచ్చును

| రంగు | ఆకారము | ఫలము | వ్యక్తులు |
|---|---|---|---|
| బాదంపప్పు రంగు | గుండ్రని | శుభం | ప్రభుత్వోద్యోగులు |
| తెలుపు | గుండ్రని | శుభం | ధనవంతులు |
| ఎరుపు | త్రికోణం | శుభం | పోలీస్, సైనికులు |
| నీలము | జ్యోతి ఆకారం | శుభం | వ్యాపారులు |
| పసుపు | దీర్ఘచతురస్రం | శుభం | దైవజ్ఞులు, ఉపాధ్యాయులు |
| ఛామనచాయ | పంచకోణం | శుభం | కళాకారులు |
| నలుపు | అర్ధచంద్రాకారం | సామాన్యం | ఇనుము,తిల,తైల వ్యాపారులు |

ఈ క్రింది పుట్టుమచ్చలు ఆకస్మిక ధనలాభము కలిగించును. విద్యా ఉద్యోగముల యందు ఉన్నత స్థితిని పొందింపచేయును. ఆకస్మికముగా సకల భోగభాగ్యములు ధన,కనక,వస్తు వాహనములు ప్రసాదించును.

1. ఫాలభాగము 2. కనుబొమల మధ్య 3.కణత 4.కన్ను 5.కంటిరెప్పలోపలి భాగము 6.శిరస్సు 7. ముక్కు 8.ముక్కుకొన 9.గడ్డము 10.గడ్డము క్రింద 11.పైపెదవి 12.క్రిందిపెదవి 13.చెక్కిళ్ళు 14.రెండుచెవులమీద రెండు పుట్టుమచ్చలు 15.కంఠము 16.నాలుక పైభాగము 17.రొమ్ము 18.పొట్ట 19.భుజములు 20.మోచేయి 21.మణికట్టు 22.అరచేయి క్రిందిభాగము 23.ఉంగరపువేలు 24.చిటికెన వేలు 25.వెన్నుపూస 26.వీపు 27.వెన్నుపూసచివర(పిరుదలకు సమీపున) 28.వృషణములు 29.తొడలు 30.మోకాళ్ళు 31.చీలమండలి 32.అరికాలు మధ్యభాగము

**స్త్రీలకు 20సంవత్సరముల మీదట, పురుషులకు 25సంవత్సరముల మీదట పై పుట్టుమచ్చలు ఫలితములను కలుగజేయును.**

శరీరము మీదనుండు పుట్టుమచ్చలు నేలపై సాష్టాంగముగా, వెల్లకిలా పరుండునప్పుడు నేలకు తగలని ప్రదేశములలో ఉన్నచో శుభఫలితములను కలుగజేయునని శాస్త్రవచనము



# బల్లి, తొండ శాస్త్రము

| స్థానం | పురుషులకు | స్త్రీలకు | స్థానం | పురుషులకు | స్త్రీలకు |
|---|---|---|---|---|---|
| మస్తకం | సుఖప్రాప్తి | లక్ష్మీప్రాప్తి | ఎడమచెయ్యి | కలహం | లాభం |
| జుట్టు | సుఖప్రాప్తి | లక్ష్మీప్రాప్తి | కుడిచేతికీలు | అలంకారం | ధనక్షయం |
| జుట్టుముడి | రోగం | రోగం | ఎడమచేతికీలు | ద్రవ్యనాశం | భూషణం |
| వెంట్రుక | ధననాశనం | మరణం | కుడిమోచేయి | ద్రవ్యహాని | భూషణం |
| నెత్తి | మరణం | మృత్యం | ఎడమమోచేయి | భూలాభం | భూలాభం |
| నుదుట | ధనప్రాప్తి | ధననాశనం | కుడిచేతివ్రేలు | ఇష్టార్థసిద్ధి | అలంకారం |
| కనుబొమ్మలు | ద్రవ్యనాశం | ధననాశనం | ఎడమచేతివ్రేలు | భూప్రాప్తి | భూలాభం |
| కుడికన్ను | ద్రవ్యలాభం | ధననాశనం | కుడిచేతిగోరు | ద్రవ్యనాశం | హాని |
| ఎడమకన్ను | శుభం | దుఖం | ఎడమచేతిగోరు | ధననాశనం | ధన నాశనం |
| ముక్కు | విందుభోజనం | విందుభోజనం | కుడిఅరచేయి | సౌఖ్యం | సౌఖ్యం |
| కుడిచెవి | వ్యసనం | వ్యసనం | ఎడమఅరచేయి | ధనలాభం | ధనలాభం |
| ఎడమచెవి | లాభం | ధనవ్యయం | వీపు | మిత్రలాభం | బంధునాశనం |
| కుడిచెంప | దుఖం | సువర్ణలాభం | వీపు పక్కలు | బంధుదర్శనం | బంధుదర్శనం |
| ఎడమచెంప | ఇష్టలాభం | భర్తకు కష్టం | పొట్ట | ద్రవ్యనాశనం | శుభం |
| క్రిందిపెదవి | భోజనం | మిత్రదర్శనం | రొమ్ము | సౌభాగ్యం | దుఖం |
| పై పెదవి | సంపద | సంపద | ఎడమదండం | కష్టం | ఆభరణలాభం |
| గెడ్డం | కలహం | కలహం | కుడి దండం | కీర్తిలాభం | కీర్తిలాభం |
| గొంతు | రాజద్వేషం | కలహం | నడుము | వస్త్రలాభం | వస్త్రలాభం |
| మెడ | మిత్రాగమనం | భూలాభం | బొడ్డు | జయం | కీర్తి |
| కుడిభుజం | శత్రుభయం | నిత్యకలహం | తొడ | వస్త్రనాశనం | సంతానలాభం |
| ఎడమభుజం | జయము | సుఖం | మోకాలు | బంధనం | బంధనం |
| కుడిచెయ్యి | పరాజయం | పరాజయం | కాళ్ళు | ప్రయాణం | ప్రయాణం |

**శరీరముపై బల్లి లేదా తొండ పడిన వెంటనే శిరః స్నానము చెయ్యవలెను. ఇష్టదైవము ముందు నువ్వుల నూనె లేదా ఆముదముతో దీపము వెలిగించవలెను. ఉప్పు నివేదనగా ఉంచి దోషపరిహార్థమై భక్తిశ్రద్ధలతో ఇష్టదైవమును ప్రార్థించలెను. కంచి క్షేత్రములోని బంగారు బల్లిని లేదా వెండి బల్లిని తాకినవారికి పైదోషములు లేవు**

